# Mr. K. V. Gopalam's

# The Redeemer of the Faithful

WITH

a brief sketch of his life and preface

BY


**ANAM CHUNDRA PATRA,**

*Head Master, B. M. Secondary School,*

BERHAMPORE.




కే. వి. గోపాలముగారి

# భక్తపాపహార ప్రబోధిని.


బర్హాంపురములో

బి. ఎమ్. సెకండరీస్కూల్ హెడ్మాష్టరుగానున్న

అనామచంద్రపాత్రోగారివలన ప్రకటింపబడియె.



మొదటి కూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము.

ప్రాక్ ఇండష్ట్రియల్ ప్రెస్ ముద్రాక్షరశాల.

1914.

వెల. 0—8—0

# Mr. K. V. Gopalam's

# The Redeemer of the Faithful

WITH

**a brief sketch of his life and preface**

BY

## ANAM CHUNDRA PATRA,

*Head Master, B. M. Secondary School,*

BERHAMPORE.

కే. వి. గోపాలయ్యగారి

# భక్తపాపహారి ప్రబోధిని.

ఇంగ్లీషక్షరములలో

బి. ఎమ్. సెకండరీస్కూల్ హెడ్మాష్టరుగానున్న

అనామచంద్రపాత్రోగారిచేత ప్రకటింపబడినది.

---

మొదటి కూర్పు. 1000 ప్రతులు.

---

రాజమహేంద్రవరము.

[illegible] ఇండస్ట్రియల్ మిషన్ ముద్రాక్షరశాల.

1914.

వెల. 0—8—0

# విషయసూచిక.

# CONTENTS.

# పీఠిక.

గ్రంథకర్తయగు కే. వి. గోపాలముగారి జీవిత చరిత్ర ప్రకటితమయిన సత్యదూత మిగుల ఆలస్యముగ దొరకినందునను, తత్పూర్వము కొన్ని కొన్ని యిబ్బందులు కలిగినందునను, "భక్తపాపహార ప్రబోధిని" వెడలుట కింత కాలము పట్టినందుల కెంతయు చింతిల్లుచున్నారము. అయినను ఈ కాలయాపనము గ్రంథసారోద్దేశముల నెంతమాత్రమును తగ్గింపకుండుగాక.

1910 సంవత్సరపు జూలై నెల సత్యదూత ఇట్లు వ్రాయుచున్నది:—

"కే. వి. గోపాలముగారు 1860 ఆగస్టు నెల 1 తేదీని జన్మించిరి. కాకినాడలో విద్యార్థిగా ఉండినపుడు ప్రీట్ మిశమ్మగారు పెట్టిన సండేస్కూలులో బైబిలుసంగతులు మొదట నేర్చుకొనెను. తన తరగతిలోని హిందూబాలురకు ఆమె బైబిలుగ్రంథములు బహుమానముగా ఇచ్చెను. ఈయన ఆ పుస్తకమును ఇంటికి తీసికొనివెళ్ళగా స్వజనులాపుస్తకమును చూచి క్రైస్తవమతగ్రంథమని కాల్చివేసిరి. ఈయన రాజమండ్రి కాలేజిలో చదువుకొనుచున్నప్పుడుకూడ క్రైస్తవబోధ వినుచువచ్చెను. మెట్రిక్యులేషనుతరగతిలో చదువుకొని ధవళేశ్వరము మిషన్ స్కూలులో ఉపాధ్యాయుడాయెను. అక్కడ క్రైస్తవుల సహవాసమున తరచుగా బోధ వినుచుండినను, క్రైస్తవబోధకు విరుద్ధముగ చాల మొండివాదము చేసెడివారు. తుదకు ఏలాగైననేమి ఆయన హృదయము క్రైస్తవమతముతట్టు తిరిగెను. ఇట్లు హృదయము మారుట స్వజనులు తెలిసికొని కఠినము

గా చూచిరి. అయినను ఆయన క్రీస్తుమత మవలంబించుటకు నిశ్చయించుకొనెను. ఆయన బాప్తిస్మము పొందవలెనని కోరగానే లేట్ రెవరెండు ఎఫ్. ఎస్. డీక్రికుక్కు దొరగారు బంధువులవల్ల హాని కలుగకుండ చాలకాపాడినారు. ... ... ... ...

ధవళేశ్వరములో స్నానమిచ్చినయెడల బంధుమిత్రాదులవల్ల చాల కష్టము కలుగునని డీక్రికుక్కు దొరగారు ఈయనను సామర్లకోట తీసికొనివెళ్ళి 1889వ సం॥ మార్చినెల 10 తేదీని బాప్తిస్మమిచ్చిరి. గోపాలముగారు క్రైస్తవుడైనందున స్వజనులకు మరింతకష్టము తోచెను. వారివల్ల హానికలుగునని దొరగారు ఈయనను బడికి వేరొక పెడబారిని వెళ్ళునట్లు చేసిరి. ధవళేశ్వరములో బంధువులున్న స్థలమున పని చేయుట ఎప్పటికైనను ఆపదయే యని డీక్రికుక్కు దొరగారు గోపాలముగారిని రాజమండ్రి మిషన్ స్కూలుపనికి పంపిరి.

గోపాలముగారు హిందూమతగ్రంథములు బాగుగా చదివినవారు. ఆగ్రంథములలో ఏయేసంగతులు ఎక్కడనున్నవో ఆయన యెరిగియుండుటమాత్రమే కాక, బైబిలులోకూడ ఏసంగతులెక్కడ నున్నవో బాగుగ తెలిసికొనెను. ఈయన మహమ్మదీయ మతమును గురించికూడ ఇంగ్లీషులో వ్రాయబడియున్న గ్రంథములు చదివిరి. ఈయనను మతవిషయములు చదువుకొన్న గొప్ప విద్యార్థియని చెప్పవచ్చును. గోపాలముగారు „జగద్గురుప్రదర్శిని" „పాపోపశమన తత్వప్రకాశిక" అను రెండు పుస్తకములు ప్రచురించిరి. „భక్తపాపహార ప్రబోధిని" అను మరియొక పుస్తకము అచ్చునకిచ్చినారు. సగము అచ్చుపడినది. ఇవికాక కొన్ని చిన్న పత్రికలుకూడ రచించిరి. ఇంకను కొన్ని పుస్తకములురచించుటకుగాను సామగ్రి

పోగుచేసియుంచిరి. దూషణలుచేయక హిందూమత గ్రంథముల యందు అసంగతవాక్యములని తమకు తోచిన వాక్యములను అనేకము ఎత్తిచూపుచు ఇంత గొప్ప గొప్ప పుస్తకములను వ్రాసినవారు ఆంధ్రదేశీయ క్రైస్తవులలో ఎవ్వరును కనుపింపరు. గ్రంథాధ్యయనము చేయుటలోను గ్రంథరచన చేయుటలోను ధనవ్యయము చేయుటమాత్రమేకాక ఈయన తన దేహబలమును జ్ఞానబలమును సమర్పించినారనియే చెప్పవలెను. తమకు కావలసిన సంగతులు సులువుగా దొరకుట చూచి ప్రభువే సహాయము చేయుచున్నాడని ఆయన యెంతో సంతోషించువారు. స్వాధీనముకాని హిందూ పండితులయొద్దనుండి కూడ కొంత సామగ్రి పోగుచేయుటయును, సంస్కృత శ్లోకార్థములను గుఱించి వారియొద్ద ఆలోచన అడుగుట యును కలిగియుండెను. ఎంతగొప్ప పండితులనైనను క్రీస్తు లోపర్చుకొనగలడు అని ఆయన చెప్పెడివారు. పనియందు ఆయనకు ఏమాత్రమైనను ఆశతీరలేదు. ఇంకను దేవుడు ఆయుస్సు ఇచ్చిన యెడల కొన్ని గ్రంథములు రచింపవలెననియు, ప్రభువు పనిచేయవలెననియు ఆయనకు చాల కోరిక యుండెను. భక్తపాపహార ప్రబోధిని అనుపుస్తకము అచ్చుపడగా చూడవలెనని చాల ఎదురుచూచిరిగాని నిష్ప్రయోజనమాయెను. మిగిలియున్న గ్రంథరచనపని ప్రభు వెవరిచేతనయిన చేయించునని ఆయన నమ్మిక. గోపాలము గారు వ్రాసినసంగతులు కొన్ని సత్యదూత చదువరులు ఎరుగుదురు. ఈయన బెజవాడలో కొంతకాలము బోధపని చేసిరి. ఈమధ్యనే యేలూరు హైస్కూలులో బైబిలు టీచరుగా కొంతకాలము పనిచేయుచు కిడ్నీ జబ్బువల్ల బాధపడి జబ్బు బాగుచేయించుకొనుటకై పిఠాపురము వెళ్ళి జబ్బు కుదరదని మిషనెరీవైద్యులవల్ల విని చనిపో

పుటనై స్వజనులయొద్దకు రాజమండ్రి వచ్చిరి. ముఖ్యముగా హిందూమతగ్రంథములు తెలిసినవారి యుపయోగార్థము పనిచేయుటకై దేవుడు లేవనెత్తిన కే. వి. గోపాలముగారు ఇక్కడ మార్చినెల 5వ తేదీన ప్రభువునందు నిద్రించిరి. ««ఈయన మనస్సులోను మా మనసులలోను ఏ విధమైన కలత లేకుండ జేసి అప్పుడీయనను తీసికొనుము" అని యీయనభార్య చేయుచువచ్చిన ప్రార్థన దేవుడాలకించి తన భక్తుని తన సన్నిధికి చేర్చుకొనెను."

గోపాలముగారు హిందూమతగ్రంథముల పరిచయముగలవారగుటచేత వానిలోనిసంగతులను విమర్శనార్థమై యుదాహరింపకుండ క్రైస్తవేతరుల కెన్నడును క్రీస్తుమతము నుపదేశించి యుండలేదు. ఈయన రాజమహేంద్రవరములో పనిచేయుచున్నప్పుడు కొన్నాళ్ళు సామర్లకోట సెమినెరి మాసపత్రికలో హిందూమతమును విమర్శించుచువచ్చిరి. బెజవాడకు వెళ్ళినతరువాత సత్యదూతలో అనేకాంశములు వెల్లడించిరి. తనవ్రాతల నెవరైన విమర్శించుదురేమో యని ఆయన హిందూవార్తాపత్రికలు చూచుచుండువారు. ఎవరైన విమర్శింపమొదలుపెట్టినయెడల తన యొద్దనున్న సరకంతయు నొకదానివెనుక నొకటి పూర్తిగ బయటకు దీయు తరుణము తటస్థమగునని ఆయన చాల కనిపెట్టిరి. కాని యెవరును ఆయనవ్రాతలను విమర్శించినట్లు తోచదు.

హిందూమతమును ఖండించుచు క్రీస్తుమతోపదేశకుల ఉపయోగార్థమై ఇంతవరకు తెలుగున ముద్రితమయిన పుస్తకములందు గానరాని యంశములనేకములు, ఈయన రచించిన ‹సద్గురుప్రదర్శిని› ‹పాపోపశమన తత్వప్రకాశిక› ఈ ‹భక్తపాపహార ప్రబోధిని› అనుపుస్తకములందు గనపడుచున్నవి. గోపాలముగారు జగద్గురు

ప్రదర్శినిని స్వయముగనే అచ్చువేయించుకొనిరి. అన్నియు అమ్ము
డయిపోయినవి. రెండవకూర్పులో దీనిని వృద్ధిచేయవలెనని ఆయ
న ఉద్దేశించిరి.

పాపోపశమన తత్వప్రకాశిక చెన్నపురిలోని క్రిస్టియన్ లిట
రేచర్ సొసైటీవారు అచ్చువేసిపెట్టిరి. కులాచారము, విగ్రహారాధ
న, వేదములు, మహమ్మదీయమతము, అను ఈ అంశములమీద
పుస్తకములు వ్రాయవలెనని ఆయనకు చాల ఆశయుండెను.

హిందూమతము దైవములని చెప్పువారుగాని, దైవావతార
పురుషులని చెప్పువారుగాని, ప్రసిద్ధిచెందిన ఋషులని చెప్పువారుగా
ని యేమాత్రమును నరలోకపాపములను పరిహరింపలేరని హిందూ
మత గ్రంథముల సాహాయ్యముచేతనే ఋజువుపరచుచు, తుదకుయే
సుక్రీస్తుమాత్రమే పాపపరిహార కార్యము చేయ సమర్థుడని క్రైస్తవ
మత గ్రంథమగు బైబిలుసాహాయ్యముచేత సిద్ధాంతీకరించుటయే ఈ
ప్రబోధినోద్దేశమైయున్నదని చదువరులు గ్రహించుకొనగలరు. క్రీ
స్తు యేసువలన తనకు లభించిన మహానంద భాగ్యము తనదేశీయులం
దరకును లభ్యముకావలెనని గోపాలముగారి యపేక్ష.

ఈ గ్రంథస్వరమెవ్వరికిని కర్ణకఠోరముగ నుండకుండుగాక!
ఇదిప్రత్యక్షపరచిన దోషగణము ఎవ్వరికిని ఆయాసము కలిగింపకుం
డుగాక! ఇది ప్రబోధించిన క్రీస్తుచరిత్ర అందరకును మిగుల శ్రావ్య
ముగనుండి ఆధ్యాత్మికానంద మొసగుగాక!

1 తెస్సలోనీకై 5: 21 చెప్పుచున్నట్లు పాఠకులు సర్వమును
పరిశీలనచేసి యుక్తాంశములను స్వీకరింపవలెనని మా ప్రార్థన.

ఈ పుస్తకము, చదువరుల మనోనేత్రములకు అంధకార రాజ్యమును తేజోమయ రాజ్యమును ప్రదర్శించి, సత్యాసత్య విజ్ఞానమును, నిష్పక్షపాతబుద్ధిని సత్యానుష్ఠానబలమును ఘటింపజేయునట్టి కారణసాధనముగ వర్ధిల్లి, వారు భక్తపాపహారుడగు యేసువలన పాపపరిహారము బడసి ఆయన తెచ్చిన మహారక్షణ ప్రసాద మనుభవించునిమిత్తము తన యుద్యోగధర్మమును జక్కగ నిర్వహించుకొనుటకై దీనిని ఆంధ్రదేశాటనార్థ మంపుచున్నారము.

BERHAMPORE,
July, *1914.*

A. C. PATRA.



# The Redeemer of the Faithful.

# భక్త పాపహర ప్రబోధిని



## 1టి ప్రకరణము.

## పాపమునుగుఱించి.

దేవుడు కేవలము పరిశుద్ధుడు. ఆయన ఆజ్ఞలును పరిపూర్ణముగా పరిశుద్ధమైనవియు న్యాయమైనవియు నయియున్నవి. దైవాజ్ఞల సంగ్రహమేదనిన:

"నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీ దేవుడైన ప్రభువుని ప్రేమింపవలెననునదే. ఇది ముఖ్యమైనదియు మొదటిదియునైన ఆజ్ఞ. నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమింపవలెనను రెండవ ఆజ్ఞయు దానివంటిదే. ఈ రెండాజ్ఞలు ధర్మశాస్త్రమంతటికిని ప్రవక్తలకును ఆధారమై యున్నవి." (మత్తయి 22: 37-40).

ఈ యాజ్ఞలను త్రికరణశుద్ధిగా ప్రేమింపవలయునని చెప్పియున్నది. "మీరు పరిశుద్ధులై యుండవలెను; మీ దేవుడనయిన నేను పరిశుద్ధుడనై యున్నాను." (లేవీయకాండము 19: 2). వీనిని పరిపూర్ణముగా నాచరింపవలయును. "ఆకాశమందున్న మీ తండ్రి పరిపూర్ణుడయి యున్నప్రకారము, మీరును పరిపూర్ణులై యుండవలెను." (మత్తయి 5: 48).

ఇట్టి దైవాజ్ఞల నుల్లంఘించుటయే పాపము. కావున మనుష్యులందఱును దేవుని చిత్తము కన్న తమ చిత్తమునే శిరసా వహించి పాపేచ్ఛలకు లోబడి పాపకృత్యములు చేయుటవలన పాపాత్ములుగా నెన్నబడుచున్నారు.

"పాపము చేయు ప్రతివాడును ఆజ్ఞ నతిక్రమించును; ఆజ్ఞాతిక్రమమే పాపము." (1యోహాను 3: 4).

"ఎవడైనను ధర్మశాస్త్రమంతయు గైకొనియు, నొక ఆజ్ఞవిషయములో తప్పిపోయినయెడల, ఆజ్ఞలన్నిటి విషయములో నపరాధి యగును." (యాకోబు 2: 10).

"ఏ భేదమును లేదు; అందఱును పాపము చేసి దేవు డనుగ్రహించు మహిమ పొందలేకపోవుచున్నారు." (రోమా 3: 23).

"పాపమును జేయకుండ మేలు చేయు నీతిమంతుడు భూమియందు నొకడును లేడు." (ప్రసంగి 7: 20) అని బైబిలు బహు ముఖములతో స్థాపించుచున్నది. పాపము జేయని వాడొకడును లేడనుటకు లోకసాక్ష్యములు గలవు.

యాజ్ఞవల్క్య స్మృతి ప్రాయశ్చిత్తకాండలో,

శ్లో॥ విహితస్యా ననుష్ఠా నాన్నిందితస్య చసేవనాత్।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరఃపతనమృచ్ఛతి॥219॥

"విహితములు చేయకున్నను నిషిద్ధములు చేసినను శమదమాదిగుణసంపన్నుడు గాక పోయినను నరుడు పాపియగును" అని స్పష్టీకరణము చేయబడెను. మనుస్మృతి, 2వ అధ్యాయములో,—

శ్లో॥ ఇంద్రియాణాంచ సర్వేషాం యద్యేకంక్షరతీంద్రియమ్।
తేనాస్య క్షరతి ప్రజ్ఞాద్రుతేః పాదాదివోదకమ్॥99॥

"ఇంద్రియములలో నొకయింద్రియమైనను విషయాసక్తమైన యెడల నన్నియింద్రియముల సంబంధమగు బుద్ధి, తోలుసంచిలో నీరొకకాలు కట్టువిప్పిన పక్షమున దానివెంబడి నీరంతయు నెట్లు స్రవించిపోవునో అట్లే వ్యవస్థ లేకపోవును" అని చెప్పబడెను. పద్మపురాణము, మాఘమాహాత్మ్యము, 27వ అధ్యాయమున,—

శ్లో॥ ఉల్లంఘ్య వేలాంచ రతస్తు దైవీం సుఖాయ జాయేత న కామచారః॥

"ఎవడుగాని దేవునిచేత నియమింపబడిన నియమమును నతిక్రమించి ప్రవర్తించిన పక్షమున మేలు పొందడ" ని వ్రాయబడి యున్నది. ఇంతియ కాక,

"పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః"

అను దానినందఱు నంగీకరింతురు. హేమాద్రి ప్రాయశ్చిత్తకాండలో మహాసంకల్పమునందు,

జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థా సుజ్ఞానతో౽జ్ఞానతశ్చ కామతో౽కామతః స్వతః॥ పరప్రేరణయావాసమ్భావితానాం

సర్వేషాం పాపానామ పనోదనార్థం ఇష్టదేవతా ప్రీత్యర్థమ్॥

అని వ్రాసియున్న ప్రకారము బ్రాహ్మణాదులు తమపాపముల నొప్పుకొను చున్నారు. దీనినిబట్టిచూడగా, మానవులు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందును, జ్ఞానమువలనగాని, అజ్ఞానమువలనగాని, కోరికచేతగాని, కోరికలేకుండగాని, స్వయముగా గాని, యితరుల ప్రోత్సాహముచేత గాని నానావిధములయిన పాపములు చేయుట తటస్థించుచున్నట్టు ద్యోతకమగుచున్నది.

ఇంతియకాక, మనుష్యులు పాపములో పడినప్పుడు రెండువిధములగు మరణము నొందుదురు. అందొకటి శరీరవియోగము. ఇది పాపమువలన గలిగిన ఫలము. ఈ లోకానంతరమందు పాపాత్ములు శాశ్వతనరకాగ్నిలోనికి త్రోయబడుట రెండవ మరణమై యున్నది. ఇది యట్లుండనిమ్ము.

పాపములకు మఱొక పేరు పాతకములు. పాతకములనగా పడద్రోయునవి. ఇవి యుత్తమస్థితియందున్న వానిని హీనస్థితియగు నరకమున బడద్రోయును. అట్లే భవిష్యోత్తరపురాణము,

శ్లో॥ అధోధః పాతనాత్వంసాం పాతకం పరికీర్తితమ్।
నరకాగ్నిషు ఘోరేషు పాచనాత్పాపముచ్యతే॥

అని ప్రతిపాదించుచున్నది. మనుష్యులు క్రిందికి పడిపోవుట పాతకమని చెప్పబడినది; భయంకరమయిన నరకాగ్నులయందు ఉడకబెట్టబడుట పాపమని చెప్పబడుచున్నది" అని దీని యర్థము. ఇందు కనుగుణ్యముగా బైబిలువేదములో,—

"శపింపబడినవారలారా! నన్ను విడిచి, సైతానుకును వానిదూతలకును సిద్ధపఱుపబడిన నిత్యాగ్నిలోనికి పొండి." (మత్తయి 25: 41).

అని వ్రాయబడి యున్నది. కాబట్టి ప్రియులగు సోదరులారా! మనుజులందఱును పాపాత్ములనుట నిర్వివాదాంశమే కదా. వారు నరకముపాలగుదురనునంశముగూడ నాబాలగోపాల ప్రసిద్ధమే కదా.

## 2వ ప్రకరణము.

### పాపికి భక్తపాపహరుడును, భక్తియు నవసరమనుటనుగుఱించి.

పాపమునుండియు పాపబలమునుండియు నరకమను పాపఫలమునుండియు సర్వపాపులను రక్షింపగల భక్తపాపహరుడొకడు కావలయునని యనేకు లొప్పుకొనుట

నిశ్చయము. ఇది యెంతో ముఖ్యమయిన కార్యము. పాపి తగినపాపహారుని కను గొని యాతని పాదసేవజేసి పాపపరిహారమొందవలయును. అట్లుకానిచో పాపికి ప్రాప్తియగునది మరవస్థయే కదా. పాపికి పాపహారు డెంత యవసరమో యాతని యెడల భక్తియు నంతయవసరము. పాపికి భక్తియుండి పాపారణ్యదవానలుండగు భక్తపాపహారుడు లేనియెడల అతని భక్తియంతయు వ్యర్థము. అట్టిభక్తపాపహారుని గలిగియుండియు తగిన భక్తి లేకపోయినట్టయిన సర్వమును నిరర్థకమే. లోకములో భక్తివంటి సాధనము మఱొకటి కానము. ఇందునకు బైబిలుప్రమాణములు:—

" శరీరసంబంధమైన సాము కొంతమట్టుకే ప్రయోజనమగును గాని దేవభక్తికి, ఇప్పటి జీవమునుగూర్చియు రాబోవు జీవమునుగూర్చియు వాగ్దత్తము చేయబడినందున, అది అన్నిటికి ప్రయోజనమై యున్నది." (1తిమోతి. 4: 8.)

" భక్తిహీనుని నిరీక్షణ నశించును" (యోబు 8: 13.)

" దైవభక్తియొక్క మర్మము నిరాక్షేపణగా గొప్పదై యున్నది." (1తిమోతి. 3: 16.)

" సంతుష్టి సహితమయిన దైవభక్తి బహు లాభవ్యాపారమై యున్నది." (1తిమోతి. 6: 6.)

భక్తి హిందూశాస్త్రములందును ఎంత చక్కగా వర్ణింపబడి యున్నదో వినుడి.

సామవేదములో:—

శ్రు॥ మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ॥

"మోక్షమునకు సాధనమైన సామగ్రియందు భక్తియే శ్రేష్ఠమయినది అని యున్నది. మహానారాయణోపనిషత్— 8వ అధ్యాయమునందు,

శ్రు॥ సర్వేషామధికారిణామనధికారిణాంభక్తియోగ ఏవప్రశస్యతే॥ భక్తైరసాధ్యంనకించిదస్తి॥

" అధికారులందఱకును అనధికారులకును భక్తియోగమే బాగుగా జెప్పబడి యున్నది. భక్తుల కసాధ్యమయినది కించత్తయినను లేదు" అని వ్రాయబడి యున్నది.

స్కాంధపురాణము, యజ్ఞవైభవఖండము, 26వ అధ్యాయములో,—

శ్లో॥ భక్తిరేవ పరమార్థదాయినీ భక్తిరేవ భవరోగనాశనీ।
భక్తిరేవ పరవేదనప్రదా భక్తిరేవ పరముక్తికారిణీ॥

"భక్తియే ఉత్కృష్టమయిన లాభము నిచ్చునది. భక్తియే పాపరోగమును నాశముచేయునది. భక్తియే పరాత్పరుని దెలియపఱచునట్టి జ్ఞానము నిచ్చునది. భక్తియే శ్రేష్ఠమయిన ముక్తిని గలుగజేయునది" అని చెప్పియున్నది.

ప్రియమిత్రులారా! భక్తి మిగుల ముఖ్యమయినదనియు, భక్తిలేని పక్షమున మన మిహాపరములను సాధింపలేమనియు సిద్ధాంతీకరింపబడినది.

నీతిమంతుడును విశ్వాసనీయుడునగు భక్తపాపహరునియెడల ఇహాపరసాధనమైన యిట్టిభక్తిని గనబఱిచినట్టయిన మనమెంత ధన్యులమగుదుము!

## 3వ ప్రకరణము.

## భక్తపాపహర శబ్దార్థమునుగుఱించి.

సోదరులారా! వెనుకటి ప్రకరణములో పాపికి భక్తపాపహరుడును, తద్భక్తియును గలిగియుండు నావశ్యకమునుగూర్చి మాట్లాడియుంటిమి. ఈ ప్రకరణములో భక్తి, భక్త, భక్తపాపహర అను పదముల యర్థవిచారణ జేయుదము.

భక్తియనగేమియో మొదట జాగ్రత్తగా విచారింతము. భక్తియను సంస్కృతశబ్దము భజ్ (పూజించు, సేవించు, ప్రేమించు) అను ధాతువునుండి పుట్టుచున్నది.

భజ్ + తిః
=భగ్ + తిః
=భక్ + తిః
=భక్తిః.

"పూజ్యేయో ఽనురాగఃవిద్యతేసోభక్తిః" (వృత్తికారః)

అర్థము: పూజ్యే=పూజ్యునియందు, యఃఅనురాగః=ఏ యనురాగము, విద్యతే=కనపఱుపబడుచున్నదో, సఃఅనురాగః=ఆ యనురాగము భక్తిః=భక్తి యని (వృత్తికారుని యభిప్రాయము.) పూజ్యునియందు ఏ యనురాగము (విశేషప్రేమ) కనుపఱుపబడునో అది భక్తియని దాని భావము.

"పూజ్యేష్వనురాగోభక్తిః" (బ్రాహ్మ్యనిఘంటు).

పూజింపదగినవారలయందు ప్రేమకలిగియుండుట భక్తియనబడునని దాని తాత్పర్యము.

"సేవాభక్తిరుపాస్తిః" (వేద నిఘంటు.)

"భక్తిశబ్దశ్చ ప్రీతివిశేషేవర్తతే (ప్రీతివిశేష)శబ్దేన, స్వామిని భృత్యస్యానురాగో వివక్షితః" (వేదార్థ సంగ్రహము. పుట 400).

"భక్తి శబ్దము వివిధ ప్రీతులయందు వర్తించుచున్నది. ప్రీతి యను విశేషశబ్దముచేత స్వామియందు భృత్యుని ప్రేమనుగూర్చి వివరముగా కనపఱుపబడినది.

"తస్య ప్రియత్వంచ, ప్రియకార్యసాధనంచ, భక్తిరిత్యుచ్యతే॥ (బ్రహ్మసూత్రశంకరభాష్యము.) "అతనికి (దేవునికి) ప్రియముగానుండుటయు, అతనికి ప్రియముగానుండుపనులు చేయుటయు భక్తియనబడును" ని దాని తాత్పర్యము.

"తత్త్వరూపానుసంధానంభక్తిరిత్యపరేజగుః" (పంచదశి.)

నిజమయిన తత్త్వమునందు మనసు నిలిపియుంచుట భక్తియని కొందఱనిరి. (విద్యారణ్యుల యభిప్రాయము.)

"మహనీయవిషయే ప్రీతిర్భక్తిః" (శ్రీస్తోత్ర భాష్యము). మహనీయముగు భగవద్వస్తువిషయమయిన ప్రీతియే భక్తి యనబడును. (వేదాంతాచార్యుల యభిప్రాయము.)

శ్లో॥ స్నేహపూర్వమనుధ్యానంభక్తిరిత్యభిధీయతే" (గీతారామానుజభాష్యము.)

స్నేహముతోగూడిన ధ్యానము భక్తియని చెప్పబడును. బ్రహ్మసూత్రమధ్వభాష్యము నందిట్లున్నది:—

శ్లో॥ స్నేహానుబంధోయస్తస్మిన్బహుమానపురస్సరః।
భక్తిరిత్యుచ్యతేసైవకరణంపరమీశితుః॥

"భగవంతునియందు మర్యాద పురస్సరమయిన స్నేహానుబంధమేదో యది భక్తియని పిలువబడుచున్నది. అదియే పరమేశ్వరుని కైంకర్య లాభముకొఱకు (దాసత్వముకొఱకు) సాధనము.

ఇఁక ఋషుల యభిప్రాయము వినుఁడు.

శ్లో॥ మహత్వబుద్ధిర్భక్తిస్తుస్నేహపూర్వాభిధీయతే।
తయైవవ్యజ్యతేసమ్యగ్జీవరూపంసుఖాదికమ్ ॥
(పద్మ పురాణము).

" దేవునిగుఱించి స్నేహ పురస్సరమైన గొప్పవాడని పలికెడుబుద్ధి భక్తి యని చెప్పబడుచున్నది; దానిచేతనే సుఖము మొదలుగాఁగల జీవుని స్వరూపము బాగుగా తోఁచుచున్నది."

శ్లో॥ భజఇత్యేష ధాతుర్వై సేవాయాంపరికీర్తితః।
తస్మాత్సేవాబుధైః ప్రోక్తాభక్తిశబ్దేనభూయసీ॥
(బోధాయన స్మృతి).

" భజఅను ఈక్రియయే సేవించుటయందు చెప్పబడినది. ఆ కారణముచేతనే భక్తిశబ్దమునకు సేవయే యని పెద్దలర్థము చెప్పిరి.

పయినున్న ప్రమాణవాక్యములను పర్యాలోచనచేసి యోజింపగా, భక్తిశబ్దమునకు దేవునియందలి గొప్పప్రేమ ప్రీతిసేవనము అనియే స్పష్టమయిన యర్థమని తేలుచున్నది. అది యట్లుండనిండు.

భక్తిశబ్దమునకు క్రైస్తవుల యభిప్రాయ మేమి? ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరమిది:—" దేవునియెడల విశ్వాసమును, భయమును, ప్రేమను గలిగియుండుట నిజమైన భక్తి (పురాతన మార్గమను గ్రంథము).

"మనము సమస్తమైనవానికన్న దేవునికి భయపడి, ఆయనను ప్రేమించి, నమ్మియుండుట నిజమైన భక్తి" యని మహావిద్వాంసుడైన మార్టిన్ లూథరు యొక్క యభిప్రాయము (లూథరు చిన్నప్రశ్నోత్తరి).

భక్తు లెవరు? "భక్తిః యస్యాస్తీతిభక్తః" భక్తి ఎవనికి గలదో అతడే భక్తుడు.

పాపహారుడన నేమి? "పాపానిహరతీతిపాపహరః" పాపములను హరించువాడు పాపహారుడు.

భక్తపాపహారుడన నేమి? భక్తానాంపాపాని హరతీతి భక్తపాపహరః" భక్తుల పాపములను హరించువాడు భక్తపాపహారుడు.

## 4వ ప్రకరణము.

## నిజమయిన భక్తపాపహారుని గుఱించి.

మనదేశస్థులలో విష్ణుభక్తులు ఆ భక్తపాపహారుడు శ్రీహరి యందురు. ఈ హరిశబ్దము హృఞ్ హరణే అను ధాతువునుండి పుట్టినది. "పాపానిహరతీతి హరిః" "ఆశ్రితుల పాపములను హరించువాడని" దీని యర్థము. వారు ఈ ధాత్వర్థమును జూపుదురు. "ఆశ్రితదోషహారిణఃహరిః" (శ్రీచతుశ్లోకిభాష్యము) భక్తుల పాపములను హరించువాడని దీని భావము. అగ్ని పురాణము 174వ అధ్యాయములో,—

శ్లో॥ కృతేపాపేనుతాపోవైయస్యపుంసఃప్రజాయతే।
ప్రాయశ్చిత్తంతు తస్యైకంహరింసంస్మరణంపరమ్

"పాపము చేసినవాడగుచుండగ ఎవనికి పాపసంబంధమైన పరితాపము పుట్టుచున్నదో వానికి హరి స్మరణయే శ్రేష్ఠమైన ప్రాయశ్చిత్తమ"ని వ్రాసి యున్నది.

శ్లో॥ హరణాదేవదుఃఖానాంహరిరిత్యభిధీయత॥ (శ్రీస్తోత్ర భాష్యం పుట, 106).

"దేవతల దుఃఖములను బోగొట్టువాడు గాన హరి యనబడును" ని యర్థము.

ఇది యిట్లుండగ, శివభక్తులు హరుడే (శివుడు) యా భక్తపాపహరు డందురు. ఇందునకు వీరు చూపు ప్రమాణములు: హర శబ్దముగూడ హృఞ్ హరణే అను ధాతువునుండి కలిగినది. "పాపానిహరతీతిహరః" అనగా, "ఆశ్రితుల పాపములను హరించువాడు గాన హరుడు." భక్తానామార్తింహరతీతిహరః" (లింగా భట్టీయము.) భక్తుల పీడను హరించువాడని భావము. ఆదిత్య పురాణము. ఏక పంచాశద ధ్యాయములో,—

శ్లో॥ సమాహితోజలేమగ్నఃశివంధ్యాయన్ప్రసన్నధీః।
అష్టకృత్వోహరఇతిజప్త్వాపాపైఃప్రముచ్యతే॥

"నిర్మలచిత్తుడై శివుని ధ్యానించుచు జలమందు స్నానముచేసి యెనిమిది పర్యాయములు "హర" యని జపించినట్టయిన పాపములనుండి విమోచింపబడును" అని చెప్పియున్నది. ఇదిగాక, శివునకు రుద్రశబ్ద మొకటి కలదు. భక్తులదుః

ఖమును ద్రవింపఁజేయువాడని దానికర్థము జెప్పుదురు. బ్రహ్మనారాయణాది దేవతల కష్టములను బోగొట్టువాడని కూడ చెప్పుదురు. "బ్రహ్మనారాయణాది జనన మర ణాధివ్యాధి రూపా దుఃఖ్కం ద్రావయతి నాశయతీ తిరుద్రః" (బ్రహ్మసూత్ర శ్రీకరభాష్యము). దీనికర్థము: "బ్రహ్మ, విష్ణువు మొదలగువారి పుట్టుక, చావు, మనోదుఃఖము, శరీర జ్వరాది రోగము నశింపజేయును గాన రుద్రుడు." ఇత్యాది ప్రమాణములచేత హరుడే యా భక్తపాపహరుడుగాని యితరులు కానేరరని శైవులు వ్రాయుచున్నారు. ఇది యట్లుండనిమ్ము.

పయిసిద్ధాంతములకు విరోధముగా క్రీస్తు భక్తులు "యేసుక్రీస్తు" ఒక్కడు మాత్రమే "భక్తపాపహరు" డను బిరుదునకు దగినవాడని సాధింపుచున్నారు. యేసు —ఇది హీబ్రూభాషా పదము. ఈ శబ్దము "యూషా" (రక్షించు) అను ధాతువునుండి పుట్టియున్నది. యేసు అను శబ్దమునకు ధాత్వర్థములు—సహాయము, రక్షణ, విమోచనము, ముక్తి. బైబిలులో దేవదూత యోసేపుతో జెప్పినది వినుడి.—

"ఆమె కుమారుని కనును; ఆయనకు యేసు అను పేరుపెట్టుదువు; ఎందుకనిన, ఆయనే తనప్రజలను వారిపాపములనుండి రక్షించును." (మత్తయి 5: 21).

క్రీస్తు అనుపదము "క్రిస్టాస్, క్రియో, క్రిసో" (అభిషేకించుట) అను ధాతువులనుండి కలుగుచున్నది. ఇది గ్రీకుభాషా పదము. హీబ్రూభాషలో దీనికి "మెస్సియా" అను పర్యాయపదము గలదు. ఈ శబ్దము "మాషియాక్, మాషాక్" (అభిషేకించుట) అను ధాతువులనుండి పుట్టుచున్నది. "మెస్సియా" "క్రీస్తు" అను పదములకు "అభిషిక్తుడు" అని యర్థము. మనుష్యుల రక్షణ విషయమై తండ్రియైన దేవునివలన యేసు క్రీస్తు అభిషిక్తుడాయెను. ప్రజలను పరిపాలించు నుద్యోగమునకు చక్రవర్తికి పట్టాభిషేక మగునట్లుగానే సర్వలోక పాపులను రక్షించు నుద్యోగమునకుగాను యేసునకభిషేక మాయెను గావున ఆయనకు క్రీస్తను నామము వ్రాయబడెను.

బైబిలు వాక్యములు:—"అందుచేతను ఆకాశమందున్నవే కాని, భూమి యందున్నవే కాని వాటియొక్క ప్రతిమోకాలును యేసునామమున వంగే నిమిత్తము, ప్రతినాలుకయును, తండ్రియైన దేవుని మహిమనిమిత్తము యేసుక్రీస్తు ప్రభువని యొప్పుకొనేనిమిత్తము దేవుడు ఆయనను మిక్కిలి హెచ్చించి ప్రతినామమునకు పయినున్న నామము ఆయనకు అనుగ్రహించెను." (ఫిలిప్పీ 2: 9-11)

"ఈయన (దేవుని) మహిమయొక్క ప్రకాశమును ఆయన స్వభావముయొక్క

ప్రతిమయునైయుండి, తనశక్తిగల వాక్యమువల్ల సమస్తమును వహించుచు, తన వల్ల మనపాపములను శుద్ధిచేసి, ఉన్నతలోకములో మాహాత్మ్యముయొక్క కుడి చేతివైపున కూర్చుండెను. ఆయన (దేవ) దూతలకన్న ఎంతశ్రేష్ఠమయిన నామ ముపొందెనో, వారికన్న అంతఅధికుడై యున్నాడు.'' హెబ్రీ 1: 3-4.

« వేఱొకనిచేత ఏమాత్రమయినను రక్షణ లేదు; ఈ నామమువల్ల మనము రక్షింపబడవలెనుగాని ఆకాశముక్రింద, మనుష్యులలో నియ్యబడిన వేఱొకటి యేది యు లేదని వారితో పలికెను.'' (అపొ. కా. 4: 12).

«కాబట్టి సహోదరులారా! మీ కీయన ద్వారముననే పాపపరిహారము ప్రచుర మగుచున్నది.'' (అపొ. కా. 13: 38; 10: 43).

కావున, 'యేసు క్రీస్తు' అను నామద్వయమునకు «అభిషిక్తుడయిన లోకరక్షకుడు» అని భావము. అందుచేతనే, ఈయన ఏకో ఽ ద్వితీయ భక్తపాపహారు డనంబడును. ఇది క్రీస్తుమత సాంప్రదాయము.

సోదరులారా! పయిసంగతులనుబట్టి యోజింపగా, «సందేహావాక్య శేషాత్» అను న్యాయప్రకారము, అభక్తపాపహారుడు విష్ణువా, శివుడా, యేసు క్రీస్తా అని సందేహము వచ్చెను. ఎందుకనిన, వీరుముగ్గురును భక్తపాపహారులై యుండరు. అట్లుండుట బొత్తుగ నసంభవము. ఏలయనిన, అట్లుండుట సమస్త సృష్టిక్రమమునకు విరుద్ధము. కావున, వీరిలో నొకడు మాత్రమే నిజమైన పాప హారుడుగా నుండునుగాని ముప్వురును నుండజాలరు. వీరిలో నెవరు నిజముగా భక్తపాపహారుడై యుండును? మనదేశీయు లనుకొనినట్లు హరిహరు లంతగొప్పపని కెంతమాత్రమును దగినవారుకారు. ఎట్లనిన, హరిహరులు నిత్యులుకారు. అట్లు కానిచో వారు భక్తులపాపములను హరియించి వారికి నిత్యపదవి యెట్లొసంగ గలరు? ఇది యసాధ్యము. హరి నిత్యుడు కాడనుటకు ఋజువులు:

శివుడు ప్రళయకాలమందు హరి మొదలగు దేవతలను హరించునుగాన హరు డనిపించుకొనునని పురాణప్రసిద్ధము. ఇందుకు ఋజువుగా, పరాశరపురాణము, 68వ అధ్యాయమునందు,

శ్లో॥ విష్ణుంబ్రహ్మాణమింద్రంచయమమన్యాన్సురానపి।
యతోనిగృహ్యాహరతేహరఇత్యుచ్యతేబుధైః॥

(శివుడు) «హరిని, బ్రహ్మను, ఇంద్రాది దేవతలను నిగ్రహించి హరియించు వాడుగాన బుధులచే హరు డనంబడు» నని చెప్పబడియున్నది. «రోదయతిసర్వ

మ స్తకాలేఇతిరుద్రః." ప్రళయకాలమునందు సమస్తమును ఏడ్పించువాడు, (సర్వమును నశింపజేయువాడనుట) అను వ్యుత్పత్తిచే రుద్ర శబ్దము జగత్సంహారకారకునియందు వర్తించుచున్నది. (రుద్రభాష్యము, పుట 2).

"మహాప్రళయే బ్రహ్మ విష్ణ్వాదీన్ రోదయతి ద్రావయతీతిరుద్రః"॥ (నారాయణోపనిషద్భాష్యము, పుట 61).

మహాప్రళయమున బ్రహ్మ, విష్ణువు మొదలగువారిని నశింపజేయువాడు గాన రుద్రుడని దాని తాత్పర్యము.

కూర్మపురాణము, ఉత్తర భాగము, 46వ అధ్యాయములో,—

శ్లో॥ దగ్ధేష్వశేషదేహేషు దేవేషు దేవతాత్మజ।
ఏకసాక్షీతిసాశంభోస్తిష్ఠ త్వైదికీశ్రుతిః।
శిరఃకపాలైర్దేవానాంకృతస్రగ్వరభూషణః।
కరోతితాండవందేవీమాలోక్యపరమేశ్వరః।
సంస్థితేష్వథదేవేషు బ్రహ్మవిష్ణుపినాకిషు।
సంస్థితేషువిలేనేషు శివ్యత్యేకఃశివఃపరః।
యాతిస్వభావంభగవాన్ స్వేచ్ఛయైవపినాకధృత్॥

"దేవకుమారా! అన్ని దేవతాశరీరములు భస్మమయిన తరువాత శివునకు ఆ శక్తి యొక్కటి సాక్షిగా నుండునని వేదప్రమాణము. దేవతల పుఱ్ఱెలచే చేయబడిన మంచిపూలదండల శోభగలవాడై పరమశివుడు దేవిని జూచి గొప్ప నాట్యము జేయును. బ్రహ్మ, విష్ణువు, కార్యశివుడు నశించినతరువాత పరమశివుడు మిగులును. పరమశివుడు తన యిచ్ఛచేతనే ప్రకృతిని పొందెను" అని యున్నది.

ఈ పురాణములోనే యీ యధ్యాయమునందే,—

శ్లో॥ ప్రధానపుంసోరజయోరేషసంహారఈరితః।
మహేశ్వరేచ్ఛాజనితోనస్వయంవిద్యతేచయః।
గుణసామ్యంతదవ్యక్తంప్రకృతిఃపరిగీయతే।
ప్రధానంజగతోయోనిర్మాయాతత్త్వమచేతనమ్।

కూటస్థస్తన్మయోహ్యాత్మా కేవలఃపంచవింశకః।
గీయతేమునిభిస్సోపిమహానేకఃపితామహః।
ఏవంసంహారకరిణీశక్తిర్మాహేశ్వరీధ్రువా।
ప్రధానాద్యంవిశేషాన్తందహేద్రుద్రఇతిశ్రుతిః॥

“ఆదిలేని ప్రకృతికిని జీవునకును (ఈసంహారము) తనలోఁ జేర్చుకొనుట చెప్పబడినది. పరమాత్మతలంపుచే పుట్టింపబడినది. తనంతట లేదు. సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడు గుణములకు హెచ్చుతగ్గులు లేని యవస్థ ప్రకృతి యనఁబడును. ఇది లోకమునకు గారణము. మాయ, జడవస్తువు. అవికారి, బ్రహ్మదులకును జనకుఁడు, ఇరువది యైదవవాఁడు, పూర్ణుఁడు, ఒక్కఁడునైనఆత్మ, అసంగుఁడైన మాయా ప్రతిబింబుఁడని మునులచే జెప్పబడును. ఇట్లు నిత్యమైన ఈశ్వరశక్తి సంహారము జేయును. ప్రకృతిమొదలు దృశ్యమునంతను ఈశక్తిచే భస్మముజేయును గాన రుద్ర అనఁబడును అని వేదము చెప్పెను” అని వ్రాసియున్నది.

చివరగా, స్కందపురాణము, శివ మాహాత్మ్య ఖండము, 8వ అధ్యాయములో,—

శ్లో॥ అస్మిన్నష్టమిదంసర్వంజగన్మాయామయంబుధాః।
ప్రతికల్పంమునిశ్రేష్ఠాబ్రహ్మనారాయణాదయః।
అస్మాదేవవిజాయంతేలీయంతేచయథాపురా।
అయమేకోమహాదేవస్సాక్షీసర్వాంతరోహరః।
అంబికాసహితోనిత్యంనీలకంఠస్త్రిలోచనః॥

“ఓ మునీంద్రులారా! ప్రతి కల్పమునందును బ్రహ్మ విష్ణ్వాదులీ మహాదేవు నివలన జనింతురు నశింతురు. ఈ శివుఁడొక్కఁడే సర్వసాక్షియు సర్వాంతర్యామియు నయియుండును. పార్వతీసహితుండును నీలకంఠుండును, త్రిలోచనుండును నయియుండును” అని చెప్పియున్నది. స్కందపురాణము, కాశికా ఖండము, కాంచిక్షేత్ర మాహాత్మ్యము, 14వ అధ్యాయములో:—

శ్లో॥ పురాకిలపురారాతిశ్చరాచరమిదంజగత్।
సంహృత్యసర్వభూతానిబ్రహ్మణావిష్ణునాసహ॥

" పూర్వకాలమందు శివుడు చరాచరరూపమయిన యీ ప్రపంచమును విష్ణు బ్రహ్మలతో సైతము సమస్తభూతములను సంహారించెను గదా" అని చెప్పబడినది.

పయి శ్లోకములలో ప్రయోగింపబడిన హరి, విష్ణు, నారాయణ మొదలగు శబ్దములు మహావిష్ణు పరమేయయి యున్నవి. హరి నిత్యుడుకాడు గనుక ఆతడు భక్తులకు నిత్యపదవి యెట్లు ప్రసాదింపగలడు? అది యట్లుండ నిండు. హరుడును నిత్యుడుగాడని ఋషుల యభిప్రాయమే. విష్ణువు శివుని హరించువాడు గాన హరి యనంబడుననియు ప్రమాణములు గలవు. మత్స్య పురాణము, 246అ:—

శ్లో॥ బ్రహ్మాణ మింద్రం రుద్రంచయమం వరుణ మేవచ।
నిగృహ్యాహర సేయస్మాత్తస్మాద్ధరి రిహోచ్యసే॥

"ప్రళయకాలమందు బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రుడు, యముడు, వరుణుడు, మొదలగు దేవులను నిగ్రహించి హరియించుటవలన హరి యనబడును" అని చెప్పుచున్నది.

పద్మపురాణము, ఉత్తరఖండము, 32వ అధ్యాయములో,—

శ్లో॥ నాభేర్వ్యోరించి ర్గగనం జగత్సర్వం చరాచరం।
యస్మాత్సర్వం సముద్భూతం జగద్విష్ణో స్సనాతనమ్॥
తస్మాత్సర్వ మయో విష్ణుర్నారాయణ ఇతీరితః।
ఏవం సృష్ట్వాజగత్సర్వం పునస్సంగ్రసతేహరిః॥
నిజలీలాసముద్భూతం తాంతవంసోర్ణ నాభివత్।
బ్రహ్మాణ మింద్రం రుద్రం చయమం వరుణమేవచ।
నిగృహ్యాహరతే యస్మాత్తస్మాద్ధరి రిహోచ్యతే॥

(విష్ణుని) " నాభివలన చతుర్ముఖ బ్రహ్మయును ఆకాశమును చరాచరస్వరూపముగు జగత్తును నుద్భవించెను. ఎందువలన సర్వజగత్తు సృష్టింపబడెనో అందువలన సర్వమయుడగువిష్ణువు నారాయణుడనబడెను. ఇత్తెఱంగున సర్వలోకములను సృజించి 'సాలెపురుగు, తనచేనిర్మింపబడిన తంతువును తిరుగా మ్రింగునట్లు' విలాసముచే ఆయన మరల హరించుచున్నాడు. బ్రహ్మేంద్ర రుద్ర యమ వరుణులను నిగ్రహించి హరించుటవలన హరి యని చెప్పబడును" అని కనబడుచున్నది. విష్ణువు రుద్రుని తనచెమటబిందువువలన పుట్టించి, యాతనిని సంహారో

ద్యోగమునకు నియమించెనని యున్నది. పద్మపురాణము, ఉత్తర ఖండము, 86వ అధ్యాయమునందు,—

శ్లో॥ అథ నారాయణః కామమన్యం ధ్యాయతి చేతసా।
ధ్యానాన్తేతస్యఫాలాచ్చ స్వేదబిన్దురజాయత।
సస్వేదోబుద్బుదాకారః పృథివ్యామపతత్క్షణాత్।
తస్మాద్బుద్బుదాత్సోహముత్పన్నోస్మివరాననే॥
త్ర్యక్షశ్చశూలహస్తోహంజటామకుటమణ్డితః॥
కింకరోస్మీతిదేవేశమవోచంవినయాన్వితః।
తతోనారాయణోదేవోమామిత్యాహముదాన్వితః।
కురుష్వజగతాంరుద్రసంహారంభీమదర్శన॥
సాక్షాత్సంకర్షణాంశేనసంహారార్థంవరాననే।
తస్మాన్నారాయణాద్దేవాదుత్పన్నోస్మిభయంకరః।
నియోజ్యమాంతుసంహారేపునరేవజనార్దనః॥

"తదనంతరము నారాయణుడు మరల ధ్యానింప నతని ఫాలంబునుండి చెమట బిందువొకటి జారి నీటిబుగ్గయై భూమిమీద పడగా ఆబిందువువలన నేను మూడు నేత్రములు గలవాడనై హస్తమున శూలమును ధరించి జటామకుటములచే భూషితుండనై జనించి నే నేమి చేయుదును నా కేమియాజ్ఞ యని దేవేశుండగు నారాయణు నడిగితిని. అప్పుడు భగవంతుడు ఓరుద్రా! భయంకరస్వరూపుడవై జగంత్సంహారమునుచేయుమని నా కాజ్ఞాపించెను గావున నారాయణునివలన భయంకరుడనై సంకర్షణాంశచే జగత్సంహారమునకొరకు బుట్టితిని. ఇట్లు నన్ను సంహారకార్యమునందు నియమించెను" అని రుద్రుడు రుద్రాణితో బలికెను.

విష్ణుసహస్రనామస్తోత్రము, సుపర్ణ వైకుంఠ సంవాదమునందు,—

శ్లో॥ బ్రహ్మాశంభుస్తథైవార్కశ్చంద్రమాశ్చశతక్రతుః।
ఏతదాద్యాస్తథైవాన్యేయుక్తావైష్ణవతేజసా।
జగత్కార్యావసానేషువియుజ్యంతేజతేజసా।
వితేజసశ్చతేసర్వేపంచత్వముపయాంతిచ॥

"బ్రహ్మయును శివుడును సూర్యుడును, చంద్రుడును, ఇంద్రుడును, తక్కిన దేవత లందఱును విష్ణుతేజస్సుతో కూడికొనియుందురు. మహాప్రళయకాలముల యందు విష్ణుతేజస్సు పోగొట్టబడినవారై నశించుచున్నారు" అని వ్రాయబడియున్నది. బ్రహ్మపురాణము, హస్తిగిరి మాహాత్మ్యము, 5వ అధ్యాయములో,—

శ్లో॥ సర్వేషామపిభూతానామీశ్వరః కారణంహరిః।
తేనసృష్టంజగత్సర్వమిదంస్థావరజంగమం।
తేనసంవర్ధతేనిత్యంతస్మిన్నేవప్రతిష్ఠితం।
తస్మిన్నేవలయంయాతిసర్వసకలంజగత్।
లీలేవతస్యజగతాంసర్గస్థితిలయక్రియాః।
నతస్యకారణంకార్యంవిద్యతేహ్యవ్యయాత్మనః।
యథాతరంగఫేనాద్యాజాయంతేమహతోంబుధేః।
తథైవవిష్ణోర్జాయంతేప్రధానపురుషాదయః।
ఊర్ణనాభిర్యథాసృష్ట్వాస్వయంతద్గ్రహ్యతేపునః।
తథాసృష్ట్వైతదఖిలంస్వయంసగ్రసతేహరిః॥

"హరి సమస్తభూతములకు నీశ్వరుడును కారణమునై యుండెను. ఆయనచే నీ సర్వప్రపంచమును సృష్టింపబడినది. ఆయనవలననే యెల్లప్పుడును పెరుగుచున్నది. ఆయనవలననే లయమగుచున్నది. సర్వప్రపంచమును ఆయనయేయైయున్నాడు. జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు ఆయన కొకయాటవలె నున్నవి. గొప్పదగు సముద్రమునుండి తరంగములు, నురుగు, బుగ్గలు మొదలగునవి యేలాగు పుట్టుచున్నవో అలాగున విష్ణువునుండి ప్రధాన పురుషులు మొదలగువారు పుట్టుచున్నారు. సాలెపురుగు తానేసృష్టించి తిరుగ ఏలాగు లాగుకొనునో యాలాగుననే యావత్ప్రపంచమును సృష్టించి, ఆవిష్ణువు తిరుగ మ్రింగివేయుచున్నాడు" అని అగపడుచున్నది. మత్స్యపురాణము, 288వ అధ్యాయములో,—

శ్లో॥ బ్రహ్మాసంవత్సరశతాదేకాహంశైవముచ్యతే।
శివవర్షశతాదేకంనిమేషంవైష్ణవంవిదుః।

యదాసవిష్ణుర్జాగర్తితదిదంచేష్టతేజగత్।
యదాస్వపితిశాన్తాత్మాతదాసర్వంప్రలీయతే॥

“ బ్రహ్మవత్సరములు నూరు అయ్యేనేని శివుని కొక దిన మగును. ఇట్టి దినములుగల శివవర్షములు నూరు అయ్యేనేని విష్ణువు కొక నిమిషమగును. అత డు జాగ్రదవస్థయం దుండునపుడు ఈ జగత్తు చేష్టలు గలిగియుండును. విష్ణువు శాంతిజెంది నిద్రావస్థయందుండునపుడు నీ జగత్తు నిశ్చేష్టితమై యుండును అనగా నాశనమవును” అని వ్రాయబడియుండెను.

ఈ ప్రమాణవాక్యములలో వాడబడిన హర, రుద్ర, శంభు మొదలగు శబ్ద ములు మహారుద్రపరమేయని వైష్ణవుల స్థిరాభిప్రాయమైయున్నది. పయిప్రమాణ ములనుబట్టి యాలోచింపఁగా, హరుడుకూడ నిత్యుడుకాడని తెల్లమైయున్నది.

మిత్రులారా! ఇక త్రిమూర్తుల లయమన్ననూ లెక్కకుమించియున్నది. ఇందుకు దృష్టాంతముగా, మహోపనిషత్తు, 8వ అధ్యాయము,—

శ్రు॥ బ్రహ్మవిష్ణుశ్చరుద్రశ్చసర్వావాభూతజాతయః।
నాశమేవానుధావంతిసలిలానీవబాడబమ్॥

అర్థము॥ “ ఉదకములు బడబాగ్నియందు నాశము నొందునట్లు, బ్రహ్మయు ను, విష్ణువును, రుద్రుడును, భూతములవలన బుట్టిన యావత్ప్రపంచమును నాశము నకే పరుగెత్తుచున్నవి.” స్కాంద పురాణము, శివమాహాత్మ్యఖండము, 8వ అధ్యా యము,—

శ్లో॥ బ్రహ్మణోంతేమునిశ్రేష్ఠామాయాయాంలీయతేజగత్।
తథావిష్ణుశ్చరుద్రశ్చప్రకృతౌవిలయంగతౌ॥
బ్రహ్మణశ్చతథావిష్ణోస్తథారుద్రస్యసువ్రతాః।
మూర్తయోవివిధాస్స్వేషుకారణేషులయంయయుః॥
అసంఖ్యావిలయంయాతాబ్రహ్మణఃపండితోత్తమాః।
అసంఖ్యావిష్ణవోరుద్రాఅసంఖ్యావాసవాదయః॥

అర్థము॥ బ్రహ్మ అంతమయినప్పుడు జగత్తు మాయయందు లయమగుచు న్నది. అవిధముగానే విష్ణువును, రుద్రుడును మాయయందు లయమగుచున్నారు.

బ్రహ్మ విష్ణువు శివుడు వీరి సువ్రతములైన శరీరము లనేకములు వారివారికారణముల యందు లయముపొందును. లెక్కకెక్కువైన బ్రహ్మలు, విష్ణువులు, రుద్రులు ఇంద్రాదులు నశించిరి.''

ఒకప్పుడు మృతుడగు శుక్రునింజూచి వానితండ్రియయిన భృగుముని కోపము జెందినవాడై, లయకాలమును శపించుట కుద్యమించెను. అంతట కాలపురుషుడు భృగుమునీంద్రునియెదుటికివచ్చి నిలిచి ప్రళయకల్లోలసాగరంబువలె గంభీరుండైన క్రుద్ధుండైన మునీంద్రుని నిట్లు సమాధానపఱచెను.

శ్లో॥ సంసారావిలయగ్రస్తావిశీర్ణారుద్రకోటయః।
శక్తానివిష్ణుబృందాని కేనశక్తావయంమునే।
భోక్తారోహివయంబ్రహ్మన్ భోజనంయుష్మదాదయః।
స్వయంనియతిరేషాహినావయోరేతదీక్షితం।
కమర్థంకుప్యసేబ్రహ్మన్ సర్వేకాలివశంగతాః॥

అర్థము: ''ఈసంసారములు ప్రళయంబులచే నాక్రమింపబడినవి. కోట్లకొలది రుద్రులును విష్ణుసమూహములును బ్రహ్మలును ఎన్నియో ధ్వంసము చేయబడినవి. నే నెవనికి చిక్కితిని? మేము మనుభవించువారలము. మీవంటివారలందఱును మాకు భోజనంబై యుందురు. ఇది గాదా? మనయిరువురికిని స్వభావసిద్ధముగా నేర్పడియుండు నియతి. ఇది తెలియబడినది'' అని వాసిష్ఠ రామాయణము నందలిశుక్రోపాఖ్యానము, భృగుకాలపురుష సంవాదమునందు జెప్పబడియున్నది.

ఈ విధముగా త్రిమూర్తుల లయము బహుళముగా జెప్పఁబడియున్నది. గ్రంథబాహుళ్యమగు భయముచే సంక్షేపించియున్నాము.

ప్రాజ్ఞులారా! హరి ఉత్కృష్ట చెప్పవలసివచ్చినపుడు హరియుండి హరాదులు లయమైపోవుచున్నారనియు, హరుని ఉత్కృష్ట చెప్పవలసియుండినపుడు, హరుడుండి హరి మొదలగు దేవులు లయమగుచున్నారనియు ఋష్యాదులు పురాణాది గ్రంథములందు వ్రాసిపెట్టిరి. వారే మఱికొన్ని స్థలములందు హరి హర బ్రహ్మలు ముగ్గురు లయమైపోవుచున్నా రనియును వ్రాసిపెట్టిరి. కావున, ''మహాన్తి నామధేయాశ్చభిన్నాః'' అను ప్రమాణముచొప్పున ఏదిసత్యమో, ఏది

యసత్యమో, ఎవరికి తెలియును? హరి హరులలో ఎవడు నిత్యుడో ఎవ డని త్యుడో ఎవరికి తెలియును? కాబట్టి హరి హరులలో నొకడును భక్తపాపహరు డుగ నుండదగడుగదా?

ఈ భేదములు, కల్పభేదములవలన సంభవించుచున్నవి, గాని ఋషులు తెలివితక్కువవ్రాతలు వ్రాయలేదని మామిత్రులలో కొందఱు వాదింతురు. ఇది యుక్తియుక్తముగాలేదు. ఏలయనిన, దేవుడు నిత్యము దేవుడుగా నుండును గాని ఒక కల్పమందు స్వామిగాను మఱొక కల్పమందు భృత్యుడుగాను నుండ లేడు. దేవుడు ఈశానకల్పమందు నిత్యుడుగాను, పద్మకల్పమందు అనిత్యుడు గాను నుండడు. ప్రతికల్పమందును దేవుడు దేవుడైయుండవలెను. దేవుడు మార్పులేనివాడు. ఆయన, "నిర్వికల్పుడు, నిర్వికారుడు, నిదానుడు, నిశ్చలుడు" అను బిరుదావళులు గలవాడే.

అదియు గాక, హరిహరులకు భేదములేదనియు, ఇద్దఱొకటే యని కొం దఱందురు. ఇదియు సరికాదు. ఇట్లు చెప్పుట హరిహరమతస్థు లెంతమాత్రము సమ్మతింపరు. అట్లొప్పుకొనినచో వారిమతగ్రంధములు, తద్భాష్యములు, సి ద్ధాంతములు, ఆచారాదులు వ్యర్థమైపోవును. ఋషుల యభిప్రాయమును అది కాదు.

అదియు గాక, "ఒక్కొక్కసమయమున నొక్కొక్క దేవతకు ప్రాశ స్త్యము ఘటించినది. అన్నిటికి మూలము బ్రహ్మ మొక్కటియే" అని అద్వైతు లు చెప్పుదురు.

ఆ మూలబ్రహ్మము, మహారుద్రుడేగాని మఱియొకడు గాడని శైవులు ప క్షాణింతురు. ఆలాగుననే శ్రీకర నీలకంఠాది భాష్యములయందు వ్రాయబడి యున్నది. ఆ మూలబ్రహ్మము మహావిష్ణువేయని శ్రీభాష్యాదులందు వ్రాయప బడియున్నది. కావున ఆ మూలబ్రహ్మము హరియా? హరుడా?

ఇంతవఱకు వ్రాసిన దానివలన హరిహరులు తామే ఒకరినొకరు కల్పాంత ములయందు హరియించుకొనుటవలన అనిత్యులని విస్పష్టమగుచున్నది గదా! కావు న వారు భక్తపాపహరులుగా నుండదగరు. అవి యట్లుండనీయుడి.

సోదరులారా! యేసు క్రీస్తు, హరిహరులవలె గాక సదా నిత్యుడని బైబిలు నేర్పించుచున్నది.

యేసు ఆద్యంతరహితుడనియు, (యోహాను 1: 1-3) దేవుడనియు, దేవుని తో నున్నవాడనియు, ప్రపంచ సృష్టికర్త యనియు వర్ణింపబడుచున్నాడు. నిత్యుడు (యోహాను 1: 1; 8: 5; హెబ్రీ 13: 8; 1యోహాను 5: 20.)

"నిత్యముగనున్న తండ్రి" లేక "నిత్యకాలముయొక్క తండ్రి" అను దేవుని పేరు యేసు క్రీస్తునకును వాడబడియున్నది. (యెషయ 9: 6.) నిత్యముగనున్న తండ్రి యనగా, "ఉండినటువంటియు, ఉన్నటువంటియు, ఉండబోవునటువంటి యునైన దేవుడై యుండి యావత్తుకు మూలమై యున్నాడు."

"అల్ఫాయు ఓమెగయు నేనే. వర్తమాన భూత భవిష్యత్కాలములలో నుండు వాడను నేనే అని సర్వాధికారియగు ప్రభువు సెలవిచ్చుచున్నాడు." (ప్రకటన 1: 8.) యేసు అల్ఫా ఓమెగ అనగా, సమస్తమునకు ఆది, అంతము అని పిలువబడుచున్నాడు.

"యేసు క్రీస్తు నిన్న, నేడు, ఒక్కరీతిగా నున్నాడు; అవును యుగయుగ ములకు నొక్కరీతిగా నుండును." (హెబ్రీ 13: 8.)

యేసు క్రీస్తు త్రిత్వములో రెండవమూర్తి. త్రిత్వమనగా, తండ్రి కుమార పరిశుద్ధాత్మ యనెడి త్రియేక సత్యదైవతత్వము. త్రిత్వము త్రిమూర్తుల వంటిదికాదు. త్రిమూర్తులవలె గాక ఈ త్రిత్వము నిత్యమైన త్రిత్వము.

మనము మూర్తులను కలుపక, తత్వమును భేదింపక, ఏకదేవుని త్రిత్వము గాను, త్రిత్వమును ఏకత్వముగాను ఆరాధించుటయే క్రైస్తవ విశ్వాసము. ఎట్లనగా, తండ్రి అను ఆయన యొకడు. కుమారుడను ఆయన యొకడు. పరిశుద్ధాత్మయను ఆయన యొకడు. అయినను తండ్రియొక్కయు, కుమారునియొక్కయు, పరిశుద్ధాత్మయొక్కయు దేవత్వము ఒకటే. మహిమ సమానము. ప్రభావము సహ నిత్యము.

తండ్రి నిత్యుడు. కుమారుడును నిత్యుడు. పరిశుద్ధాత్మయు నిత్యుడు.

అయినను ముగ్గురు నిత్యులు లేరు. నిత్యుడొకడే." (అథనాసియు విశ్వాస సూత్రము.)

"ఈ త్రిత్వములో ముందు వెనుకలు లేవు. హెచ్చుతగ్గులు లేవు. ముగ్గురును సహనిత్యులును, సరిసమానులునై యున్నారు." (అథనాశియు విశ్వాస సూత్రము.)

త్రిత్వములోని రెండవమూర్తి భూలోకమునందు పాపులనిమిత్త మొకపర్యాయమే మృతిబొందెను; కాని మరణమును జయించి మృత్యుంజయుడాయెను.

"భయపడకుము; నేను మొదటివాడను కడపటివాడను జీవించువాడను; మృతుడనైతిని గాని నేను యుగయుగములు సజీవుడనై యున్నాను. మరియు మరణముయొక్కయు మృతులలోకముయొక్కయు తాళపుచెవులు నా స్వాధీనములో నున్నవి" అని యేసు చెప్పెను. (ప్రకటన 1: 18.)

"మనము క్రీస్తుతోకూడ చనిపోయినయెడల, మృతులలోనుండి లేచిన క్రీస్తు ఇకను చనిపోడనియు, మరణమున కికను ఆయనమీద ప్రభుత్వము లేదనియు, ఎరిగి ఆయనతోకూడ జీవించుచుందుమని నమ్ముచున్నాము." (రోమా 6: 8-9.)

కాబట్టి యేసు క్రీస్తు యొకపర్యాయము పాపులకొఱకు చనిపోయి, తిరిగి లేచెను. ఇక నెన్నడును చావడు. కనుక యేసే భక్తపాపహారుడుగా నుండదగును.

## 5వ ప్రకరణము.

## యేసు క్రీస్తుయొక్క అవతార ఘట్టము.

మిత్రులారా! క్రీస్తు భక్తులు బోధించుచున్నట్లుగ క్రీస్తు యేసు ఒక్కడే యాశ్రితుల యఘములను హరించి రక్షించుటకు తగినవాడు. పాపహారులు మరి యెవ్వరును నుండనేరరు గాన దేవుడే తన ప్రియపుత్రుని యేసు క్రీస్తును పేరుచేత లోకమునకు పంపెను. తన నీతిన్యాయములకు భంగము గలుగకుండుటకును, పాప మానవులను రక్షించుటకును దేవుడే యిట్లొక మార్గము నేర్పఱిచెను. యేసు క్రీస్తు త్రిత్వములో రెండవ మూర్తి (Person) అని మరల జ్ఞాపకము చేయుచున్నాడు. ఈయన తండ్రినుండి నిత్యానాదియందు పుట్టిన దేవుడును, మరియు మానుకన్యకనుండి పుట్టిన నిజమైన మనుష్యుడునైనవాడు. ఈ దైవసుతుడు దేవుని పరిశుద్ధాత్మ ప్రభావమువలన నొక కన్యకాగర్భమున పరిపూర్ణ పావనమూర్తిగా యుద్భవించి, ముప్పదిమూడేండ్లు భూమిమీద జీవించెను. యేసు క్రీస్తు దేవుని కుమారుడని మీరు బోధించుచున్నారు; సరేకాని, సృష్టికర్త యయిన దేవునికి మనుష్యులందఱును కుమారులు కారా యని కొందఱు శంక చేయుదురు. ఈ నామము శ్రేష్ఠులయిన సద్భక్తులకును దేవదూతలకును ప్రయోగింపబడియుండలేదా? ఆయన పరమభాగవతోత్తముడై యుండవచ్చునే గాని ఆయనయందు వేఱొక యతిశయ మేమిగలదు? యని మఱికొందఱును నడుగుచున్నారు.

వీనికి ప్రత్యుత్తరము లిచ్చెదము. దేవుడు సృష్టికర్త గనుక అందఱును దే
వుని కుమారులే గాని యేసు క్రీస్తు దేవునికుమారుడని సాటిలేని గొప్పభావముతో
జెప్పవలయును. ఆయన యనాదిగా తండ్రియొద్దనుండి కలిగి, తండ్రి తత్త్వముగ
ల నిత్యవస్తువయి యుండుటచేత, ఆయన దేవుని యద్వితీయ కుమారు డనబడును.
ప్రభువైన యేసు నరరూపధారియైన దేవుడు. దేవత్వముయొక్క సర్వపరిపూ
ర్ణత శరీరాకారముగా క్రీస్తునందు నివసించుచున్నది. ఆయన దేవునిసర్వశక్తిచేత
మరియమ్మ యను నొక కన్యకాగర్భమునం దత్యద్భుతముగ బుట్టెను. సహజము
గ మనుష్యులకు తలిదండ్రులు గలరుగాని యాయనకు తల్లిమాత్రము గలదు. కను
క నే యితరుల కన్న ఆయన దేవునికుమారుడని స్పష్టముగ నౌన్నత్యభావముతో జె
ప్పవలయును. అది యట్లుండనిమ్ము.

యేసు క్రీస్తు దేవుని కుమారుడని క్రైస్తవులు చెప్పగా వినెడి అన్యమతస్థు
లు వారితాత్పర్యము గ్రహింపలేక అనేక విపరీతార్థములు చేయుదురు. యేసు క్రీ
స్తును దేవుని కుమారుడని చెప్పునప్పుడు మహమ్మదీయులు దేవునికి భార్యయున్న
దా, ఆయనగాక వేఱొక దేవుడున్నాడా యని దైవదూషణలు వచింతురు.
హిందువులంత యపసవ్యముగ మాట్లాడక పోయినప్పటికిని, బ్రహ్మ విష్ణు మహే
శ్వరులు మొదలగు తమ దేవతలకు భార్యలు బిడ్డలునున్నారని నమ్ముచున్నట్లు
యేసు క్రీస్తు విషయమైకూడ భావింతురు.

మిత్రులారా! ఆ భావనలును, ఊహలు నెంతమాత్రము సరికావు. దేవు
నికి భార్య లేదు. దేవుడు హిందూదేవతలవలె భార్యాబిడ్డలను కలిగియుండలేదు.
అట్లయిన యేసు క్రీస్తు దేవుని కుమారుడని చెప్పుటవలన విశేష మేమి? ఆయన దే
వుని యద్వితీయ కుమారుడని యేల చెప్పవలెను? కొంచెము లోతుగా ఆలోచించు
నెడల ఈ మాటలలోనే యీ ప్రశ్నకు ప్రత్యుత్తరము స్ఫురింపవచ్చును. ఈ సం
గతి సులభముగా తెలియుటకై యొక చిన్నదృష్టాంత మాలోచింతము. ఒక మ
నుష్యుని కొకకుమారుడు పుట్టెనా డనుకొందము; పెంపుడుకుమాళ్లు అయిదుగురు
న్నారనుకొందము. అతని కెందరు కుమాళ్లున్నారని చెప్పవచ్చును? ఒక యర్థ
మందు ఆఱుగురని చెప్పుదుము; ఇంకొక యర్థమందు ఒక్కడే యని చెప్పుదుము.
మనుష్యులందఱును దేవునికుమారులని చెప్పుటలోను, యేసు క్రీస్తు దేవుని యద్వితీ
య కుమారుడని చెప్పుటలోను, కుమారుడను శబ్దమును కొంచెము భేదమయిన య

గ్థముతో వాడుదురు. మనుష్యులందఱను దేవుడు సృజించెను గనుక అందఱును ఆయన కుమారులయియున్నారు. మన కందఱకును పుట్టుక గలదు గనుక ఆదియు ను గలదు.

నూరేండ్ల క్రిందట మన ముండలేదు. దేవుడు తన సంకల్పమువలన మనల ను పుట్టించెను. కాబట్టి ఆయనవలన సృష్టింపబడితి మను హేతువుచేత ఆయన సదాకాలము మనకు తండ్రియును మనమాయనకు బిడ్డలమునై యున్నాము. క్రీస్తు విషయములో అలాగు కాదు. ఆయన సృష్టింపబడలేదు గనుకను, ఆయన ని త్యకాలవర్తి గనుకను, ఆయన కాదిలేదు. "అబ్రాహాముకు ముందే నేనున్నా ను" అని ఆయనే సెలవిచ్చెను. కాబట్టి యాయనమాత్రమే దేవునికి అద్వితీయ నిత్యకుమారు డని చెప్పదగినవాడు. పరమాత్మునికి కోటానకోట్ల కుమారు లున్నారు గాని, తనతో సహనిత్యుడు, సృష్టింపబడనివాడు, ఏకతత్త్వము గల కుమారు డొక్కడు మాత్రమే యున్నాడు.

ఆదిక్రైస్తవులు చెప్పుచున్నట్లు తండ్రికిని కుమారుడగు క్రీస్తునకును గలసం బంధము సూర్యునికిని తత్కాంతికిని గలసంబంధమువంటిదై యున్నది. దైవబాం ధవ్యమును మనమాటలతో తెలియజేయుట కష్టము. దేవుని కుమారుడు "నిత్యత్వ మునుండి తండ్రివలన జన్మించినవాడు" అని మాత్రము చెప్పగలము (2వ మతాం శము.) ఈ శబ్దము నిత్యమైన బంధుత్వమును తెలియజేయునే గాని, సృజించు టను తెలియజేయదు.

దేవుని కుమారు డను ప్రయోగమును మహమ్మదీయులు వినగానే దేవునికి కుమారుడు లేడని యనెదరు. అలాగున చెప్పునపుడు వారు ఇంజీలు (సువార్త) లోనిమాటలకు తప్పుడర్థమును చేసికొనుచున్నట్లున్నది. యేసు క్రీస్తు "దేవునికు మారు" డని సువార్త చెప్పినపుడు మనుష్యమాత్రునికి కుమారుడు కలిగినవిధముననే క్రీస్తు పుట్టినాడని మనము అర్థము చేసికొనగూడదు. అట్టియర్థమును గ్రహించుట ఘోరమయిన దైవదూషణయగును. అట్టిమాటను దేవునిగుఱించి చెప్పుటకు మహ మ్మదీయు లెంతగా వెరతురో క్రైస్తవులును నంతగానే వెరతురు. దేవు డాయ నను అపారముగా ప్రేమించి సన్మానించుచున్నాడని యీప్రయోగమున కర్థము. దేవుని కుమారుడు దేవుడే యయియున్నాడని కూడ దాని యర్థము. యేసు దేవు ని కుమారు డనుటవలన ఆయన సామాన్యమనుష్యునివలె పుట్టినాడని యర్థముకాదు. ఎందుకనిన, ఆయన యనాదికాలమునుండి యుండినవాడు. ఒక రాజుయొక్క కుమారుడు రాజ్యములోని యందఱిమానవులకన్నను ఎట్లు ఎక్కువ ఘనతగలవాడై

యుండునో అట్లే క్రీస్తుకూడ దేవునికి కుమారుడై యున్నందువలన నితరులంటబిక న్న అపారమైన మహిమను శక్తిని గలవాడైయున్నాడు. "నేనును, నాతండ్రి యును ఒక్కరమే" అని క్రీస్తు యేసు తానే చెప్పియున్నాడు. దీని కనుగుణ్యముగా, క్రీస్తుయొక్క పేర్లలో నొకటి ఇమ్మానుయేలు (అనగా దేవుడు మనతో నున్నాడు) అనునదియై యున్నట్టు ఇంజీలులో జెప్పబడియున్నది.

దేవునికుమారుడని బైబిలు చెప్పుటవలన అర్థమేమనగా (1) ఒక మనుష్యుని కుమారునికి మనుష్యస్వభావమే కలుగునట్లు, తండ్రియైన దేవుడును కుమారుడైన క్రీస్తును నొక్కస్వభావమే కలవారని గ్రహింపవలయును. యేసుక్రీస్తు దేవుని కుమారుడని పిలువబడినపుడు దేవుని కుమారుడు దేవుడే యని గ్రహింపవలెను. వాస్తవమున క్రీస్తు మనుష్యమాత్రుడును కాడు; పయంబరునుకాడు. (2) దేవుని కుమారు డనుప్రయోగమువలన క్రీస్తు చెప్పదరముకాని గొప్పవాడై యున్నాడని గ్రహింపవలయును. (3) దేవుని కుమారుడను ప్రయోగముచే క్రీస్తునెడల దేవునికిగల ప్రేమ సూచింపబడుచున్నది. తండ్రి తనకుమారుని నన్నిటికన్న ఎక్కువగా నెట్లు ప్రేమించునో యట్లు దేవుడు క్రీస్తును అపరిమితముగా ప్రేమించుచున్నాడు. (4) మఱొక అర్థమందుకూడ క్రీస్తు దేవుని కుమారుడై యున్నాడని క్రొత్త నిబంధనలో నుదాహరింపబడియున్నది. అది యేలయనిన, ఆయన దేవుని మహిమా ప్రభావమువలన ఒక కన్యకాగర్భమున పుట్టినాడని చెప్పబడెను. ఆయన యిట్లు పుట్టినట్టు బైబిలును ఖురానును స్పష్టముగా నొక్కివక్కాణింపుచున్నవి. క్రీస్తు మరియమ్మకు కుమారుడైపుట్టునని గాబ్రియేలు దూత ఆమెకు తెలిపినపుడు— "పరిశుద్ధాత్మ నీమీదికి వచ్చును; సర్వోన్నతుని బలము నీపైని నీడగానుండును గనుక పుట్టబోవు పరిశుద్ధమైనది దేవుని కుమారు డనబడును" (లూకా 1: 35) అని యనెను. యేసునకు ఇహసంబంధమైన తండ్రి లేడు గనుక ఆయన దేవుని మహిమ బలము వలన పుట్టినాడనియు, ఆ కారణము వలననే దేవుని కుమారు డనబడుచున్నాడనియు మనము గ్రహింపవలయును. అది యట్లుండ నీయుడి.

మఱియొక సంగతి. పుత్రుడు లేనివానికి గతులులేవని మనదేశస్థులు చెప్పుదురు. ఇది మన దేశస్థులకు గొప్పసిద్ధాంతము. ఆ యర్థము పుత్ర శబ్దములో గూడ నిమిడియున్నది. "పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రః." "పుం అనెడి నరకమునుండి రక్షించువాడు కావున పుత్రుడు." కుమార శబ్దార్థమును వినుడి. "కుత్సితం మారయతీతి కుమారః, (మృఞ్ ప్రాణత్యాగే.)" "కుత్సితమును జెఱుచువాడు." "పాపకుత్సేషదర్థకుధిఙ్న్యగ్భత్సనానిందయోః" (అమరము.)

కు—ఇది పాపమునందును, నిందయందును, ఇంచుక యనెడు అర్థమందును వర్తిం చును. "కుంపాపంమారయతీతికుమారః" (భాగవతపు. వ్యా.) "పాపమును నశింపజేయువాడు గనుక కుమారుడు."

ప్రాజ్ఞులారా! అట్టి అర్థములుగల పుత్రకుమార శబ్దములు క్రీస్తను దేవపుత్రు నికే సార్థకనామములుగా నుండదగును గాని తదితర పుత్రుల కట్టి యర్థములు చెల్లు బడియగునా? ఇది యసంభవమే. ఏలయనిన, ఈ పుత్రులు పుట్టియును పుట్టక యును తల్లిదండ్రులకు నెల్లప్పుడును దుఃఖములనే కలిగించుచున్నారు. ఇందుకు ఋజువుగా, యాజ్ఞవల్క్యోపనిషత్,—

అలభ్యమానస్తనయఃపితరౌక్లేశయేచ్చిరం।
లబ్ధోహిగర్భపాతేనప్రసవేనచబాధతే।
జాతస్యగ్రహరోగాదికుమారస్యచధూర్తతా।
ఉపనీతేప్యవిద్యత్వమనుద్వాహశ్చపండితే॥
యూనశ్చపరదారాదిదారిద్ర్యంచకుటుంబినః।
పుత్రదుఃఖస్యనాస్త్యంతోధనీచేన్మ్రియతేతదా।
ఏవంవివిచ్యపుత్రోసౌప్రీతింత్యక్త్వానిజాత్మని।
నిశ్చిత్యపరమప్రీతింవీక్ష్యతేతదహర్నిశం॥ 2 ॥

"పుట్టనికొడుకే చాలకాలము తల్లిదండ్రులకు దుఃఖమును గలిగించును. వాడు కలిగియు గర్భస్రావముచేతను, ప్రసూతిచేతను బాధపెట్టుచున్నాడు. పు ట్టినపుత్రుడు తనకుగ్రహము రోగములు మొదలయిన వానిచేతను, వాని యహంకా రముచేతను బాధింపుచున్నాడు. ఉపనయనము చేసినను చదువు రాకపోవుట చేతను, పండితుడైనను పెండ్లి కాకపోవుటచేతను బాధించుచున్నాడు. పడుచు వాడయి పరదారగమనముకలన బాధించుచున్నాడు. కుటుంబియైనచో దరిద్ర మువలన బాధింపుచున్నాడు. పుత్రునివలన గలుగుదుఃఖమునకు అంతములేదు. చివఱకు చచ్చినప్పుడు ధనమును సంపాదించియు నెక్కువ దుఃఖమును గలిగించు ను. ఈ కుమారుడు విషయములో ఈలాగు విచారించి ప్రీతిని వదిలిపెట్టి తనయొ క్క యాత్మయందు బరమప్రీతియైన దానిని (బుద్ధిమంతుడు) రాత్రింబగళ్లు చూ చుచుండు" నని ఘోషమిచ్చుచున్నది.

కాబట్టి పుత్రులు పుట్టకమునుపును పుట్టినవెనుకయును పుట్టి గిట్టినతరువాతయును అధికదుఃఖములను గలిగించుటను మానుషపుత్ర శబ్దమునకు నిజమైన యర్థమును వివరింపబడుచున్నది.

ఇదికాక పుత్రులు గలవారికి యిహపరలోకములయందు సుఖములు గలవనియు, లేనివారికి సుఖములు లేవనియు, పుత్రులు తల్లిదండ్రుల వంశముల వారినెల్ల పుణ్యలోకములకు బంపుదురనియు, పుత్రులవలననే గాని పితృఋణము తీరదని తాము భ్రమపడుటయే గాక లోకులను సహితము భ్రమపెట్టుచున్నారు. కొందఱన్ననో, పుత్రుని దేవుడుగానే భావింపుచున్నట్టు కనపట్టుచున్నది. ఇందుకు దృష్టాంతముగా, బ్రహ్మపురాణమున గౌతమమాహాత్మ్యములో 38వ అధ్యాయమునందు,—

శ్లో॥ ఆత్మప్రతిష్ఠా పుత్రస్స్యాజ్జాతేపుత్రేఽమరఃపితా।
అమృతేనామరాదేవాఃపుత్రేణబ్రాహ్మణాదయః।
త్రైఋణ్యాన్మోచయేత్పుత్రఃపితరంపితామహాన్।
పుత్రోముక్తిఃపరంజ్యోతిస్తారకస్సర్వదేహినాం।
వినాపుత్రేణయజ్జన్మవ్యర్థఁతదవభాతినొ।
తస్మాత్పుత్రసమంకించిన్నాన్యదస్తిజగత్త్రయే॥

«ఆత్మయొక్క నిలకడే పుత్రుడగుచున్నాడు. పుత్రుడు పుట్టినవాడగుచుండగా తండ్రి దేవత యగుచున్నాడు అనగా చావు లేనివాడగుచున్నాడు. అమృతముచేత దేవతలు అమరులయిరి. బ్రాహ్మణాదులు పుత్రునిచేత దేవతలైరి. మూడు విధములయిన ఋణమునుండి కొడుకు తండ్రిని తాతను విమోచించును. సమస్త జీవులకు పుత్రుడు ముక్తియు పరంజ్యోతియు తారకుడును నగుచున్నాడు. పుత్రుడులేని జన్మ వ్యర్థమై ప్రకాశము లేకపోవుచున్నది. ఆ కారణమునుండి మూడు లోకములయందు పుత్రునితో సమమైనది మఱియొకటి కొంచెమైనను లేదు» అని చెప్పబడియున్నది.

పైవాక్యములనుబట్టి మానవపుత్రుడు— ముక్తి, పరంజ్యోతి, తారకుడని పిలువబడుచున్నాడు. అట్లు చెప్పబడుటకు వానికి శక్తి యెక్కడిది? ఇదియు నసంభవమే. మఱియు హిందూశాస్త్ర ప్రకారము, తల్లిదండ్రులు మరల జన్మ

ముక్తినను లేక మోక్షపదము నొందినను పుత్రులు వారినిగుఱించి చేయు పుణ్య కార్యఫలములు వారి నంటవు. మఱియు యోగ తత్త్వోపనిషత్తు నందు,—

యస్మాజ్జాతో భగాత్పూర్వంతస్మిన్నేవ భగేనమన్।
యామాతా సాపునర్భార్యా యాభార్యా మాతృకైవహి।
యఃపితా సపునః పుత్రో యఃపుత్రస్సపునఃపితా।
ఏవం సంసార చక్రేణకూపచక్రేఘటాఇవ॥

“జన్మాంతరములయందు తన తండ్రియే తనకు పుత్రుడై పుట్టుననియు తన పుత్రుడే తనకు తండ్రి యగుననియు తన భార్యయే తనకు తల్లి యగుననియు తన తల్లియే తనకు భార్య యగుననియు” జెప్పియున్నది. ఇట్లనుటవలన తల్లిదండ్రులకు పుత్రుల వలన ప్రయోజన మేమియు లేదని భావము.

మఱియు వ్రతార్కమునందు ఏకాదశీ గురువార వ్రతకల్పమున పూర్వ జన్మ జ్ఞానముగల ఒక్క బ్రాహ్మణదంపతులు తమ పుత్రుని యింట వృషభము గాను కుక్కగాను పుట్టియుండిరి. ఆ పుత్రుడు పితృశ్రాద్ధము వారినిగుఱించి చేయుదినమందు ఆ శ్రాద్ధపు సందడివలన ఆ యెద్దునకు మేతవేయ మఱచెను. శ్రాద్ధమునకు తెచ్చియుంచిన పాలలో పాము విషము క్రక్కగా అది చూచి కుక్క ఆ పాలను నేలద్రోసెను గనుక ఆ మంటచేత కుక్కను కట్టెతో కొట్టి కట్టివేసి దానికి ఆహారము పెట్టకపోయెను. పిమ్మట శునకవృషభరూపముల దాల్చిన వాని తల్లిదండ్రులు అర్ధరాత్రియందు ఆకలివలన వ్యాకులపడి చీకాకునొంది మన కొడుకు వీడు పెట్టెడు శ్రాద్ధమువలన మనకేమి తృప్తికలిగెను? వీడు మన కాహారము పెట్టకపోయెనే అని దుఃఖించుచుండ సకల జంతు భాషాజ్ఞానముగల ఆ బ్రాహ్మణ కుమారుడు ఆ మాటలను విని నొచ్చుకొని వాని యాకలి దీర్చెను అని వ్రాయబడియున్నది. కాబట్టి తలిదండ్రులనుగుఱించి పుత్రుడు చేయు శ్రాద్ధాదికము వారికి జెందునని పలుకుమాటలు ఎటువలె దిటములగును?

ఇంతేకాక, హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడను తనపుత్రునివలన బహుదుఃఖముల ననుభవించి తుదకు వాని కారణమువలననే మరణించెను. ధృతరాష్ట్రుడు దుర్యోధనాదులైన నూఱుగురు కొమరులను గని వారు మడియుటవలన మిగుల వగల ననుభవించెను. మఱికొందఱు పుత్రదుఃఖముచేత చచ్చి నరకమును జెందిరి. కనుక ఈ పుత్రులవలన తల్లిదండ్రులకు దుఃఖములును మరణములును నరకములును గలుగు

ట ప్రసిద్ధమగుచున్నది. కాబట్టి పుత్రులు కలిగినను లేకున్నను తల్లిదండ్రులకు దుఃఖమే కలుగుట సర్వజనానుభవసిద్ధము. కావున నిట్టిపుత్రులవలన సద్గతి కలుగు ననుట ఏమి నిజము? ఆ విధముననే హిందూవేదశాస్త్రములును చెప్పుట మానలేదు. కఠోపనిషత్తునందు—

నకర్మణానప్రజయానచాన్యేనాపి కేనచిత్।
బ్రహ్మవేదనమాత్రేణబ్రహ్మప్నో త్యేవమానవః॥

"మనుష్యుడు కర్మచేతను కొడుకుచేతను ఇంక నితరమయిన దేనిచేతను బ్రహ్మను పొందలేడు కాని బ్రహ్మమును తెలిసికొనుటచేతనే బ్రహ్మముపొందును" అనియు, లింగపురాణము, పూర్వభాగము, 87వ అధ్యాయములో,—

శ్లో॥ ప్రజయాకర్మణాముక్తిర్ధనేనచసతాంనహి॥

"సజ్జనులకు కొడుకుచేతను ధనముచేతను ముక్తిలేద" నియు ప్రతిపాదింపబడియున్నది.

ఈ బోధ సత్యమయినది. మనవలె జన్మపాపముచేతను కర్మపాపముచేతను పీడింపబడుచున్న మానవపుత్రులు మనల నెట్లు తరింపజేయగలరు? "తమసోవా ఏషతమః" అను ఆపస్తంబ ధర్మసూత్రమునుబట్టి యీపుత్రులు మననిమిత్తము చేయుకర్మలవలన మనకు యజ్ఞానమే యెక్కువగును గాని విముక్తి కానరాదు.

ప్రథమమున. మన దేశపురుషులు దేవుని కుమారుడు పాపమును హరించి లోకము నుద్ధరించునని తెలిసికొనియుండరు. కాలక్రమేణ ఆ సంగతి మఱచి యీలోక కుమారులవిషయమై తదర్థములను వాడుకొనుచుండవచ్చును. ఇది యెట్లు జరిగినదో మనకు బాగుగా తెలియదు.

అయినను పుత్ర కుమార శబ్దార్థములను వహింపగల సమర్థుడు దేవుని ఏకపుత్రుడే గాని మఱియెవరును శక్తిమంతులు కారు. ముక్తి, పరంజ్యోతి, తారకుడను నామములను ధరించుటకు క్రీస్తు యేసొక్కడే సమర్థుడగును ఏలయనగా,-

"దేవుని అద్వితీయ కుమారుడును ఒక్కడే ప్రభువునయిన యేసు క్రీస్తును నమ్ముచున్నాను. ఆయన అన్ని లోకముల కన్న ముందు తన తండ్రి వలన జన్మించినవాడును దేవునినుండి దేవుడును, వెలుగునుండి వెలుగును, నిజమైన దేవుని నుండి నిజమైన దేవుడును, సృజింపబడక జన్మించినవాడును, తండ్రితో ఏక తత్వ

ముగలవాడును, సమస్తమును కలుగజేసినవాడునై యున్నాడు. ఆయన మనుష్యులమైన మనకొఱకును మన రక్షణకొఱకును పరలోకమునుండి దిగివచ్చి పరిశుద్ధాత్మచేత కన్యమరియయందు అవతారమెత్తి మనుష్యుడాయెను. ఆయన మనకొఱకు పొంతిపిలాతు అధికారము క్రింద సిలువవేయబడెను. ఆయన బాధపడి పాతిపెట్టబడెను. లేఖనముల ప్రకారము మూడవనాడు తిరిగి లేచి పరలోకమునకెక్కి తండ్రికుడిచేతివైపున కూర్చుండియున్నాడు. ఆయన బ్రతికియున్నవారిని చనిపోయినవారిని విమర్శించుటకు మహిమతో తిరిగివచ్చును. ఆయన రాజ్యమునకు అంతములేదు" (నికేయావిశ్వాస సూత్రము.)

"మనకొఱకు శిశువు పుట్టెను, మనకొఱకు కుమారుడు ఇయ్యబడెను; ఆయన భుజముమీద రాజ్యభార ముండును; ఆశ్చర్యకరుడు, ఆలోచనకర్త, శక్తిమంతుడైన దేవుడు నిత్యయుగముల తండ్రి సమాధానకర్తయని ఆయనకు పేరుపెట్టుదురు" (యెషయ. 9: 6)

"కుమారునియందు విశ్వాసముంచువానికి నిత్యజీవము కలదు; కుమారుని విశ్వసించనివాడు జీవము చూడడు; దేవుని కోపము వానిమీద నిలుచును" (యోహాను. 3: 36.)

"దేవునికుమారుని సంగీకరించు వాడెవడో వాడు జీవముగలవాడు; దేవుని కుమారుని సంగీకరింపని వాడెవడో వాడు జీవములేనివాడే" (1 యోహాను 5: 12).

"యేసు దేవునికుమారుడని యెవడు ఒప్పుకొనునో వానిలో దేవుడున్నాడు; వాడు దేవునిలో నున్నాడు" (1 యోహాను. 4: 15.)

సోదరులారా! ఇంత బలమైన సిద్ధాంతము మానవ పుత్రులయందు ఎట్లు సాధ్యమగును? ఈ క్రింది బృహదారణ్యశ్రుతులను ఉదాహరించి సమాహరింపబడిన బైబిలు వేదవాక్యములతో సమన్వయించి చూడుడి.

శ్రు॥ నాపుత్రస్యలోకోఽస్తి(బృహదారణ్యకము.)

శ్రు॥ సోఽయంమనుష్యలోకః పుత్రేణైవజయ్యోనాన్యేనకర్మణా॥ (బృ. ఆ. 5. 6. 17)

దీని కర్థము. "పుత్రుడులేనివానికి లోకమే లేదు. ఇది మానుషలోకము. పుత్రునిచేత జయింపబడునది యింకొక కర్మచేత జయింపబడదు."

"దేవుడు లోకము నెంతో ప్రేమించెను. కాగా ఆయన తన అద్వితీయ కుమారుడుగా పుట్టినవానియందు విశ్వాసముంచు ప్రతివాడును నిత్యజీవము పొందుటకై ఆయన ననుగ్రహించెను" (యోహాను. 3: 16.)

"సాతాను మొదటినుండి పాపము చేయుచున్నాడు గనుక పాపము చేయువాడు సాతాను సంబంధి; సాతానుయొక్క క్రియలను లయపరచుటకై గదా దేవుని కుమారుడు ప్రత్యక్షమాయెను" (1 యోహాను. 3: 8).

"దేవుడు మనకు నిత్యజీవము దయచేసెను; ఈ జీవ మాయన కుమారుని యందున్నది" (1 యోహా. 5: 11.)

"నేను లోకమును జయించి యున్నాను" (యోహాను 16: 33) అని యేసు చెప్పెను.

"దేవుని మూలముగా పుట్టినవారందఱును లోకమును జయించుదురు; మన విశ్వాసమే లోకమును జయించిన విజయము. యేసు దేవుని కుమారుడని నమ్మువాడుతప్ప మఱియెవడు?" (1 యోహాను 5: 4-5). ఇది యిట్లుండ నీయుడి.

అంతియ కాక, ప్రభువయిన క్రీస్తునకు రెండు బిరుదులుగలవు. అవి యేవి యనిన, —I. మనుష్యకుమారుడు. II. దేవుని కుమారుడు.

I. మనుష్యకుమారుడు. —ఇది మనుష్యసంబంధమయిన ఘననామము. ఆయన యే మనుష్యకోటి సంరక్షణకై తన జీవమును సమర్పించినాడో వారి ప్రతినిధి స్థానమును వహించి నిష్కళంకమయిన నిజపురుషుడై యుండెనని దీని భావము. ఈ నామము క్రిందనే మఱిరెండు బిరుదులు గలవు.

(1) "అబ్రాహాము కుమారుడు." (మత్తయి 1: 1). యేసు క్రీస్తు శరీరవిషయమై అబ్రాహాము సంతతిలో బుట్టెను గనుక అబ్రాహాము కుమారుడను పేరు పెట్టిరి.

(2). "దావీదు కుమారుడు" (మత్తయి 1: 1.) నీ సింహాసనము శాశ్వతముగా స్థాపింతునని దేవుడు దావీదుతో వాగ్దత్తము చేసెను. (దినవృత్తా. 17వ అధ్యా.) యేసు క్రీస్తు దావీదు వంశమందు బుట్టెను గనుక క్రీస్తు నందీ వాగ్దత్తము నెఱవేఱెను. కాబట్టి ఆయన కీ పేరు పెట్టబడెను. "మనుష్యకుమారుడ" ను నామమును క్రీస్తు అందఱికన్న నెక్కువ పోట్లు తనకు వాడుకొనెను.

II. "దేవుని కుమారుడు" (యోహాను. 1: 49.) ఇది దైవసంబంధమైన ఘన నామము. "యథాపితా తథాపుత్రః" "తండ్రియెంతో కొడుకునంతే" అను న్యాయమునుబట్టి, తండ్రి స్వభావము యావత్తు కుమారుని కుండవలయును గనుక క్రీస్తునకు సమస్తదైవత్వ మున్నదని దీనివలన రూఢిపఱుపబడియున్నది. ఆ బిరుదు లటుండ నిండు.

ప్రభువయిన యేసు సాధారణముగ తాను మనుష్యకుమారులలో నొకడని చెప్పుకొనక "నేనే మనుష్యకుమారుడను" అని చెప్పుకొనిన రీతిగానే తాను దేవునికుమారులలో నొకడనికూడ చెప్పుకొనక "నేనే దేవునికుమారుడ" ననియు మఱింత సంక్షేపముగా "నేనే కుమారుడ" ననియు తఱచుగా తన్నుగూర్చి చెప్పుకొనుచు వచ్చెను. దీనినిబట్టి విచారింపగా, దేవునికుమారుడని పిలువబడిన వారిలో తానే దేవునికుమారుడని విశేషభావముతో క్రీస్తు మనుష్యులు పొరబడకుండ స్పష్టపఱిచెను. ఈ విషయమయి సత్యవేదవాక్యములను వినుడి:—

"వీరు ఇశ్రాయేలీయులు; స్వీకృతపుత్రత్వమును మహాతేజస్సును నిబంధనలును ధర్మశాస్త్రప్రధానమును అర్చనాచారాదులును వాగ్దానములును వీరివి; పితరులు వీరివారు. శరీరమునుబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోత్రార్హుడైయున్నాడు. ఆమేన్" (రోమా 9: 4-5.)

మహర్షియైన యోహాను చెప్పునది వినుడి:—

"ఆదియందు వాక్యముండెను. వాక్యము దేవునియొద్ద నుండెను; వాక్యము దేవుడై యుండెను. ఆ వాక్యము ఆదియందు దేవునియొద్ద నుండెను. సమస్తమును ఆయన మూలముగా కలిగెను. కలిగియున్న దేదియు ఆయనలేకుండ కలుగలేదు. ఆవాక్యము శరీరధారియై కృపాసత్యసంపూర్ణుడుగా మనలో నివసించెను. మనము తండ్రివలన కలిగిన అద్వితీయకుమారుని మహిమగల ఆయన మహిమను కంటిమి." (యోహాను 1: 1-3, 14)

"వాక్యము."— క్రీస్తునకుగల యీ బిరుదును మహర్షియయిన యోహాను ఇతరస్థలములలోగూడ నుపయోగించెను. అది క్రీస్తునకు సరియయిన బిరుదు; ఎందుకనగా ఎవరికిని వినబడనట్టియు కనబడనట్టియునైన మనోభావములను వాక్యములు తెలియజేయు విధమున, క్రీస్తు దేవునిని మనుష్యులకు బయలుపఱచుచు వచ్చెను. క్రీస్తు దేవునిమనస్సును తెలియజేయు వాక్యమయి యుండెను. నేనే

నాతండ్రివలన వినినవన్నియు మీకు తెలియజేసితిని అని ఆయనచెప్పెను ఈ వాక్యమనునది, జ్ఞానము, మహిమ, పరిశుద్ధత అనువానివలె దేవుని గుణముకాదు. దేవుడు తనకృపయందు జనులకు నగపడుటవంటిదియును గాదు. ముఖ్యమగు ఒక పనినిమిత్తము ఏర్పడిన దేవునిశక్తియును గాదు. వాక్యము దేవునియొద్ద శాశ్వతముగనుండిన నొకమూర్తియే.

భక్తాగ్రేసరుడయిన పేతు రిచ్చినసాక్ష్యము వినుడి:—

“ఆయన మాహాత్మ్యమును మేము కన్నులార చూచినవారమై తెలిపితిమి. ఈయన నా ప్రియకుమారుడు. ఈయనయందు నే నానందించుచున్నాను అన్న శబ్ద మాయన యొద్దకు మహాదివ్యమహిమనుండి వచ్చినందున, తండ్రియైన దేవునివలన ఘనతయు మహిమయు ఆయన పొందగా, మేమా పరిశుద్ధపర్వతముమీద ఆయనతో కూడ నుండినవారమై, ఆ శబ్ద మాకాశమునుండి కలుగగా వింటిమి”
(2 పేతురు. 2: 17-18).

వేయి మాట లేల? పరిశుద్ధలేఖనముల ప్రకారము యేసు క్రీస్తు దేవుని సర్వసృష్టిలోను ఆయనకు ఏకైకపుత్రుడును, ఆయన కున్నవానికన్నిటికి కర్తయునై యున్నాడు. సర్వబ్రహ్మాండములను గలుగజేయుటయందు ఆయన దేవునికి మంత్రిగానుండుటవలన ఆయనకు గలుగవలసిన సమస్తఘనమునకును ఆయనబాధ్యుడయియే యున్నాడు. అంతియకాకుండ క్రీస్తు స్వతస్సిద్ధముగానే దేవుడయి యున్నాడు. సూర్యునినుండి సూర్యకాంతిని వేరుచేయుట ఎంత యసాధ్యమో, తండ్రియైన దేవునిస్వభావమునుండి క్రీస్తుయొక్క దైవస్వభావమును వేరుచేయుట అంతె యసాధ్యము. ఆయన తండ్రితో నేకమై ఆయన తత్త్వమే తన తత్త్వము గలవాడుగా నున్నాడు. ఆయన అన్ని విషయములందును తండ్రియొక్క ప్రతిబింబమయి యున్నాడు. క్రీస్తు ప్రభువు బ్రహ్మాండములన్నింటి సృష్టికర్త మాత్రమేగాక, వానికి సంరక్షణకర్తయు నయి యున్నాడు. కుమారుడగు దేవుడు బ్రహ్మాండములను గాపాడనియెడల అవి యుండ నే యుండవు. క్రీస్తునాథుడు తన తండ్రిచేత నిహలోకమునకు బంపబడి, నరావతారమెత్తి దీనత్వమును ధరించుటవలన, ఆయనకు స్వాభావికమయిన దైవమహిమ యించుకయిన తక్కువ కాలేదు. ఆయన పూర్వమందువలెనే, దేవదూతలకన్న నధికుడై యున్నాడు. ఆయన దీనత్వము వహించియుండు నవతారస్థితియందును, ఆయనను దేవునిగా

నారాధింపవలసినదను నాజ్ఞ దూతలకు గలిగి యున్నది. ఈ యాజ్ఞను బట్టియే యేసు ప్రభువు భూమిమీద నవతరించినకాలమందు ఆయనకు దేవదూత లనేకప ర్యాయములు పరిచర్యచేసి యుండిరి.

సోదరులారా! పయిసంగతులను జక్కగా పరిశీలించి పర్యాలోచనజేయు వారు క్రీస్తు ప్రభువు దేవునికుమారుడని యనిపించుకొనినవారిలో నొకడని గాని, పరమభాగవతోత్తములలో నొకడని గాని, సిద్ధిబొందిన మహాత్ములలోనివాడని గాని, దేవదూతలలో నొకడని గాని చెప్పుటకు దెగింపరు గదా. అట్లు తెగిం పక ఆయన తత్త్వమును బాగుగా గనుగొన్నవారు ఆయననే సర్వోత్తము డందురు. ఏలయనగా, సర్వమానవులు ఏ తారకమూర్తిని కనుగొని ముక్తినొందవలయునని కాంక్షించుచున్నారో యా తారకమూర్తియే యీయన కాని, మఱియొకరు కారు. మఱియు, కొందఱు తలంచుచున్నట్లుగా, ఆయన విష్ణ్వవతారములలో నొకడు కాడు. అటువంటి వారిలో నొకడని కూడ తలంపగూడదు. ఎందుకనగా, దయామయుడైన దేవుడు మానవుల రక్షణార్థమయి దయచేసిన పరిశుద్ధ సత్యా వతార మిది యొక్కటే; మఱియొకటి లేదు. కాబట్టి పయినిజెప్పబడిన వారం దఱకు ఈయన కేవలము భిన్నుడయి యన్నిటికైని స్తోత్రార్హుడయిన దేవుడే యని విశ్వసించుట సర్వవిధముల శ్రేయస్కరము.

ఇంకొక సంగతి. మనుష్యులందఱును పురుషు లనబడుదురు గదా. యేసన్నో, ఆయన సర్వపురుషులలో పురుషోత్తము డనబరగును. పురుషో త్తముడెట్టి లక్షణములు గలవాడయి యుండవలయునో యట్టి విషయములను గూ ర్చిన మనదేశపు ఋషుల యభిప్రాయమును వినుడి.

శ్లో॥ పురుషం బ్రహ్మ ఇత్యేతద్వ్యత్పరం పరికీర్తితమ్।
యత్రాన్యః పురుషో న స్యాత్స ఏవ పురుషోత్తమః॥
ఏకః సర్వగుణావాసస్త్వేకః సర్వకలానిధిః।
ఏకః సర్వోత్తమో యస్మాత్తతో యః పురుషోత్తమః॥

“దేవునికి పురుషుడను పేరగుటచేత నతనికి మించిన పురుషు డితరపురుషుల లో లేకపోగా నతననే పురుషోత్తముడనిరి. సమస్తసద్గుణములకు స్థానమయిన వాడొకడే, సమస్తకళలు గలవాడు నొకడే, అన్నిటికంటె ఉత్తముడును నొకడే, ఆ కారణములవలన ఆ యొకడే పురుషోత్తముడు” దానితోపాటు క్రైస్తవ ఋషుల సిద్ధాంతమును వినుడి.

“ఆ కుమారునియందు మనకు విమోచన మనఁగా పాపపరిహారము కలుగుచున్నది. ఆయన అదృశ్యదేవుని మూర్తిమంతమై సర్వసృష్టికి ఆది సంభూతుఁడై యున్నాఁడు. ఏలయనఁగా, ఆకాశమందున్నవియు భూమియందున్నవియు, దృశ్యమయినవి కాని, అదృశ్యమయినవి కాని, అవి సింహాసనములైనను, ప్రభుత్వములైనను ప్రధానములైనను, అధికారములైనను, సర్వమును ఆయనయందు సృజింపఁబడెను. సర్వమును ఆయన ద్వారాను ఆయననుబట్టియు సృజింపఁబడెను. ఆయన అన్నిటికంటె ముందుగా నున్నవాఁడు; ఆయనే సమస్తమునకు ఆధారభూతుఁడు. (కొలొస్సె. 1: 14-17.)

కావున, యేసు క్రీస్తే సర్వశరీరధారులలో నిజమైన పురుషోత్తము డనఁదగినవాఁడు. భక్తపాపహరుఁడుగా నుండుటకు సమర్థుఁడు.

దేవుఁడు నరావతారము నెత్తి వచ్చుట సాధ్యము కాదని కొందఱు గట్టిగా వాదింతురు. దేవుఁడు నరావతారమెత్తుట సాధ్యమవునో కాదో కొంతవఱకు విచారించి చూతము. ఈ విషయమయి రెవరెండు డబ్లియు, ఏచ్. కాంబెల్, ఎమ్. ఏ., బీ. డీ., దొరగారిచే వ్రాయఁబడినది వినుఁడి.

“ఏకదైవమతము ననుసరించిన కొంద ఱవతారసిద్ధాంతమును నిషేధించి దేవుఁడు నరరూపము నెత్తి వచ్చుట యసాధ్యమని వాదించెదరు. ఈ దేశమునందు హిందూమతములలోనున్న యనాచారములను ఖండించి యాత్మస్వరూపియగు నేకదేవుని నారాధించు బ్రహ్మసమాజికు లీ యభిప్రాయము ననుసరించువారు. వారును నింక వేఱు మతస్థులు కొందఱును దేవునియొక్క యమితత్వమునుబట్టి యదృశ్యుఁడు నమితుఁడును స్వయంభువును సర్వవ్యాపియు సర్వజ్ఞానియునైన తద్దేవుఁడు తన్నుఁదాను గాలస్థాన నిర్బంధనలకు లోఁబఱచుకొని నరరూపము నెట్లు ధరించుకొనుననియు ఆయన మనుజజన్మము నెత్తి వచ్చిన యెడల ఆయన దైవత్వమునకు లోపము కలిగి యాయన యమిత్యత్వము తొలఁగి పోవుననియు వాదించెదరు. ఈ వాదము నెత్తిన వా రొక సంగతిని మఱచి వాదించుచున్నారు. తన యనుమతి లేక యొకఁడు నిర్బంధింపఁబడినయెడల వాఁడా నిర్బంధనకు లోఁబడినవాఁడై సంపూర్ణుఁడు కాకపోవును గాని యొకఁడు తగిన కారణమునుబట్టి తా నుద్దేశముచేసికొని తన్నుఁదానే యున్న నిర్బంధనలకు లోపఱచుకొనినను వానికి లోపమేమియు లేదు. సర్వత్ర వెలుఁగిచ్చు సూర్యుఁడు నీటిబిందువునందు దన నిజరూపము నగుపఱచునట్లు పరంజ్యోతియగు భగవంతుఁడు తన నైజప్రకాశమును నరరూపమునందు

నగుపడుపగూడదా? మానవకోటిని సృజించినప్పుడు దేవుడు వారిని దన పోలికగా సృజించెను గనుక దైవస్వభావమునకును మనుజస్వభావమునకును గొప్పసంబంధము కల దనుటకు సందేహములేదు. కాబట్టి దేవు డొకవేళ నరరూపము నెత్తగోరి నపక్షమున ఆయన తన స్వభావలక్షణములన్నియు దృజించి యన్యలక్షణములను ధరించుకొన నక్కఱలేదు కాని తనకున్న లక్షణములను దగ్గించుకొని తన్నుదాను గాలస్థాన నిర్బంధనలకు లోబఱుచుకొనినయెడల దత్కార్యము సిద్ధమగును. ఇట్టి కార్యము సిద్ధించువిధమును బహుశః గ్రహింపలేము కాని దేవు డీలాగు జేయ నిశ్చయించినయెడల ఆయన తన యుద్దేశమును నెఱవేర్చుట కభ్యంతర మేమియు లేదని యొప్పుకొనక విధి లేదు.'' (క్రీస్తు మతనిదర్శనములు. పు. 14—15.)

శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులయ్యవారలుగారిచేత రచియింపబడినది వినుడి.—

''మనవారిలోనే కొందఱు ఈశ్వరున కవతారము లున్న వనుటకు నొప్పుకొనరు. ఎందువలన ననిన అవతారచరిత్రమువలననే ఆహార నిద్రా రతి శోక మోహాశ నాయా పిపాసా మరణాది మనుష్యధర్మము లున్నట్లు గాన వచ్చుచున్నవి. ఈశ్వరత్వ మనుష్యత్వములు తేజస్తిమిరములవలె బరస్పర విరుద్ధములొక్కచో నెట్లుండును? మానుషత్వాభినయమేగాని మనుష్యధర్మములు నిజముగా లేవన్నను పరులను మోసపుచ్చినట్లగుచున్నది. అదియు ఈశ్వరత్వ విరుద్ధమగును. కాబట్టి గొప్పచర్యంజూచి యీశ్వరావతారములని ప్రజలు భ్రమింపుచున్నారు గాని యదివాస్తవము కాదనియందురు.

''ప్రత్యుత్తరము వినుడి. ఈశ్వరుడు తన స్వల్పభాగములను ప్రాకృత శరీరములలో నుండునట్లు సంకల్పించును. ఆ భాగంబులు జీవులవలెనే కరణ కళేబరంబులలో జొచ్చినందున వానిద్వారంబుననే మనుష్యకృత్యంబులు నడపుచుండును గాని మనవలె వానికి గేవల పరాధీనములు గావు. ఇచ్ఛ వచ్చినప్పుడు విజృంభించెనేని స్వశక్తిచేత వీని శక్తి నడచి లోకోత్తరంబులగు కృత్యంబులు జేయసాగును. కాబట్టి గొప్ప యధికారంబు గలవాడు ఇచ్ఛ వచ్చినప్పుడు తన యధికారంబు వినియోగించి గొప్ప కార్యంబుల సాధించుటయును తక్కిన సమయంబులయందు మనవలెనే యున్నట్లును అవతారంబులును తమ దివ్యజ్ఞానశక్తులను ఇచ్ఛ వచ్చినప్పు డుపయోగపఱుచునని తెలిసి యతిశంకలను మానుట సత్పురుషుల కుచితంబు.'' (అవతార సంగ్రహము. పు. 4—5.)

మన మిక్కడ ఒక సంగతి కనుపెట్టవలసినది. అది యేదనిన,—

"క్రీస్తుయొక్క నిత్యత్వమగు దైవత్వ మెన్నడును మాఱకను, నశింపకను, ఆయన యెప్పుడును దేవుడైయున్నాడు. దేవుడు మనుష్యత్వము పొందినప్పుడు, దేవత్వమును మనుష్యత్వమును నేకీభవించి కలిసికొనక, ఆ రెండుతత్వములును ప్రత్యేకముగా క్రీస్తను నొకనిలో నిలుచుచున్నవని తెలిసికొనవలెను. క్రీస్తునాథుని దైవస్వభావమును మనుష్యస్వభావమును వేఱువేఱై యుండకుండిన, అవి యొండొంటితో గలిసియుండవలెను, లేక వికారపడియుండవలెను. అవి కలిసియుండిన, క్రీస్తునాథుడు దేవుడునై యుండక, మనుష్యుడునై యుండక, మఱియొక వస్తువై యుండవలెను. దైవికము మనుషీకముతో కలసిపోవుట దైవత్వమునకు తగినది కాదు. మఱియు దైవ స్వభావము మనుష్య స్వభావముగా వికారపడను కూడదు. కొందఱు పురాతన పండితులు క్రీస్తునాథుని మనుష్య స్వభావ మాయన దైవ స్వభావములో లయమై వికారపడినదని సాధించిరి. ఇటువంటి వికారములు వస్తువు సంబంధమైన స్వభావ లక్షణమునకు విరోధమగును. నిత్య దైవత్వమగు పరమవస్తువు అనిత్య జడ పదార్థమగు శరీరముగా మాఱి వికారపడను గూడదు. అనిత్య జడపదార్థమగు శరీరము నిత్య దైవత్వమగు పరమవస్తువుగా మాఱి వికాపడనుగూడదు. ప్రపంచము పొడవకమునుపు దేవునియొక్క యొక్కడే కుమారుడగు క్రీస్తునాథుడు తండ్రియొద్దనుండి యుద్భవించి, తండ్రి తత్వముగల దేవుడుగను, లోకములో పుట్టి తల్లి తత్వముగల మనుష్యుడుగను నున్నాడు. ఆయన దేవుడును మనుష్యుడునై యుండినను, నెస్తోరీయులు అను పతితులు చెప్పినట్లు, ఆయన యిద్దఱుగాక, క్రీస్తను నొక్కడేయై యున్నాడు. ఆయనయొక్క రెండు తత్వములును కలువక సంబంధపడి, యొకనిలో పొడుమును." (విశ్వాససూత్రదీపిక. పు. 100—101) ఇది యిట్లుండనిమ్ము.

ప్రస్తుతసంగతి విచారింతము. లోకములో బహుపురాతన మతస్థులగు హిందువులును యెహూదీయులగువారును దేవుని యవతార సిద్ధాంతమును పూర్ణముగా నమ్మిరి. మిగుల పురాతన గ్రంథములలో నొకటియగు ఋగ్వేదము. 10. 90. 7 లో "అజాయమానో బహుధా విజాయతే। తస్యధీరాః పరిజానంతి యోనిం" అను శ్రుతి దేవుని కవతారము లున్నట్టు తెలుపుచున్నది. ఈ మంత్రమును అవతారపరముగానే మధ్వరామానుజులు భాష్యము వ్రాసిరి. ఈ ఋక్కు తైత్తిరీయారణ్యకము 3వ ప్రపాఠకమందును, శుక్లయజుర్వేదముయొక్క 31వ అధ్యాయమందును, అథర్వవేదముయొక్క 19వ కాండయందు నున్నది. ఇదికాక, వేదవేదాం

తములయందు దఱచుగా ప్రయోగింపబడియున్న నారాయణ శబ్దార్థములోనే దేవుడవతారధారియగునను విషయము స్పష్టము గాక మానదు. ఇందుకు ఋజువు:- “నరస్యేదంనారంఅవతారేషునారంవపురయతిఇతినారాయణః, అయగతౌ” (గురుబాలప్రబోధిక. పుట 12.) “నరసంబంధమైన శరీరము నారము, అవతారములయందు నరశరీరమును బొందువాడు నారాయణుడు” అని దీని భావము.

పయి సంగతులనుబట్టి యోజింపగా, దేవుడు నరావతారధారియగునను విషయము బహు పురాతనకాలమునుండియే ప్రజలలో నాటుకొనియున్నది. కాబట్టి ప్రియమైన మిత్రులారా! దేవుడవతారమూర్తియగుననుట నిర్వివాదాంశమే యగును. ఇది యిట్లుండనిండు.

మన దేశములలో అవతారములని చెప్పబడిన వారి సంఖ్య చూచినయెడల లెక్కకు మించియున్నది. భాగవతములో ప్రథమస్కంధమందు విష్ణునియవతారములు ఇరువదిరెండనియు, ద్వితీయస్కంధమందు నిరువదినాలుగనియు జెప్పబడియున్నది. అందు మూడవయవతారము నారదుడును, ఐదవయవతారము సనత్కుమారుడును సంవాదించియున్నారు. నారదుడు పూర్వము శూద్రపుత్రుడు, ఇప్పుడు భగవదవతారము. మఱియు విష్ణువు అనంతావతారములెత్తెనని తృతీయస్కంధమందు వ్రాయబడియున్నది. సర్వసామాన్యముగా విష్ణువు దశావతారధారియని యందఱందురు. రుద్రుడుగూడ అవతారములెత్తినట్టు శాస్త్రి దృష్టము. రుద్రునియవతారము లనంతములని శైవస్కాందపురాణములయందు వర్ణింపబడియున్నది. శివావతారము లిరువదియెనిమిదని లింగపురాణము, 24వ అధ్యాయమునందు లిఖింపబడియున్నది. భైరవుడు, వీరభద్రుడు, ఏకాదశరుద్రులు, శతరుద్రులు, దూర్వాసుడు, విశ్వకర్మ, అగస్త్యుడు, అశ్వత్థామ మొదలగువారు శివావతారములు. ఈ యవతారములలో కొన్ని యోనిసంభవములు, మఱికొన్ని యయోనిసంభవములు.

దేవికూడ నవతారధారిణిని యని చెప్పబడియున్నది. ఈమె చెప్పశక్యముగాని యవతారముల నొందెనని మార్కండేయ పురాణమునందు లిఖింపబడియున్నది. రక్తదంతి, శతాక్షి, శాకంబరీ, దుర్గ, భీమ, మొదలయినవి యామె యవతారములు.

సత్యవేదములో నొక్కయవతారమునుగుఱించి మాత్రమే యభివర్ణింపబడియున్నది. అది యేసు క్రీస్తు యొక్కయవతారము. ఇది తప్ప వేఱు యవతా

రములు లేవని బైబిలు బోధించును. ఐనను, హిందూ సోదరులలో గొందఱు క్రీస్తు విష్ణుని యవతారములలో నొక్కటియై యుండవచ్చునని చెప్పుదురు. మాదేవులకును దేవికిని అనేక యవతారములు గలవనియు, వారు లోకములో నవతరించి యనేకమైన మేళ్లను రక్షణ కార్యమును జేసిరనియు గొందఱు నుడివెదరు.

ఈ సంగతులు శాస్త్రదృష్టముగా నిష్పక్షపాతబుద్ధితో విచారించి చూతము. క్రీస్తుయొక్క యవతారము విష్ణుని యవతారము కానేకాదు. తక్కిన దేవతల యవతారములలోనిదియు గాదు. ఆయవతారములన్నిటికిని ఈ యవతారము మిగుల భిన్నమయినదై యుండి యున్నది. ఆ యవతారములన్నియు రాక్షస నాశనార్థమై యెత్తి వారిని బరిమార్చి శిష్టులను గాపాడినట్లు శాస్త్రములు ఘోషించుచున్నవి. ఇందుకు నిదర్శనముగా, భగవద్గీతలు, 4వ అధ్యాయమున,—

శ్లో॥ యదాయదాహిధర్మస్యగ్లానిర్భవతిభారత।
అభ్యుత్థానమధర్మస్యతదాత్మానంసృజామ్యహమ్॥
పరిత్రాణాయసాధూనాంవినాశాయచదుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయసంభవామియుగేయుగే॥

"ఓయి భారత! ఎప్పుడెప్పుడు ధర్మమునకు చెరుపువచ్చునో, అధర్మమునకు అభివృద్ధి కలుగునో, అప్పుడప్పుడు నేను అవతరించుచున్నాను. మఱియు శిష్ట పరిపాలన, దుష్టనిగ్రహ, ధర్మసంరక్షణకొఱకు ప్రతియుగమునందు నేను అవతరించుచున్నాను." అని కృష్ణుడు చెప్పియున్నాడు. మార్కండేయ పురాణము, 4వ అధ్యాయములో,—

శ్లో॥ సాత్త్వధర్మవ్యవస్థానంకరోతినియతంభువి।
ప్రోద్ధతానసురాన్హన్తిధర్మవ్యుచ్ఛిత్తికారిణః॥
పాతిదేవాంస్తథాచాన్యాన్ధర్మగతపరాయణాన్।
యదాయదాహిధర్మస్యతదా౽త్మానంసృజత్యసౌ॥

"ఆయన (విష్ణువు) భూమియందు ధర్మముయొక్క యేర్పాటును నియమితమైన దానిని జేయుచున్నాడు. ధర్మ విచ్ఛేదకారులును, గర్వితులును అయిన రాక్షసులను జంపుచున్నాడు. అంతట దేవతలను, ఇంక ధర్మరక్షణాసక్తులగు

ఇతరులను రక్షించుచున్నాడు. ఓ జైమునీ! ఎప్పు డెప్పుడు ధర్మమునకు భంగము కలుగుచున్నదో అప్పు డప్పుడు ధర్మముయొక్క యుద్ధారణకొఱకు ఈయనే తన్ను సృజించుచున్నాడు" అని వ్రాయబడియున్నది.

ఇక శివావతారములకు కారణము వినుడి. శివుడు మాత్రమే గాక, నంది భృంగివీరభద్రుడు మొదలగు శైవులును అవతారము లెత్తినట్టు చెప్పబడియున్నది. స్కాందపురాణము, శంకరసంహిత, 183వ అధ్యాయములో,—

శ్లో॥ యదాయదాహిధర్మస్యహాని శ్శైవస్యజాయతే।
తదాతదావతారోభూద్గణేశస్యమహీతలే॥
యదాయదా ప్రాణశివైక్యభాజాంహా
నిర్భవేద్భూమితలేవతీర్య।
తదాతదామర్త్యకులేగణేశాస్సంభూ
యకుర్వంతిహిధర్మసంస్థామ్॥

"ఎప్పు డెప్పుడు శివసంబంధమైన ధర్మమునకు హాని కలుగుచున్నదో అప్పు డప్పుడు శివునియొక్క యవతారము భూతలమందు అయ్యెను. ఎప్పు డెప్పుడు శైవులకు హాని సంభవించునో అప్పు డప్పుడు భూభాగమందు గణేశ్వరులు అవతరించి మర్త్యకులమందు పుట్టి ధర్మసంస్థాపనము చేయుచున్నారు" అని యున్నది.

శివుని యవతారములు శివధర్మమును స్థాపించుటకై మాత్రమే కాక బ్రహ్మాదిదేవతలనుగూడ శిక్షించుటకును ఎత్తినట్టు లింగస్కాంద పురాణాదులయందభి వర్ణింపబడియున్నది.

దేవీ యవతారకారణముగూడ వినుడి. మార్కండేయ పురాణము, 86వ అధ్యాయమున,—

శ్లో॥ భ్రామరీతిచమాంలోకా స్తదాస్తోష్యన్తిసర్వతః।
ఇత్థంయదాయదాబాధాదానవోత్థాభవిష్యతి॥
తదాతదావతీర్యాహంకరిష్యామ్యరిసంక్షయమ్॥

"అంతట లోకులు నన్ను భ్రామరి యని ప్రశంసించుచున్నారు. ఎప్పు డెప్పుడు ఈ విధముగా దానవుల వలన గలిగిన బాధ సంభవించుచున్నదో అప్పు

డప్పుడు నేను అవతరించి రాక్షసనాశనమును జేయుదును'' అని దేవి చెప్పియు న్నది. దేవీభాగవతము, పంచమస్కంధము; 18వ అధ్యాయములో,—

శ్లో॥ యదాయదాహిసాధూనాందుఃఖమ్భవతిదానవ।
తదా తేషాఞ్చరక్షార్థం దేహంసన్ధారయామ్యహమ్॥
అరూపాయాశ్చమేరూపమజన్మాయాశ్చజన్మచ।
సురాణాంరక్షణార్థాయవిద్ధిదైత్యవినిశ్చితమ్

''ఓయి రాక్షసా! సాధువులకు ఎప్పు డెప్పుడు దుఃఖము కలుగుచున్నదో అప్పుడు వారి రక్షణకొఱకు దేహధారిణిని అగుచున్నాను. రూపములేని నాకు రూపమును, జన్మలేని నాకు జన్మయును, దేవతల రక్షణకొఱకు అని తెలిసికొనుము'' అని దేవియే చెప్పుచున్నది.

సోదరులారా! పయివాక్యములను మనము చక్కగా జర్చించి చూచిన, హరిహర శక్త్యావతార కారణములు సాధువులను రక్షించుటకును పాపులను నాశనము చేయుటకును ఎత్తినట్లు తేటబడుచున్నది. మఱియు, ఆ యవతారములు రాక్షసుల వినాశమునిమిత్తమును ఎత్తినట్టుకూడ విస్పష్టము. ఈ లోకములో శిష్టు లెవరు? దుష్టు లెవరు? పుణ్యాత్ము లెవరు? పాపాత్ము లెవరు? ''పాపోహమ్'' అను సిద్ధాంతము ప్రకారము మానవు లందఱును పాపులనే గదా? మనుజు లందఱును పాపు లే యైన పక్షమున, ఆ యవతారములవలన పాపులకు ఏమి ప్రయోజనము కలుగునో మీరే యోజింపుడు. అదియు గాక, అన్ని యవతారములలో విష్ణుని యవతారములు మిగుల ప్రశంసింపబడుచున్నవి. ఈ యవతారములు గలుగుటకు పయికారణములకు భిన్నముగా వేఱుకారణములు మనదేశపు ఋషులే వ్రాసియుంచిరి. వారు వ్రాసిపెట్టిన వ్రాతలలో కొన్నిటిని నిచ్చట వ్రాయుచున్నాము.

బ్రహ్మవైవర్తక పురాణము, కేదారఖండము, 17వ అధ్యాయమునందు,—

శ్లో॥ అయంభృగుర్మహాయోగీత్వద్భక్తాగ్రేసరఃకృతీ।
అస్మిన్కృతాపరాధశ్చహరిఃపత్నీవధాత్పురా॥
అనేకజన్మనాంపాత్రమభూదస్యాపరాధతః।
పునస్తేకృపయాత్వేనంసమాధాయదశాకృతేః॥

"ఈ భృగు మహాయోగినీ(శివుడు) యొక్క భక్తులలో శ్రేష్ఠుడును కీర్తనలు చేయువాడునైయున్నాడు. ఇతనియొదల భార్యను చంపుటయను నేరమును విష్ణువు చేసెను. ఆ యపరాధమువలన చాలజన్మలకు హేతువాయెను. తిరుగ పది రూపముల నెత్తుటకు అతనిని దయచేసి సమాధానపతిచెను" అని లిఖింపబడియున్నది. ఈ భృగువే శివునిగూడ దారుణముగా శపించినట్లు పద్మభాగవత పురాణములందు జెప్పియున్నది. యోగవాసిష్ఠ రామాయణము, ప్రథమ సర్గము వైరాగ్య ప్రకరణము,—

శ్లో॥ భృగుణైవంకుమారేణశాపితోదేవశర్మణా।
బృన్దయాశాపితోవిష్ణుస్తేనమానుష్యతాఙ్గతః॥65॥

"ఇట్లు, భృగువుచేతను, సనత్కుమారునిచేతను, దేవశర్మచేతను, విష్ణువు శపింపబడెను. బృందచేతనుగూడ శపింపబడెను. దానం జేసి మనుష్యత్వము నొందెను." అని చెప్పుచున్నది. అవన్నియు రామావతార మెత్తుటకు కారణములు. దేవీ భాగవతము, 4వ స్కంధము, 20వ అధ్యాయమునందు,—

శ్లో॥ ఏవంనానావతారేత్రవిష్ణుశ్శాపవశఙ్గతః।
కరోతివివిధాశ్చేష్టాదైవాధీనస్సదైవహీ।

"ఇట్లే విష్ణువు శపింపబడి అనేక అవతారములయందు అనేకములైన చేష్టలు చేయుచుండెను. ఎల్లప్పుడును దైవాధీనుడుగానే (కర్మవశుడు) యుండెను" అని చెప్పియున్నది.

ప్రియమైన భ్రాతృవరులారా! విష్ణువుయొక్క దశావతారములు స్వేచ్ఛగా ఎత్తినవని కొన్ని పురాణములును, ఋషులచే శపింపబడి యవతరించినవని మఱికొన్ని పురాణములును ప్రకటింపుచున్నవి. దేవుడు ఋషుల శాపములచే జన్మమువచ్చుట యెట్టిదో తెలియకున్నది. ఐనను, బహుపురాణము లట్లే చాటుచున్నవి. పూర్వ మీమాంసము, 1. 1. 3. లో,-సూ॥విరోధేత్వనపేక్ష్యంస్యాత్॥ అని వ్రాయబడియున్నది. "ఇతరవచనములచే బాధితమగునప్పుడు ఆ సంగతి యుపేక్షింపతగ్గది" అని యీ సూత్రమున కర్థము. కాబట్టి యిట్టి బాధితమగు సిద్ధాంతముల నెట్లు విశ్వసింపగలము?

క్రీస్తుని యవతారకారణములను యోజింతము. సత్యవేదములో,—

"పాపిష్ఠపరిత్రాతుంఖ్రీష్టోయీశుర్జగతిసమవతీర్ణోఽభవత్"॥
(1 తిమోతి. 1: 15.)

(పాపులను రక్షించుటకు క్రీస్తు యేసు లోకమున పుట్టినవాడాయెనని దాని యర్థము.)

«నరావతారః క్రీస్తోయీశుర్విద్యతేయః సర్వేషాం ముక్తేర్మూల్యం ఆత్మదానం కృతవాన్» (1 తిమోతి. 2: 5-6.)

(ఆయన క్రీస్తు యేసను నరావతారుడు; ఈయన అందరికొఱకు విమోచన క్రయ ధనముగా తన్ను తానే సమర్పించుకొనెను" అని దాని భావము.

«మనుష్యపుత్రో హి హారితమన్వేషితుం త్రాతుం చాగతః॥ (లూకా. 19: 10.)

(నశించిన దాని వెతకి రక్షించుటకు మనుష్యకుమారుడు వచ్చెనని దాని తాత్పర్యము.)

«యతః స్థైవాగతో మనుష్యపుత్రో న పరిచర్యాం భోక్తుమ్
అపి తు పరిచరితుం దాతుఞ్చ స్వప్రాణాన్
నిష్క్రయమూల్యం బహూనాం వినిమయేన» మత్తై 20: 28.)

(అలాగే మనుష్యకుమారుడు ఉపచారము చేయించుకొనుటకు రాలేదు గాని యుపచారము చేయుటకును అనేకులకు ప్రతిగా విమోచన క్రయ ధనముగా తన ప్రాణము నిచ్చుటకును వచ్చెనని చెప్పెను అని దీని యర్థము.)

ఈలాగున నేయనేక వాక్యములయందు ప్రభువైన యేసు పాపుల రక్షణార్థమై భూలోకమునం దవతరించెనని ప్రతిపాదింపబడియున్నది.

ఇక్కడ ఒక సంగతి. ఈ నిత్య కుమారుడు స్వర్గలోకమునుండి దిగి వచ్చెనని యేలాగు చెప్పగలము? దేవుడు నిత్యుడు గనుక ఆయన స్వభావము మారనేరదు; ఆయన సర్వ వ్యాపి గనుక ఒక స్థలము విడిచి యింకొక స్థలమునకు వచ్చుట అసంభవముకదా; ఒక సమయమున పరలోకమందలో నుండెనని, యింకొకప్పుడు ఆ స్థలము విడిచి భూలోకమునకు వచ్చెనని చెప్పుట దైవ స్వభావమునకు విరోధము కాదా? అని యొక శాస్త్రి యడిగెను. తాను శాస్త్రియైయుండి యట్లు ప్రశ్నించుట మిగుల వింతయే. ఈ సంగతి క్రైస్తవు లెఱుగక పోలేదు. క్రీస్తు నరావతార మెత్తుటయందు తన స్వభావములో నెంతమాత్రము మార్పు పొందినాడని వారు నమ్మరు. «ఆయన నిన్న నేడు నిరంతరము ఒక్కరీతిగానే యున్నాడు" అని ఆయనను గుఱించి చెప్పియున్నది. మఱియు స్థలము విషయములోను

ఆయనకు మార్పుకలుగలేదు. ఆయన సర్వవ్యాపి గనుక నరావతార మెత్తినప్పుడు పరలోకమును విడిచిపెట్టి భూలోకమునకు వచ్చెనని, ఆ సమయమున పరలోకము లో ఆయన లేడని యనరాదు. ఐనను ఆయన పరలోకమునుండి దిగివచ్చె ననగా అర్థమేమి? నిత్యుడును మార్పులేనివాడునైన ఆ ప్రభువు, మానవ స్వరూపమందు మనుష్యులకు తన్ను తాను ప్రత్యక్షపఱచుకొనెనని యర్థము.

అవతార శబ్ద నిష్పత్తి వినుడి:—

తృ (తర్) అనునవి ధాతువులు.

అవ అనునది ఉపసర్గ.

అవ + తర్ = అవతర్ = క్రిందికి దిగుట యని అర్థము.

అవతారమనగా పరలోకమునుండి క్రిందికి రాబడిన వానికి పేరు.

సోదరులారా! మానవులు పాపముచేత దేవుని నెఱుగక యున్నారు. మన దృష్టిచేత మధ్యాహ్నమందు సూర్యుని ఏలాగు చూడలేమో, పాపముచేత చెడిన మన యాత్మలు కోటి సూర్యతేజో స్వరూపియైన పరమాత్ముని చూడలేక యున్నవి. ఇట్టి స్థితిలో నున్న మనమీద దేవు డపరిమిత కరుణకలిగి తన మహిమను నర రూపముచేత కమ్ముకొనినట్లు నర స్వభావము దాల్చి నరుని మాటవలనను క్రియల వలనను దేవు డిట్టివాడని మనకు కనబఱచుటకై వచ్చి యీ లోకములో జీవించెను. కాబట్టి క్రీస్తుయొక్క యవతారమునందు దేవుని ప్రేమ, జాలి, జ్ఞానము, న్యాయము, కృప మొదలగు కల్యాణ గుణము లిట్టివని నర రూప సహాయమువలన మనకు ప్రత్యక్షపఱుపబడెను.

పాపమువలన పడిపోయిన మానవుని రక్షణకై జగత్తు పునాదివేయబడక పూర్వమే రక్షకుడైన క్రీస్తు ఏర్పఱుపబడెనుగాని, ఆయన చాల కాలమువఱకు ఈ లోకములోనికి బంపబడలేదు. ఆదినుండి యీ రక్షకుని రాకడవఱకు గడచిన యీ మధ్య కాలములో జీవించుచుండిన భక్తులకు ఆయనను గూర్చి ఏమియు తెలియదని మన మనుకొనగూడదు. ఎందుకనిన ఆ రక్షకుని రాకడ కొఱకు మనుష్యులను సిద్ధపఱచుటకును, వారిని ఆదరించి బలపఱచుటకును ఈ లోకములో నవతరించినట్టి క్రీస్తుయొక్క నరావతారమునుగూర్చి దేవు డాదినుండి తన భక్తులకు దెలుపుచువచ్చెను. కావున ప్రాత నిబంధన కాలపు భక్తులు క్రీస్తు రాకడకొఱకు ఆశ్యాశతో గనుపెట్టుచుండిరి. (లూకా 10: 24.) విశ్వాస నేత్రముతో ఆయనను చూచి రక్షింపబడిరి.

చివరగా నొకమాట: యేసు క్రీస్తు ప్రభువు నరావతార మెత్తుటచేత నీరసులముసు దిక్కులేనివారమునైన మనకు తోడు నీడగా నుండుటకయి దేవుడు మన యొద్దకు వచ్చియున్నాడని నమ్మువారందఱకును నిత్య సహాయమును సంతోషమును గలుగుచున్నది.

## 6వ ప్రకరణము.

## యేసు క్రీస్తు నిత్యము పరిశుద్ధుడనుటను గుఱించి.

యేసు క్రీస్తు మానవ దేహము ధరించినను పాపమెన్నడు చేయక పరిపూర్ణ పరిశుద్ధ మూర్తియై యుండెను. ఈయన యెప్పుడు గాని యే విధముగు పాపమయినను జేయని జితేంద్రియుడు. ఇక్కడ కొందఱు శంకింతురు. ఆయన యోని సంభవుడా? అయోని సంభవుడా? యోని సంభవుడయిన యెడల, ఆయనలో జన్మ పాప మేలలేదు? జన్మ పాపముగలవాడయినచో, ఆయన మనలను రక్షింప నెట్లు సమర్థు డగును? అని కొందఱు హిందువులు తఱచుగ ప్రశ్నింపుచున్నారు. పురుషుడు లేకుండ ఒక స్త్రీ గర్భవతియై కుమారుని కనె ననుట స్వభావ ధర్మమునకు విరుద్ధముకాదా? యని మఱి కొందఱు చెప్పుటకు సాహసించుచున్నారు.

ఈ ప్రశ్నలు మహా ముఖ్యమయినవి. వీనికి ప్రత్యుత్తరములు గూడ వేదోక్తులను బట్టియేగాక, వేఱు మార్గమున సులువుగా గ్రహింప నలవికావనుటకును సందియములేదు. వారేయుద్దేశముతో నడిగినను, వాని కుత్తరములు దెలిసికొనదగిన యంశములే. ఎందుకనిన, "అంధఃకిమంధం నేతుంశక్నోతి," "స్వయమశుద్ధః కథంపరాన్ తారయతి" అను ధర్మములచొప్పున, యేసు క్రీస్తు పాపియైనచో, ఆయన యితర పాపులకు రక్షకుడుగ నుండదగడు. అంతే కాదు. మన మాయనను విశ్వసించి సేవించుటయు తెలివి తక్కువ పని యగును. కాబట్టి యీ ప్రశ్నల యుత్తరము విషయమై శాస్త్రానుకూలముగ తగిన విమర్శచేయుట మిక్కిలి యావశ్యకము.

అవును; ఆయన యోని సంభూతుడే. యోని సంభూతుడగు ప్రతివాడు జన్మ పాపముగలవాడే యగును (యోబు 25: 4; కీర్తన 51: 5; ఎఫెసీ 2: 3.) అది అలాగుండుగాక. అయిన నేమి, యేసు క్రీస్తు ఒక్కడు మాత్రము నర జన్మ మెత్తిన వారిలో నెంత మాత్రము జన్మ పాపము లేశము లేనివాడని తీర్మానింపబడెను. ఈయన హిందూ మత సిద్ధాంత ప్రకారము కర్మ దోషమువలన గాని, ఋషు

ల శాపములవలనగాని జన్మకు వచ్చినవాడయిన యెడల, నిస్సందేహముగా జన్మపాపముగలవాడేయగును. కాని, ఆయన యట్లు రాక, మనుష్యుడు తన దుర్ఘటమైన దురవస్థనుండి తనంతట తాను తప్పించుకొన వీలులేని నిరాధారుడని యెఱిగి ఆ యేసు నాథుడు తన నిర్హేతుక జాయమాన కటాక్షమువలన దేవుని యనాది సంకల్పము చొప్పున సర్వ లోక పాపమునకు ప్రాయశ్చిత్తముగా దన ప్రాణమును సమర్పింప నీ లోకమున నవతరించెను. ఇది యిట్లుండ నిండు.

యేసు క్రీస్తు ఎవని బలమువలన లేక ఎవరి క్రియవలన నుద్భవించెనను విషయమును గూర్చి ముందుగా విచారింతము. త్రియేక సత్య దైవతత్త్వములో నొకడగు పరిశుద్ధాత్మ బలమువలననే యేసు క్రీస్తు పుట్టెను. పరిశుద్ధాత్మ కన్యయగు మరియ గర్భములో క్రీస్తు యేసుని నద్భుత విధముగా నుద్భవింపజేసెను. అది ఆయన యేలాగు చేసెనో యది మన బుద్ధి కందని కార్యము. అయినను, మనవల్లనైనంతవఱకు సత్యవేదమును బట్టి భయ భక్తులతో విచారించెదము. క్రీస్తు యేసుని పుట్టుకకు పరిశుద్ధాత్మ తానే కారణ భూతుడైనందున, ఆయన తక్కిన మనుష్యులు పుట్టినట్లు పుట్టక, అత్యద్భుత విధముగా పుట్టెను. ఆయన పుట్టుకను గుఱించి దేవ దూత కన్య మరియకు దెలిపినపుడు, ఆమె దూతను జూచి,—"నేను పురుషుని నెఱుగని దాననే, ఇది యేలాగు జరుగునని కన్య మరియ చెప్పినందు వలన, ఆయన స్త్రీ పురుషుల సంయోగ మార్గమున బుట్టిన వాడు కాడని స్పష్టము. ఇది యేలాగు జరుగునని యామె హృదయమున నాలోచించి దేవ దూత నడిగినందు వలన, ఆయన తల్లి క్రియవలన గూడ గలుగ జేయబడిన వాడు కాడనియు దేట బడుచున్నది గదా. కన్య మరియ యోసేపునకు ప్రధానము చేయబడిన పత్నియయి యుండినను, వారుభయులకు పొందు గాక మునుపే యామె పరిశుద్ధాత్మ వలన గర్భవతి యాయెను(మత్తయి 1: 18). మరియు యోసేపు లాయన తలిదండ్రులని లూకా 2: 27లో చెప్పియుండినను, 33వ వచనములో ఆయనను గుఱించి చెప్ప యున్న సంగతులకు వారిద్దఱాశ్చర్యపడిరని సవిస్తరముగా వ్రాసియున్నది. యోసేపు ఆయనను పెంచిన తండ్రియై యుండెను గనుక, తండ్రియని యెంచబడెను. జనులు గూడ యేసుని యోసేపు కుమారుడని పిలిచిరి. కాబట్టి యేసు యోసేపునకు బుట్టిన వాడు గాక, కన్య మరియయందు పరిశుద్ధాత్మ బలము వలననే యుద్భవించెనని తెలియుచున్నది.

ఆదియందు దేవు డిచ్చిన వాగ్దత్త ప్రకారము, క్రీస్తు స్త్రీ సంతానమైయుండినను, కన్య మరియకు తన గర్భములో నొక శిశువును నుద్భవింప జేయు శక్తి గలిగి యుండలేదు. అయితే దేవుని కసాధ్యమైన కార్య మొకటియు లేదు గనుక పురుష బీజము లేకయే, పరిశుద్ధాత్మ ఆయనను కన్యకా గర్భములో నుద్భవింపజేసెనని తెలియబడుచున్నది. ఒక కన్యక గర్భిణియగునను ప్రవక్త వచన ప్రకారము, దేవ దూత కన్య మరియను జూచి,—“పరిశుద్ధాత్మ నీ మీదికి వచ్చును; సర్వోన్నతుని శక్తి నిన్ను కమ్ముకొనును గనుక పుట్టబోవు శిశువు పరిశుద్ధుడై దేవుని కుమారుడనబడును” (లూకా 1: 35). అని చెప్పెను. ఆలాగుననే, ఆమె పరిశుద్ధాత్మవలన గర్భవతి యాయెను. ఇది చూచి యోసేపు మరియను గూర్చి సందేహపడినపుడు (మత్తయి 1: 29), సర్వేశ్వరుని దూత— “దావీదు కుమారుడవైన యోసేపూ! నీ భార్యయయిన మరియను జేర్చుకొనుటకు భయపడకుము; ఆమె గర్భము ధరించినది పరిశుద్ధాత్మవలన కలిగినది” (మత్తయి 1: 20) అని చెప్పెను. విశ్వాసుల పునర్జన్మమును (ద్విజత్వము) గూర్చి— “వారు దేవునివలన పుట్టిన వారే కాని రక్తమువలననైనను మనుష్యేచ్ఛవలననైనను పుట్టిన వారు కారు” (యోహాను 1: 13) అని సత్యవేదములో నున్నది. విశ్వాసుల పునర్జన్మమువలెనే, జగద్రక్షకుడగు యేసు తన శరీరోద్భవములో శరీరేచ్ఛవల్లనైన మనుష్యేచ్ఛవల్లనైన బుట్టక, స్త్రీ గర్భములో మనుష్య దేహమును దాల్చెను. ఆ శరీరము కన్య మరియ యందు దుద్భవించిన వస్తువై యుండుటవలన, అదియామె గర్భములో రూపింపబడిన శరీరమై యున్నది.

మఱియొక సంగతి చూతము. యేసు క్రీస్తు పుట్టుక మిక్కిలి యద్భుతమైనదని మహమ్మదు కూడ ఒప్పుకొని ఖురాను 19వ సుర (మరియమ్మ) 16వ ఆయతులో నిట్లు వ్రాయుచున్నాడు: “గాబ్రియేలు మరియమ్మకు నగపడినపుడు, ఆమె భయపడి—నేను కృపగల దేవుని శరణుజొచ్చుచున్నాననెను. గాబ్రియేలు— “నిజముగా నేను దేవుని దూతను. నీకు పరిశుద్ధుడైన కుమారుని నొకని నిచ్చుటకు నేను వచ్చియున్నాను” అని యనెను. అందుకు మరియమ్మ— “నేనెట్లు కుమారుని కనగలను? ఏ మనుష్యుడును నన్నెన్నడును ముట్టుకొనలేదు. నేను వేశ్యను కాను” అని యనెను. “ఇట్లు జరుగును. ఇది నాకు కష్టమైన పని కాదు; ఆయనను (నీ కుమారుని) మనుష్యుల కొక గురుతుగాను, మా యొద్దనుండి పంపబడిన కృపావరముగాను మేము చేయుదుము, అని నీ దేవుడు చెప్పుచున్నాడు” అని గాబ్రియేలనెను. ఈ మాటలనుబట్టి యేసు క్రీస్తు పుట్టక ముందే ఆ

యనను గూర్చి మరియకు దెలుపుటకు గాబ్రియేలు దేవుని యొద్దనుండి వచ్చెననియు, యేసు యొక్క తల్లి యే పురుషుని నెఱుగక ముందే ఆయనను కనెననియు ఖురాను స్పష్టముగా జెప్పుచున్నట్లు మనకు దేటబడుచున్నది. ఇదిగాక, 21వ సుర (అంబియా) 91వ ఆయతులో,—“కన్యయైయుండిన ఆమెలోనికి మా యాత్మను పంపితిమి; ఆ విధముగా, ఆమెను ఆమె కుమారుని మనుష్యులందఱకును నొక గుఱుతుగా నేర్పఱిచితిమి” అని వ్రాయబడియున్నది.

సోదరులారా! పయిన జెప్పబడిన ఖురాను సాక్ష్యమును బట్టి చూడగా, యేసు క్రీస్తు పుట్టుక యొక యద్భుత కార్యమే యనియు, ఆయన స్త్రీ పురుష సంయోగమువలన బుట్టినవాడు కాడనియు, ఆయన కన్యయైన మరియకు దేవుని విశేష శక్తిమహిమ మూలమున బుట్టెననియు, ఆయన మాతృ గర్భములోనే పరిశుద్ధమైన శిశువై యుండెననియు స్పష్టముగ దేలుచున్నది.

సత్యవేదమునుబట్టి చూడగా, యేసు క్రీస్తు జన్మము మిగుల అద్భుతమైనది. ఆయన పరిశుద్ధాత్మ ప్రభావమువలన జన్మించెను. మనుష్యులకు స్వభావముగా నున్న జన్మ పాపము లేనివాడు. ఆయన స్త్రీ సంతానమైనను, ఆయన మానవ స్వభావము జనని గర్భములోనే పరిశుద్ధపఱుపబడి దైవ స్వభావముతో జేర్పబడెను. ఆయన పాప మొకటితప్ప అన్ని కార్యములలో మనవంటి వాడై యుండెను.

ఇది యిట్లుండగా, యేసుని తల్లి జన్మ పాపముగలది గనుక, తల్లిని బట్టియైనను ఆయనలో పాపాంకురము లేమాత్రమును లేకుండునా? యని కొందఱు హిందూ సోదరులు ప్రశ్నింతురు. ఈ ప్రశ్నకు కూడ ప్రత్యుత్తరము పైసంగతులవలననే దేటబడుచున్నది. అయినను దీనిని గుఱించి కూడ కొంచెము వివరముగా నాలోచింతము.

దేవుడు జీవముగల సమస్త వస్తువులను సృజించినప్పుడు వాని వాని జాతుల ప్రకారము పుట్టుటకు బలమిచ్చెను. ఇందును బట్టియే మనుష్యులు తమ స్వరూపమందు బిడ్డలను కనుచున్నారు. (ఆదికాం. 1: 27; 5: 3). ఈ సంబంధము దేహ సంబంధమయినది మాత్రమే కాక, ఆత్మ సంబంధమయినదియు నయి యున్నది. మనుజులు తమ శరీరముల వలన శరీరములను, ఆత్మల వలన ఆత్మలను కనుదురు; అనగా తలిదండ్రుల గుణ రూపముల ప్రకారము బిడ్డల గుణ రూపము లున్నవని చూచుచున్నాము. శరీరము పుట్టగానే యాత్మయును గలుగుచున్నది. ప

యి సంగతుల కనుగుణ్యముగా, మహాభారతము, శాంతి పర్వము, 190వ అధ్యాయము, 15, 16, శ్లోకములు;:—

“పృథివీసర్వభూతానాంజననీతద్విధాః స్త్రియః।
పుమాన్ ప్రజాపతి స్తత్రశుక్రం తేజోమయంవిదుః॥
ఇత్యేతల్లోకనిర్మాణం బ్రహ్మణావిహితంపురా।
ప్రజాఃసమనువర్తంతే స్వైః స్వైఃకర్మభిరావృతాః॥

అర్థము: “సమస్త భూతములకు భూమి తల్లియయి యున్నది. ఆలాగుననే స్త్రీలును అయి యున్నారు. పురుషుడు ప్రజాపతి యనియు, అచ్చట శుక్రము తేజోమయ మనియు (పుట్టింప శక్తి గలదనియు) తెలియుము. పూర్వము బ్రహ్మచేత నీలాగున లోక నిర్మాణము తగినట్లు చేయబడినది. ప్రజలు తమ తమ క్రియలచేత నావరింపబడిన వారయి నడుచుచుండిరి.” ఇదియుగాక, శరీరము పుట్టగానే యాత్మయును గలుగు చున్నందుకు ప్రమాణము లున్నవి. ఆ భారతములోనే, ఆది పర్వము 74వ అధ్యాయము 49వ శ్లో,—“ఆత్మాత్మనైవజనితః పుత్రఇత్యుచ్యతేబుధైః॥ అర్థము: “ఆత్మ వలన బుట్టిన ఆత్మనే పుత్రుడని బుధులు చెప్పిరి.” మఱియు నిర్ణయ సింధువు, శ్రాద్ధ నిర్ణయ ప్రకరణములో,—జాబాలః॥ అంగా దంగా త్సంభవతి పుత్రవద్దు హితానృణామ్॥ “మనుష్యులకు కొడుకు వలెనే కూతురును అవయవములనుండి యవయవములను బొంది పుట్టుచున్నది” అని జాబాల ఋషియు జెప్పుచున్నాడు.

కావున తల్లిదండ్రులకు దేహాత్మల సంబంధ గుణము లేలాగో యాలాగుననే వారి వలన గలిగిన బిడ్డలకును నుండును. పురుషునికి స్త్రీ సంపర్క మూలమున గలిగిన స్త్రీ పురుష శిశువులకు జన్మ పాపము నంటి యుండుట సహజమే. క్రీస్తు యేసు విషయములో అది యట్లు జరిగియుండలేదు. ఎందుకనిన, ఈయనకు తండ్రిలేడు; తల్లి మాత్రము గలదు. కావున ఈయన శరీ రోద్భవములో శరీరేచ్ఛవలన నయిన, మనుష్యేచ్ఛవలననైన బుట్టక, స్త్రీ గర్భములో మానవ దేహమును దాల్చెను. ఆ శరీరము శుద్ధ కన్యక యం దుద్భవించిన వస్తువయి యుండుట వలన అది యామె గర్భములో రూపింపబడిన శరీరము మాత్రమే యయి యుండెను. దేవుని కసాధ్యమయిన కార్యమొకటియును లేదు. కావున పురుష బీజము లేకనే పరిశుద్ధాత్మ తన దైవ ప్రభావముచేత ఆయనను పరిశుద్ధ కన్యకా

గర్భములో నుద్భవింపజేసెనని మనము తెలియ దగినది. కావున యేసు క్రీస్తులో తల్లి జన్మ పాపాంకుర మున్నదనుట కే యాస్పదములేదు. ఆయన యోనిసంభవుడే యినను, ఆయనలో జనని జన్మ పాపాంకురములు బొత్తిగా లేనేలేవు. అది య ట్లుండనిండు.

కొందఱు కొందఱు మఱొక వితండ వాదము చేయుదురు. అదేదనిన, మ న దేశపు ఋషులలో కొందఱు అయోని సంభవులుగ బుట్టిరట; వారు నిత్య పరిశు ద్ధులేయట. ఆ యయోని సంభవులు మాత్రమే పరిశుద్ధులయి యుండగలరట. యేసు క్రీస్తు యోనిజుడై యున్నందున పాప సంభూతుడై యుండక మానడుగన ని పట్టిన పట్టు విడువక వాదించువారును గలరు. అట్టి వారిని గూర్చి మేమేమన గలము? అట్టివారు తమ ఋషుల యభిప్రాయములనైనను కొంత తెలిసికొనియుం డిన బాగుగ నుండును. హిందూ శాస్త్రములనుబట్టిచూచినను, వారి వాదము ని లువదు. హిందూ శాస్త్రములను బట్టి క్రీస్తు యేసొక్కడు మాత్రమే దేహ ధారు లందఱిలో జన్మ పాపమెంత మాత్రము లేని మహనీయుడేయని స్థిరముగా స్థాపనజే యగలరు. ఆ యయోనిజుల సంగతి తరువాత విచారింతము. ప్రస్తుత మీ విష యము హిందూ ఋషుల తాత్పర్య మేమని కొంత పరిశోధించుట యుక్తము. ఒ క శిశువు తండ్రియొక్క ప్రతి యవయవమునుండి కలిగి మాతృ గర్భములో వృద్ధి పొందును. ఇందుకు నిదర్శనముగా, లింగ పురాణము, పూర్వ భాగము, 89వ అ ధ్యాయము:—

శ్లో॥ పితృశ్శరీరాత్ప్రత్యంగంరూపమస్యోపజాయతే।
తతోస్యమాతురాహారాత్పీతలీఢప్రవేశనాత్ ॥

“ఇతనికి (శిశువునకు) రూపము తండ్రియొక్క ప్రతి యవయవమునుండి క లిగెను. అటు పిమ్మట తల్లియొక్క యాహారమునుండి త్రాగిన పానీయమునుండి పుష్టియేర్పడెను” అని బోధింపుచున్నది. ఇదియుగాక జనని పుత్రునకు తో లు సంచి చందమున నుండును. అలాగుననే మత్స్య పురాణము, 49వ అధ్యా. 12వ శ్లోకములో,—

మాతాభస్త్రాపితుఃపుత్రో యేనజాతస్సఏవసః॥

‘ తల్లి తోలు సంచి యనియు, కొడుకు ఎవనివలన బుట్టింపబడినో యట్టి తం డ్రియే అతడు” అనియు చెప్పియున్నది. శిశువునకు తండ్రి యంగమునుండి యం

గములును, హృదయమునుండి హృదయమును గలుగుచున్నది. మహాభారతము, ఆది పర్వము, 74వ అధ్యాయము, 64వ శ్లోకము:—

“అంగాదంగాత్సంభవసిహృదయాదధిజాయసే।
ఆత్మావైపుత్రనామాసిసజీవశరదశ్శతమ్॥

అర్థము॥ “(ఓ పుత్రుడా!) నా ప్రత్యవయవమునుండి (నీవు) పుట్టుచున్నావు. కామ స్థానమైన హృదయమునుండి హృదయమును బుట్టుచున్నది. పుత్రనామముగల (నా) ఆత్మవే యగుచున్నావు. అట్టివాడవగు నీవు నూఱు సంవత్సరములు జీవించుము.” ఈ శ్లోకము వేద మంత్రమై యున్నది. ఈ మంత్రము బృహదారణ్యకోపనిషత్తునందున్నది. మఱియు, శిశు గుణోత్పత్తికి క్షేత్రము ప్రధానముకాదు; కాని, బీజమే ప్రధానమని మనువు స్పష్టీకరించుచున్నాడు. మనుస్మృతి 9వ అధ్యాయము:—

శ్లో॥ క్షేత్రభూతా స్మృతానారీబీజభూతః స్మృతఃపుమాన్।
క్షేత్రబీజసమాయోగాత్సంభవస్సర్వదేహినామ్॥33॥
బీజస్యచైవయోన్యాశ్చబీజముత్కృష్టముచ్యతే।
సర్వభూతప్రసూతిర్హి బీజలక్షణలక్షితా॥35॥
యాదృశంతూప్యతేబీజంక్షేత్రేకాలోపపాద్యతే।
తాదృగ్రోహతితత్తస్మిన్ బీజంస్వైర్వ్యంజితంగుణైః॥36॥

“స్త్రీలను, క్షేత్రమునటు (పైరు పెట్టెడు భూమి) సమముగా జెప్పుచున్నారు. ఈ క్షేత్రమును, ఈ బీజమును జేరుటచేతనే సకల జంతువులును బుట్టుచున్నవి. బీజ క్షేత్రములయందు బీజము ప్రధానముగా జెప్పబడుచున్నది. సకల భూతములయొక్క సంతతియు బీజముయొక్క వర్ణ స్వరూపాది లక్షణములు గలదై కనబడుచున్నది. తగిన కాలమందు వడ్లు మొదలగు ధాన్యముల విత్తనము విత్తినట్టియిన పిదప సందువలన గలిగెడు ధాన్యములు ఆ విత్తనముయొక్క రూపముతోనే యా క్షేత్రమందు గలుగుచున్నవి.” మఱియు ఈ మనువే క్షేత్రముయొక్క గుణ మెంతమాత్రము కనిపించుటలేదనియు దృష్టాంత పలుచుచున్నాడు. ఆ తొమ్మిదవ అధ్యాయములోనే,—

శ్లో॥ ఇయంభూమిర్హి భూతానాంశాశ్వతీయోనిరుచ్యతే।
నచయోనిగుణాన్ కాంశ్చిద్బీజంప్వతిపుష్టిషు॥37॥
భూమావప్యేక కేదారే కాలోప్తానికృషీవలైః
నానారూపాణిజాయంతేబీజానీహస్వభావతః॥38॥
అన్యదుప్తంజాతమన్యదిత్యేతదుపపద్యతే।
ఉప్యతేయద్ధియద్బీజంతత్తదేవప్రరోహతి॥40॥

"సకల స్థావరములకును భూమియే యోనిగా జెప్పుచున్నారు. అయినను దానియందు గలిగిన వృక్షములు మొదలగు వానికి భూమియొక్క గుణము కించి త్తయినను కానబడలేదు. ఒక క్షేత్రమందు అనేక విత్తనములను విత్తినను అవి యవి తమ తమ బీజములయొక్క గుణములను జూపునేగాని క్షేత్రములయొక్క గుణములను గొంచెమయినను జూపుటలేదు. ధాన్యపు గింజను విత్తిన యెడల పెసరు మొక్క పుట్టదు. ఏ గింజవేసిన ఆ మొక్కయే పుట్టును. ఇట్లు భూమి ధరా(భూమి) ను వృత్తి లేకుండ బీజ గుణాను వృత్తి వ్రీహ్యాదులయం దగుపడు చుండెను గాన మనుష్యులయందును బీజమే ప్రధానమని చెప్పియున్నది" అని యున్నది. యేసు క్రీస్తునకు మానవ జనకుడు లేడు. ఆయనకు దేవుడే నిత్య జన కుడు. ఇదియుగాక, జ్ఞాన వేద సార సంగ్రహమునందు,—

యథాకర్మతథారూపంయథాబీజతథాంకురః।
యథాపితాతథాపుత్రలోకాద్వర్తనవాక్యయోః॥

"ఏ క్రియ జేసిన ఆ స్వరూపమును, ఏ విత్తు నాటిన ఆ మొక్కయును, తం డ్రి స్వరూపమే కుమారుడును నగును. ఇందుకు లోకమున వచ్చిన వేదమే సా క్షి" అని వ్రాయబడియున్నది. ఏ క్రియ జేసిన ఆ స్వరూప మేర్పడు" ననుచో, కన్యక గర్భమునందు పరిశుద్ధాత్మ ప్రభావముచేత జేయబడిన యాద్భుత క్రియవలన జన్మించిన క్రీస్తు యేసు నం దెవ్వరి స్వభావ గుణమేర్పడునో బుద్ధిమంతులగు మీ రే యోజింపుడు. పయిన నుదాహరించిన ఋషుల తాత్పర్యములను బట్టి యోజిం చినను, పుత్రునకు తండ్రి తత్త్వమే ప్రధాన మనిరిగాని, తల్లి తత్త్వ మెంత మాత్ర ము ప్రధానము కాదనిరి, ఆయన తల్లి స్వభావముగలవాడగుననుట పిచ్చి మాట.

తల్లి జన్మ పాప స్వభావ మేమాత్ర మాయన కంట దనుట శాస్త్ర సమ్మతమైన మాటయే కావున, యేసు స్వామి పరమ జనకుని స్వభావమే కలవాడగును.

ఇందుకు సత్యవేద సంప్రదాయములను వినుడి,—

“ఆయన (క్రీస్తు) దేవుని మహిమయొక్క ప్రతి బింబమును ఆయన తత్త్వముయొక్క మూర్తిమంతముగా నై యుండెను” (హెబ్రీ 1: 13).

“నిత్యత్వమునుండి తండ్రి (దేవుడు) వలన జన్మించిన వాడును నిజమైన నిత్య దేవుడును తండ్రితో ఏక స్వభావముగలవాడునైన తండ్రియొక్క వాక్యముగు కుమారుడు భాగ్యవతియైన కన్య గర్భమందు మనుష్య స్వభావమును ఆమె శరీరమువలన వహించెను” (2 మతాంశము).

గీ॥ తనయుఁడై పుట్టునట తండ్రి ధాత్రియందు।
ఆత్మవై పుత్రనామాసి యనెడువాక్య।
మది నిజంబేని క్రీస్తు దేవాత్మజుండు।
దేవుఁడే క్రీస్తుఁడనగ సందియమిఁకేల॥

అది యట్లుండ నిమ్ము.

హిందువులలో కొందఱు ప్రభువైన క్రీస్తు పుట్టుకను గురించి యీ విధముగా ప్రశ్నించుటయును గలదు. ఎట్లనిన,— లోకములో స్త్రీలు పురుషులవలన పిల్లలను గనుట స్వభావ ధర్మము కాదా? ఒక కన్యక పురుషుడు లేకుండ గర్భవతియగుట యెట్లు? పిండ మేర్పడుట యేలాగు? లోకములో నెన్నడు జరిగియుండని స్వభావ విరుద్ధమైన కార్యము జరిగిన దనుట కెట్లు సాధ్యము? అట్లు జరిగిన దని క్రైస్తవు లెంత బోధించినను, దానిని మనుష్యు లెట్లు నమ్మగలరు? అని అప్పు డప్పుడు కొందఱు హేళనగా మాట్లాడుదురు.

కొంతమంది దేవుని శక్తిని గుర్తెఱుగక, ఆయనను తమవంటి వానిగా నెంచి, ఆయన జ్ఞానమును తమ జ్ఞానముతో సరిపోల్చుకొని మాటలాడుదురు. దేవుడు మన వంటివాడేనా? ఆయన జ్ఞానము మన జ్ఞానము వంటిదేనా? ఎంత మాత్రము కాదు. ఈ సకల ప్రపంచమును ఎవ్వడు ఇచ్ఛా మాత్రముచేత సృష్టించి సాటిలేని మేటియై సర్వము పరిపాలించుచున్నాడో, ఎవ్వడు దృష్టి మాత్రముననే యీ సమస్త సృష్టిని పరిహరింప సమర్థుడో, అతడే దేవుడు. అదియుగాక

ఆ మహాత్ముని— జ్ఞాన స్వరూపుడు, స్వతంత్రుడు, సర్వనియంతృడు, సర్వాశ్రయుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తుడని సర్వ మతములవారు కొనియాడుచుందురుగదా. వీని కర్థమేమి? జ్ఞాన పరిపూర్ణమగు ఈ యద్భుత సృష్టి రచనము వలన జ్ఞాన స్వరూపుడనియు, ఎవనిచేతను ఆజ్ఞాపింపబడనివాడగుటచే స్వతంత్రుడనియు, అన్నిటిని ఆజ్ఞాపించి నియమిత పథమునందుంచుటచే సర్వనియంతృడనియు, సమస్తమునకు నాధార భూతుడగుటచే సర్వాశ్రయుడనియు, ప్రతి వస్తువును దాని నుపయోగ మెఱిగి సృష్టించుటచే సర్వజ్ఞుడనియు, సర్వ శక్తులును ఆయన వలన ఉత్పత్తియగుటచేగాని, సర్వ కార్యములను అవలీలగా గలుగజేయ సమర్థుడగుటచే గాని సర్వ శక్తుడనియు వాని కర్థము. అట్లయినచో, దేవు డీ కార్యమును, ఆ కార్యమును ఎట్లు చేయగలిగెనని మనము తర్కించి తర్కించి తెలిసికొనగలమా? ఎంత మాత్రమును తెలిసికొనజాలము.

ఇదియుగాక దేవునికి సమస్తము సాధ్యమను నంశ మెల్లఱకు విశదమే. అట్లయిన సర్వేశ్వరుడు పురుష సంయోగములేకనే కన్యకా గర్భములో పిండోత్పత్తి కలుగజేయగలడని నమ్ముట కేమి కష్టము? కష్టముండదు. సామ్యములేని యేసుని పుట్టుక ప్రపంచములో నెన్నడును జరిగియుండని ప్రపంచ స్వభావమునకు ప్రత్యేకమయిన కార్యమే యని మేమును మనస్సా నమ్మి యొప్పుకొని వాచా బోధింపుచున్నాము. యేసు క్రీస్తుని ఒక్కని జన్మము మాత్రమే యట్లు జరిగియున్నదని సత్యవేదములో వ్రాయబడియున్నది. ఆయన మనుష్యులందఱు పుట్టినట్లే పుట్టినవాడయిన యెడల అందఱివలెనే ఆయన కూడ జన్మ పాపియే యగును. అందఱివలె ఆయనయును జన్మ పాపియైనచో, ఆయన భక్త పాపహారుడుగా నుండదగునా? అందుకు భిన్నముగా, సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడు క్రీస్తుని జననము విషయమై జరిగించిన జ్ఞాన పరిపూర్ణమగు కార్యమిదే. ఆ పుట్టుక ప్రపంచములో జరుగుచున్న దాని వంటిదేయై యుండిన యెడల, అది లోకముతో పాటు స్వభావ సిద్ధమైన కార్యమే అని యనిపించుకొనునుగాని, అది ఆయన సర్వ మానవుల రక్షణ విషయమై జరిగించిన యద్భుత కార్యమని యనిపించుకొనదు. అదియుగాక, అది స్వభావ ధర్మమునకు విరుద్ధకార్యమైనను, మనము కొంచె మాలోచించి చూచిన పక్షమున, అది యందఱు నమ్మదగిన కార్యమేయని స్ఫురింపక మానదు.

అద్భుత కార్యమననేమి యని ముందుగా విచారించి తెలిసికొనుట మంచిది. అద్భుత కార్యమనునది స్వభావ పద్ధతి ప్రకారముగాక, దైవ యత్నమువలన స్వభావ పద్ధతికి వేఱుగా నడచున క్రియ. ఏలాగనిన, సృష్టింపబడిన వస్తువులొక దానితో నొకటియు, ఒక దానివలన నొకటియు నడచుకొనుటకు సృష్ట్యాది నుండి దేవునివలన కొన్ని ప్రమాణములును, కొన్ని పద్ధతులును గలిగి యున్నవి. అది స్వభావ పద్ధతియని చెప్పబడును. సత్యవేద మా పద్ధతిని ఆకాశమునకును భూమికిని గలిగి యుండు ప్రమాణమని చెప్పి యున్నది. ఆ యాది ప్రమాణముల చొప్పున నడుచునది యేదో యది స్వభావముగా నడుచునది యని చెప్పబడును. ఆ స్వభావ పద్ధతి ప్రకారము నడువక వేఱు విధముగా నడచునది యద్భుత కార్యమని చెప్పబడును.

అద్భుత కార్యమనునది మన బుద్ధిచేత గ్రహించుకొనబడనదిగా నుండియు, మన బుద్ధికి విరోధముగా నుండుటలేదు. ఒకటి స్వభావ పద్ధతికి వ్యత్యస్తముగా నడచు నప్పుడు, అది నడచు విధము మనకు దెలియక యుండియు, ఆ నడతయే మన పంచేంద్రియములకు స్పష్టముగా నగపడుటవలన దానిని లేదన గూడదు. అది మన బుద్ధికి విరోధము కాదు. ప్రతి దినము మనకెదుట నడుచు కార్యములలో ననేక కార్యముల విధము మనకు తెలియకపోయినను మన మా నడతను లేదని చెప్పుచున్నామా? లేదు. వ్యవసాయకుడు ధాన్యమును భూమిలో విత్తిన పిమ్మట అది మొలిచి పెఱిగి నూతన ధాన్యము నిచ్చుట యందఱకును తెలియును. అది భూమిలోనుండి సారమును పీల్చుకొని పెఱుగు విధ మొకరికిని తెలియదు. తెలియనందువలన పయిరులేదని యెవరు చెప్పుదురు? వృక్షములు పెద్ద గాలి కొట్టి నప్పుడు కదలియు, చిన్న గాలి కొట్టి నప్పుడు కదలక యున్నవి. ఒక కాలమందా వృక్షము లాకులవలన నిండియుండును. ఒక కాలమందాకులు లేక వట్టివిగా నిలుచుచున్నవి. ఈ చర్యలకు హేతువుగానుండు కారణములను విద్వాంసులు చెప్పుదురు. ఆ కారణములు నడచు విధము మాత్ర మొకరికిని తెలియదు. సుడిగాలి లేచుటయును అగి పోవుటయును నెట్లు? ఆకాశము నిశ్శబ్దముగా నున్నపుడు సుడిగాలి కలుగుట యెట్లు? అదెవ్వరికైన తెలియునా? కన్య మరియమ్మ గర్భోత్పత్తి యెట్లు కాగలిగెనో ఆ సంగతి కొంతసేపు అటుండనిండు. సంసార స్త్రీ గర్భవతియైన పక్షమున, ఆమె గర్భమందు గూడ పిండోత్పత్తి ఎట్లగును? ఆ పిండము కర చరణాద్యవయవములతో శిశువుగా రూపింప

బదుకుట యెట్లు? ఆ శిశువులోనికి ప్రాణము వచ్చుట యెట్లు? ఈ సంగతులన్ని యు కలుగు విధము ఉన్నది ఉన్నట్టుగా నెవరైన చెప్పగలరా? అదియును లేదు. మన మనేక కారణములను చెప్పినప్పటికిని ఆ కారణములకు కారణము తెలియ జాలము. అది దేవుని శక్తివలన నున్నదని చెప్పవలయును. ఈ కార్యము లన్ని యు మిగుల ఆశ్చర్యపడ దగినవిగా నుండియు, ఇవి ప్రతి దినము మన యెదుట నడచుటవలన నాశ్చర్యపడకుండగ నున్నాము. ఇవి ప్రతి దినము జరుగ కుం డ అపరూపముగా జరిగినట్లయిన ఇవన్నియు మనకు గొప్ప యాశ్చర్యమును గ లుగ జేయును. పసిబిడ్డ పెద్దవాడు కాక మునుపే వాని శ్వాసము పోయి మర ణము పొందుటను మనము చూచి నపుడు, అది సాధారణముగా జరుగునది గనుక మన కత్యాశ్చర్యము కలుగ నేరదు. రోగిష్ఠు డొకడు మఱియొకని మాట మా త్రముచేత నే స్వస్థత పొందుటయును, మృతి పొందిన యొకడు మఱియొకని ఆజ్ఞ మాత్రమున నే జీవము పొందుటయును మనము చూచిన యెడల, అధికముగా ఆ శ్చర్యపడి అద్భుతకార్య మని చెప్పుదుము.

ఇదియుగాక, యేసు క్రీస్తు—«ఒక కన్యకకే జన్మించును» అని సృష్ట్యారంభ మునుండి ఆయన జన్మము పలుకు సత్యవేదపు ఋషులచేత ప్రవచనముల మూలము న దేవుడు తెలియజేయుచునే యుండెను. ఎట్లనిన, స్త్రీ సంతానము సర్పము (సాతాను) యొక్క తలను నలుగ గొట్టును (ఆది కాం. 3: 15) అను మూల వాగ్దత్తము చొప్పునను, «ఇదిగో యొక కన్య గర్భవతియై కుమారుని కనును; ఆ యన ఇమ్మానుయేలని పిలువబడును" (యెషయా 7: 14.) అని యెషయా వివ రముగా పలికిన ప్రవచన వాక్యము చొప్పునను, యేసు క్రీస్తు కన్య మరియ గర్భ ములో నుద్భవించి పుట్టెనని సువార్తికు లందఱును సాక్ష్యము పలుకుచున్నారు. ఇదిగో! యొక కన్య గర్భవతియై కుమారుని కనును (లూకా 1: 27.) అను ది వ్య వాక్యము చొప్పునను, కన్య మరియ గర్భములో రక్షకు డుదయించెను. «స ర్వేశ్వరుడు భూమిమీద నూతనమైనది సృజించెను; స్త్రీ నరుని చుట్టుకొనును" (ఇర్మియా 31: 22). «యేసును గూర్చిన సాక్ష్యము ప్రవచన సారము" (ప్రక టన 19: 10) అని సత్యవేదము ఉద్ఘోషింపుచున్నయది. ఇంతియకాక, ప్రవక్తలు ప్రవచనములను వచించుటకు దేవుడు వారిని ప్రేరేపింపకమునుపు ఆ సంగతులు, కలుగవలెనని ఆయన కుద్దేశమున్నట్టు మనకు తెలియును. అయినప్ప

టికిని ఆ సంగతులను కలుగజేయుటవలన అవి వ్రాయబడిన దైవ గ్రంథమును దృ ఢపఱచుటకును, ఆయన యొక్క యొకానొక ఉద్దేశమయి యుండెను.

వే యేల? సోదరులారా! మనుష్యులకు మాఱుగా శ్రమా మరణములను నొం దుటకయి దేవుని కుమారుడు మనుష్య రూప స్వభావములు ధరింప గోరినపుడు, ఆయన మనుష్యు లందఱును జన్మించినట్లు జన్మింపక, అద్భుతము వలనను పరిశుద్ధా వతార మర్మము వలనను మనుష్యుడాయెనని మనము విశ్వసించుటకు సత్యవేదము విస్ఫుటోక్తులతో నాజ్ఞాపించుచున్నది.

కొందఱు యేసు క్రీస్తు పుట్టుకను గుఱించి యింకొక శంక చేయుదురు. క్రీస్తు జననము లోక విడ్డూరమును ప్రపంచ స్వభావ ధర్మమునకు విరుద్ధమునై యు న్నదని కొంద అనిష్టముగ మాట్లాడుదురు. అయిన నట్లు చెప్పువారి దిగువ నుదా హరింపబడిన పుట్టుకలను గుఱించి వినినట్లయిన నేమనుకొందురో! ఇళయను స్త్రీ పు రూరవునకు తల్లియు తండ్రియునై యున్నదట. భారతము, శాంతి పర్వము, 74వ అధ్యాయము, 51వ శ్లోకము,—

పురూరవా స్తతో విద్వానిళాయాంసమపద్యత।
సావై తస్యాభవన్మాతాపితాచై వేతినః శ్రుతమ్॥

“పిమ్మట పండితుడగు పురూరవుడు ఇళకు బుట్టిన వాడాయెను. ఆమె యతనికి తల్లియు తండ్రియునై యున్నట్టు మనకు వినికిడి కలిగి యున్నది.” క శ్యపుడు తన భార్యల యందు పక్షి వృక్ష గుల్మాదులను గలిగించెనట. మా ర్కండేయ పురాణము, 108వ అధ్యాయములో,—

శ్లో॥ తామ్రాచసుషు వే శ్యేని ప్రముఖాః కన్యకాద్విజ।
యసాం ప్రసూతిః ఖగమా శ్శ్యేన భాసు శుకాదయః॥
ఇలాయాః పాదపాః జాతాః ప్రధాయాః పతతాంగణాః।
అదిత్యాంయ సముత్పన్నా కశ్యప శ్యేతిస న్తతిః॥

“తామ్రా శ్యేని మొదలగు కన్యకలు డేగలను పక్షులను, భాస అను కన్యక చిలుకలు మొదలగు వానిని కనిరి. ప్రధయను చిన్నదానికి పక్షి సమూహములు పుట్టినవి. అదితికి దేవతలు పుట్టిరి. ఈ విధముగా కశ్యపునికి సంతతి కలిగెను” అని లిఖించి యున్నది. మత్స్య పురాణములో, 6వ అధ్యాయమునందు,—

శ్లో॥ తథాకిన్నరగన్ధర్వా న్నరిష్టాజనయద్బహూన్।
తృణవృక్షలతాగుల్మమిరాసర్వమజీజనత్॥

"అరిష్ట అనేక కిన్నర గంధర్వులను కనెను. చెట్లు, గడ్డి, తీగెలు, పొదలు మొదలగు సమస్తమును మిర యను చిన్నది కనెను" అని లిఖితమై యున్నది. ఈ స్త్రీ లందఱు దక్షుని పుత్రికలు; కశ్యపుని భార్యలు; గాంగేయుడు గాడిద కడుపునను, ఋష్యశృంగుడు లేడి కడుపునను, శౌనకుడు శునకము కడుపునను, బుట్టిరని వజ్ర సూచి యందు జెప్పి యున్నది.

ప్రాజ్ఞులారా! పయిని జెప్పబడిన పుట్టుకల కేమందురు? ఇంతకన్నను లోక విరుద్ధము లున్నవా? న్యాయతః విచారించి చూచిన పక్షమున, ఈ పుట్టుకలా, లేక యేసు క్రీస్తు పుట్టుకా, లోక విడ్డూరము? వీనిలో ఏది ప్రపంచ స్వభావమునకు విరోధము? ఇట్టి యసంభవ గాథలు పురాణాది గ్రంథములందు చదువునప్పుడెల్లను మీరు నమ్ముచున్నారుగదా? అయిన పరిశుద్ధాత్మ ప్రభావముచే నద్భుత విధముగ నుద్భవించిన జగద్రక్షకుడగు యేసుని జన్మ విశేషమును నమ్ముట మీకు సాధ్యము కాదా?

ప్రియులగు ఆర్య సోదరులారా! ఒక విధముగా యేసు క్రీస్తు పుట్టుక లోక విడ్డూరమే యగును. ఏలయనిన, సృష్ట్యాది నుండి యిప్పటి వఱకు ఆయన పుట్టుక వంటిది మఱొకటి కానము. నిజముగా ఆయన జననము లోక విరుద్ధమయినదే. ఎందుకనిన, ఆయన వలె ప్రపంచములో తండ్రి లేకుండ నొక్క తల్లికి మాత్రమే జన్మించిన వాడు మఱి యొకడు లేడు. ఇకను నుండబోడు. యేసు క్రీస్తు పుట్టుక లోక స్వభావరీతికి విరుద్ధమే యగును. ఎందుకనిన, ఆయన లోక స్వభావ పద్ధతికి లోబడి పుట్టినవాడుకాడు. అట్లు పుట్టినయెడల, ఆయనకూడ అందఱివలె జన్మ పాపముగల వాడగును. అట్లు పుట్టలేదు గనుకనే ఆయన "భక్త పాపహరుని" స్థానములో నిరభ్యంతరముగా నిలువబడగలిగెను. మఱియు, యేసు క్రీస్తే సమస్త మానవులలో మిగుల ఆశ్చర్య పురుషుడనుటకు సందియములేదు. ఎట్లనిన, ఆయన ఒక్కడే సంపూర్ణ మనుష్యుడును దేవుడునై యున్నాడు. ఆయన ఒక్కడే సర్వ మానవులలో ప్రపంచ స్వభావమునకు విరోధముగా అఖండ నీతి స్వభావుడును అత్యంత పరిశుద్ధ ప్రవర్తన గలవాడునై యుండెను. అది యెట్లుండనిండు,

సర్వేశ్వరుడు సర్వశక్తుడను మాటను తెలిసికొనజాలక పురుష సంయోగము లేని శుద్ధ కన్య గర్భమునందు క్రీస్తు ఏలా గుద్భవించెనని కొందఱ అపహాస్యముగాను, వితండముగాను వాదించుచున్నారని యిదివఱకు వ్రాసియుంటిమి. అందుకు కొంత సమాధానమును నిదివఱకు తెలిపియుంటిమి. ఇప్పుడా యంశము మఱింత స్పష్టముచేయుటకు కొన్ని దృష్టాంతములను వారి గ్రంథములనుండి కూడ ఎత్తి చూపిన పక్షమున, వారు దానిని గొంత యనుభవరీతిగా దెలిసికొనుటకు వీలు చిక్కునని మాకు తోఁచి యట్లు చేయుచున్నాము.

సంకల్ప మాత్రముననే యీ సమస్త సృష్టిని సృష్టింప సమర్థుడగు భగవంతుడాకార్యమును నిర్వహించి చేయగల నిపుణుడు కాడను వారినిగుఱించి మేమేమనగలము? ఇట్టి శంక యెవరు చేసినను, హిందువులైనవారు చేయుట కే మాత్రపు ఆస్పద మయినలేదు. అనేకమంది స్త్రీలు పురుష సంయోగము లేకుండనే పిల్లలను గనినట్లు హిందూపురాణేతిహాసములలో దృష్టాంతములు పెక్కులు గలవు. ఆ గాథలు వీరు నమ్ముచున్నారు. ఇందుకు నిదర్శనముగా ఆది శక్తి త్రిమూర్తులను కనెనని కొన్ని పురాణములలో వ్రాయబడియున్నది. ఒక స్త్రీ పురుషుడు లేకుండ బిడ్డను కనుటెంత కష్టమో, ఒక పురుషుడు స్త్రీ లేకుండ కుమారుని కనుట అంతే కష్టముగదా! ఊర్వుడను నొక ఋషి భార్యలేకుండ పుత్రుని పుట్టించెనని చెప్పియున్నది. మత్స్య పురాణము, **174**వ అధ్యాయములో,—

శ్లో॥ వపుర్దీప్తాన్తరాత్మానమేతత్కృత్వామనోమయమ్।
దారయోగంవినాస్రక్ష్యేపుత్రమాత్మతనూరుహామ్॥
ఏవమాత్మానమాత్మామేద్వితీయంజనయిష్యతి।
వన్యేనానేనవిధినాదిధక్ష్యన్తమివప్రజాః॥
ఔర్వస్తుతమసావిష్టోనివాశ్యోరుంహుతాశనే।
మమన్థైకేనదర్భేణసుతస్యప్రభవారణిమ్॥

తస్యోరుంసహసాభిత్వాజ్వాలామాలీహ్యనిన్ధనః।
జగతోదహనాకాఙ్క్షీపుత్రోగ్నిస్సమపద్యత॥

“ప్రకాశము గల అంతరాత్మ సంబంధమైన శరీరము మనోమయముచేసి నా శరీరమందు భార్యలేకుండనే పుత్రుని పుట్టింతును. ఇట్టి నా యాత్మయందు

నింకొక యాత్మ పుట్టగలదు. ఈ విధిచేతను పుత్రులను శాసింపగలను. పిమ్మట అత డొక రెల్లును చేత బూని తన తొడను అగ్నియం దునిచి మథించిన నందుండి జ్వాలా మాలియు, నిరంధనుడును, అగ్నియనగు పుత్రుని పుట్టించెను" అని వ క్కాణింపబడియున్నది. ఇంతేకాదు. పూర్వము ప్రజలు మిథున సంయోగము లేకనే స్మరణ దర్శ నాదులచేతనే సంతానము పడసిరని చెప్పబడియున్నది. ఈ మత్స్య పురాణములోనే 8వ అధ్యాయమునందు,—

శ్లో॥ సఙ్కల్పాద్దర్శనాత్స్పర్శాత్పూర్వేషాంసృష్టిరుచ్యతే।
దక్షాత్ప్రాచేతసాదూర్ధ్వంసృష్టిర్మైథునసమ్భవా॥

"పూర్వులయొక్క సృష్టి తలంపుచేతను, చూపుచేతను, తాకుటచేతను గలి గిన దని చెప్పబడియున్నది. దక్షునినుండి ప్రాచేతసులు పుట్టక పూర్వము సృ ష్టి మైథునమువలన కలిగినది" అని నుడువబడియున్నది. మఱియు, పూర్వ ము స్త్రీలు కూడ అంత్యకాలమున ధ్యాన స్మరణాపేక్షలచేతనే వారలకు సంతా నము కలుగుచుండెనని వ్రాయబడియున్నది. మార్కండేయ పురాణము, 44వ అ ధ్యాయములో,—

శ్లో॥ ఆయుషోన్తే ప్రసూయన్తే మిథునాన్యేవతాస్సకృత్।
కులికాకులికాశ్చైవముత్పాద్యన్తే ముమూర్షతామ్॥
తతః ప్రభృతికల్పేస్మిన్మిథునానాంచసమ్భవః।
ధ్యానేనమనసాతాసాం ప్రజానాంజాయతేసకృత్॥

"కులీనులు, అకులీనులు మరణమును బొందునపుడు మిథునములనే కనుచు న్నారు. అప్పటినుండి యీ యుగమందును మిథునముయొక్క యుత్పత్తికలదు. ఆ ప్రజలకు ధ్యానముచేతను, మనస్సుచేతను నొకానొకప్పుడు సంతానోత్పత్తి కల దు" అని వాకొనబడియున్నది. మిథున మనగా కవల పిల్లలు.

నపుంసకుల భార్యలకు దేవతాప్రసాదమువలన నద్భుతముగ సంతానము పు ట్టుచుండెను. ఋగ్వేదము, 1వ మండలము, 116వ సూక్తము, 13వ మంత్రము—

శ్రు॥ అజోహవీన్నాసత్యాకరావాంమహే
యామన్పురుభుజాపురంధిః।

శ్రుతంతచ్చాసురివవద్ధిమత్యా
హిరణ్యహస్తమశ్వినావదత్తమ్॥

"వద్ధిమతియను పేరుగల యొకానొక రాజర్షి కూతురు మగడు నపుంసకు డైన పుత్ర లాభమునకై అశ్వినీ దేవతలను పిలిచెను. ఆ పిలుపు విని, అశ్వినీ దేవతలు వచ్చి ఆమెకు హిరణ్యహస్తుడను కొడుకు నిచ్చిరి." అవన్నియు సరేకాని, ఇక నొక యబ్బురమైన గాధ వినుడి. మహాభారతము, శాంతిపర్వము, 207వ అధ్యాయము,—

శ్లో॥ నచైషాంమైథునోధర్మోబభూవభరతర్షభ।
సంకల్పాదేవచైతేషామపత్యముపపద్యతె॥
తతస్త్రేతాయుగేకాలెసంస్పర్శాజ్జాయతెప్రజా।
నహ్యభూన్మైథునోధర్మస్తేషామపిజనాధిప॥

"భరత వంశ శ్రేష్ఠుడా! వీరికి (కృత యుగమందున్న వారికి) మైథున ధర్మము లేదు. సంకల్పముచేతనే వీరలకు సంతతి కలుగుచున్నది. పిమ్మట త్రేతా యుగమందు ప్రజలు స్పర్శ (తాకుట) వలననే కలుగుచుండిరి. ఓ రాజా! వారలకును మైథున ధర్మములేదు."

ఆర్య సోదరులారా! పయి సంగతులను మీరు చదివి నప్పుడెల్లను సుళువుగా వానిని నమ్ముచున్నారు. యేసు ప్రభువు పురుషుని ఎఱుగని శుద్ధ కన్యకా గర్భమందు జన్మింప నసంభవమని యీ యాక్షేపముచేసెడివారికి వారి గ్రంథముల నుండి యెత్తి చూపబడిన యీ నిదర్శనములు చాలును. పర తంత్రులగు మనుష్య మాత్రులే మిథున కర్మ వినా సంకల్ప దర్శన స్పర్శన ధ్యానాదులచేతనే పిల్లలను గలిగింపగల సమర్థత గలవారని నమ్మ గలిగిన పక్షమున, సర్వ శక్తియుతుడు సర్వ స్వతంత్రుడైయుండు సర్వేశ్వరుడు పురుష సంయోగము వినా కన్యకా గర్భమున శ్రీమంతుడైన యేసుని నిరభ్యంతరముగా నుద్భవింపజేయ సమర్థుడై యుండగలిగెనని యెట్టి మందుడైన నిస్సంశయముగా నమ్మవచ్చును.

పయిన చెప్పిన గాధలు కల్పనా కథలే కాని విశ్వాస యోగ్యమగు సంగతులు కావని యెంత పసిబిడ్డకైన తోచక మానదు. కృత యుగమునందును త్రేతా యుగమునందును అనగా 30 లక్షల పై చిల్లర యేండ్ల కాలము నైసర్గిక విరోధ

ముగా ప్రజా వృద్ధి కలిగెనని యెవరు నమ్మగలరు? సృష్ట్యాదినుండి ప్రజా వృద్ధి స్త్రీ పురుష సంయోగము వలననే గలుగుచున్నదని సత్యవేదములో స్పష్టముగా వ్రాయబడియున్నది. అలాగుననే లోకము జరుగుచుండెనని హిందూ గ్రంథములు గూడ తెలుపుచున్నవి. పయి గాథలు, వానియంతటఅవే ఖండించుకొనుచున్నవి. మొదటినుండి యీ ధర్మమున్నందుకు నిదర్శనములు పెక్కులు గలవు. పద్మ పురాణము, ఉత్తర ఖండము, 4వ అధ్యాయము,—

శ్లో॥ పురారాజన్ గతంకల్పేవర్తమానేకృతేయుగే।
కుత్సోనామమునిశ్శ్రీమాన్ బ్రహ్మసూనురకల్మషః॥
సకర్దమసుతాంకన్యాంఉపయేమేవిధానతః।
తస్యాంతస్యచపుత్రోభూద్వాత్సోవంశవివర్ధనః

"ఓ రాజా! పూర్వ కల్పాంతము నప్పటి కృత యుగమందు తేజోవంతుడైన కుత్సుడను బ్రాహ్మణ కుమారు డొకడు కలడు. అతడు కర్దమ మహాముని కుమార్తెయగు నొక కన్యను వివాహమాడి ఆమెయందు వంశోద్ధారకుడగు కుమారుని పడసెను." సృష్టికర్తయైన బ్రహ్మయే మిథున కర్మముచేతనే ప్రజా వృద్ధి కలుగ జేసెనని మత్స్య పురాణమందు వ్రాయబడియున్నది. ఎట్లనగా, బ్రహ్మ యిరువది తత్త్వములుగా జేసి యీ జగత్తును పుట్టించెను. పిమ్మట సావిత్రీ జపముచేత అతనికి స్వచ్ఛమైన దేహము కలిగెను. అందు సగము పురుష రూపముగాను, మిగిలిన సగము స్త్రీ రూపముగాను ఆయెను. ఆయర్ధనారీ రూపము శతరూపిని యను అతి రూపవతియగు కూతురయ్యెను. అంతట ఆ బ్రహ్మ మన్మధ బాణజాలమున కోర్వజాలక యీ సుందరవతిని వరియించెను. మత్స్య పురాణము, 3వ అధ్యాయము,—

శ్లో॥ ఉపయేమేసవిశ్వాత్మాశతరూపామనిన్దితామ్।
సబభూవతయాసార్థమతికామాతురోవిభుః॥
సలజ్జాంచకమేదేవఃకమలోదరమన్దిరే।
యావదబ్దశతందివ్యంయథాన్యఃప్రాకృతోజనః॥
కాలేనమహతాతస్యతద్వాత్పుత్రోఽభవన్మనుః।
స్వాయంభువఇతిఖ్యాతాస్సవిరాడితినశ్శ్రుతమ్॥

"ఆ బ్రహ్మ శత రూపినిని పొందెను. ఆ ప్రభువు ఆమెతో గూడ అతి కామముచేత తొందర కలవాడయ్యెను. పిమ్మట అతడు ఆమెతో గూడి పద్మ గర్భమను ఇంటియందు సిగ్గుకలవాడైయుండెను. ప్రపంచములోని సామాన్య జనునివలె నూఱు సంవత్సరము లుండగా గొప్ప కాలమునకు అతనిని బోలిన మనువను కుమారుడు కలిగెను. అతడే స్వాయంభువు మనువనియు విరాట్పురుషుడనియు పిలువబడగా వినియున్నాము." మత్స్య పురాణము, 4వ అధ్యాయము,—

శ్లో॥ స్వాయంభువో మనుర్ధీమాం స్తప స్తప్త్వాఽతిదు స్తరమ్।
పత్నీ మవాపతుష్టాత్మా హ్యనన్తానామనామతః॥
ప్రియవ్రతో త్తానపాదామను స్తస్యామజీజనత్ ॥

"బుద్ధిమంతుడైన స్వాయంభువు మనువు మిక్కిలి కష్టతరమైన తపస్సుచేసి అనంతాయను పేరుగల భార్యను సంపాదించి తృప్తిగలవాడయ్యెను. ఆ మనువు ఆమెయందు ప్రియ వ్రతుడు వృత్తానపాదుడు అను పేరుగల యిద్దఱను కనెను." వీరివలననే ప్రజలు వృద్ధిపొందిరని చెప్పియున్నది. ఎట్లనిన, "బ్రహ్మ దేహము రెండు విధము లాయెను. ఆ రెండును నొక భాగము స్వాయంభువు మనువును రెండవది ఆయన భార్యయగు శత రూపయను కన్యకగా మిథునంబై పుట్టెను. ఆ యిద్దఱకు ప్రియ వ్రతుడు, ఉత్తానపాదుడను ఇద్దఱు పుత్రులును, ఆ కూతి, దేవహూతి, ప్రసూతియను ముగ్గురు పుత్రికలును, మైథున ధర్మముచే బుట్టిరి. అందాకూతిని రుచికునకు, దేవహూతిని కర్దమునకు, ప్రసూతిని దక్షునకు నిచ్చిరి. వీరి వలన గలుగు సంతానముచేత లోకము నిండియుండెను" అని (భాగవతము, తృతీయస్కంధము, 12వ అధ్యాయమున) వ్రాయబడియున్నది. ఈలాగుననే మైథున ధర్మముచే ప్రజోత్పత్తి కలిగినట్టు (మనుస్మృతి 1: 32, దేవీ భాగవతము, తృతీయస్కంధము 13: 15, 16) లలోను వ్రాసియున్నది.

ఆ మనువే కృత యుగ ధర్మములను తెలియజేయుటకు మనుస్మృతి రచించెను. మనుస్మృతి 9వ అధ్యాయము:—

శ్లో॥ ప్రజానార్థం స్త్రియఃసృష్టాస్సంతానార్థంచమానవాః॥33॥

వేయేల! బ్రహ్మ పురుషులతో పాటు వారి భార్యలను గూడ సృష్టించినట్టు కొన్ని గ్రంథములు చెప్పుచున్నవి. స్కాందపురాణము, శివమాహాత్మ్య ఖండము 12వ అధ్యాయములో,—

శ్లో॥ బ్రాహ్మణా బ్రాహ్మణ స్త్రీభిస్సహాజాతా స్తపోధనాః।
తస్యబాహూత్సహా స్త్రీభిర్జజ్ఞిరేపృథివీభుజః॥
ఊరుభ్యాంసహితా స్త్రీభిర్జాతా వై శ్యాశ్శివాజ్ఞయా॥
పద్భ్యాంశూద్రాస్సహా స్త్రీభిర్జజ్ఞిరే వేదవిత్తమాః।
స్వస్త్రీమిస్స్వస్య వేదేనమార్గేణోర్ధస్స్వయంభవేత్॥

దీని కర్థము:- "ఆ బ్రహ్మ ముఖంబుల శివు నాజ్ఞచే బ్రాహ్మణులు స్త్రీలతో గూడ బుట్టిరి. బాహువుల క్షత్రియులు స్త్రీలతో గూడ బుట్టిరి. ఊరువుల వైశ్యులు పాదముల శూద్రులు తమ తమ స్త్రీలతో గూడ శివు నాజ్ఞచే బుట్టిరి. వారెల్ల తమ తమ భార్యలంగూడి ధర్మంబున వృద్ధినొందిరి." బ్రహ్మ ప్రాణులను ద్వంద్వములుగా బుట్టించెనని చెప్పబడియున్నది. మార్కండేయ పురాణము, 44వ అధ్యాయములో,—

శ్లో॥ బ్రహ్మణస్సృజతఃపూర్వంసత్యాభిధాయినస్తథా।
మిథునానాంసహస్రంతుముఖాత్సమభవన్మునే॥
జాతా స్తేహ్యుపపద్యన్తేసత్త్వోద్రిక్తాస్సుచేతసః।
సహస్రమన్యద్వక్షస్తోమిథునానాంససర్జహ॥
తేసర్వేరజసోద్రిక్తాశ్శుష్మిణశ్చాప్యమర్షిణః।
ససర్జాన్యత్సహస్రంతుద్వంద్వానాంమరుతాంపునః॥
రజస్తమోభ్యాముద్రిక్తాఈహాశీలాస్తుతేస్మృతాః।
పద్భ్యాంసహస్రమన్యచ్చమిథునానాంససర్జహ॥
ఉద్రిక్తాస్తమసాసర్వేనిశ్శ్రీకాహ్యల్పచేతసః।
తతస్సంహృష్యమాణాస్తేద్వంద్వోత్పన్నాస్తుప్రాణినః॥

దీని ముఖ్యార్థము: "ప్రథమమున బ్రహ్మ ముఖమువలన వేయిమంది దంపతులును, వక్షస్థలమునుండి వేఱొక వేయి మిథునములును, ఊరువులనుండి యొండొక సహస్ర మిథునములును, పాదములనుండి మఱియొక వేయి దంపతులును బుట్టిరి. ఇట్లు ప్రాణులు ద్వంద్వము అనగా స్త్రీ పురుషులుగా నుత్పత్తియాయెను."

ఇవ్విధముగా, చతుర్ముఖ బ్రహ్మ సంతానార్థమయి స్త్రీ పురుషులను సృష్ట్యాదియందే సృజియించెనని చెప్పియున్నది.

ఇదియుగాక, స్వాయంభువ మనువు కృతయుగ ధర్మములను దెలుపుటకయి మనుస్మృతిని రచించెను. మనుస్మృతి, 9వ అధ్యాయము,—

శ్లో॥ ప్రజానార్థం స్త్రియఃసృష్టాస్సంతానార్థంచమానవాః॥33॥

అర్థము: "స్త్రీలు గర్భము ధరించుటకును, పురుషులు గర్భము గలుగజేయుటకును బ్రహ్మ వలన సృష్టింపబడిరి." స్కాంద పురాణము, కాళికా ఖండము, కాంచీ క్షేత్ర మాహాత్మ్యము, 39వ అధ్యాయమున,—

శ్లో॥ మైథునేనజగత్స్రష్టుం స్త్రీసృష్టింకరవాణ్యహమ్॥18॥

అర్థము: "మైథునముచేత ప్రపంచమును సృజించుటకయి స్త్రీ సృష్టిని నేను చేయుచున్నాను" అని బ్రహ్మ సెలవిచ్చినట్లు వక్కాణింపుచున్నాడు. ఆ సిద్ధాంతము లన్నియు యట్లుండ నియ్యుడి.

హిందువులలో కొందఱు తఱచుగ మఱియొక శంక జేయుచుందురు. యేసు క్రీస్తు యోని సంభవుడా? అయోని సంభవుడా? యోని సంభవుడయినట్టయిన పరిశుద్ధు డెట్లు కాగలడు? శుకుడు, అగస్త్యుడు, వసిష్ఠుడు మొదలగు మహా ఋషులు అయోని సంభవులు; వారు మాత్రమే నిత్య పరిశుద్ధులుగా నుండవగుదురు. యోని సంభవు లట్లుండజాలరని పట్టిన పట్టు విడువక వాదింతురు. ఇట్టి పిచ్చి తర్కములు తఱచుగ జేయుచుందురు.

సోదరులారా! ఈ విషయము కూడ కొంత యాలోచించి చూతము.

"శరీరం ద్వివిధం యోని జమ యోని జంచ" అని తర్క సంగ్రహమున జెప్పబడియున్నది. శరీరము యోని సంభవమని, అయోని సంభవమని రెండు విధములని దాని యర్థము. అయోని సంభవ శబ్దమున కర్థమేమి? పుట్టు నప్పుడు మావి వలన బుట్టనివారు. ఒకడు తన పుట్టుకకు పురుష బీజము కారణముగానుండినను, అతడు స్త్రీ గర్భమునుండి వెలువడక ఏదో యొక జడ పదార్థమునందు గాని స్థావరమునందుగాని పుట్టిన పక్షమున, అతడ యోని సంభవుడని పేర్కొనబడును. ఈ శబ్దార్థము బ్రౌణ్య నిఘంటులో నిట్లు వ్రాయబడియున్నది. "అ

యోనిజుడు లేక అయోని సంభవుడు అనగా గర్భమునుండి పుట్టక స్వభావమున
కంటె విరుద్ధమయిన విధమున జన్మించినవాడు, మనిషి కడుపున పుట్టని వాడు."

వసిష్ఠుడు, అగస్త్యుడు, శుకుడు, కౌశికుడు, కృపుడు, ద్రోణుడు మొదలగు
వారయోని సంభవులని భారతాది గ్రంథములయందు వ్రాయబడియున్నది. వా
రయోని సంభవులుగ బుట్టుటకు సాధ్యమగునా? అయినచో వారు నిత్య పరిశుద్ధులే
నా? వారివలన లోకమునకు కలిగిన మేలేమి గలదు? అను విషయములను గొంత
యాలోచించి తెలిసికొనుట యుక్తమయిన సంగతి. ఎందుకనిన, సందేహము
తోగూడిన యభిప్రాయముగలవాడు తన యభిప్రాయానుసారముగా శాస్త్రాదికము
ను స్మరించినను ప్రయోజనము కలుగనేరదని బోధాయనుడు చెప్పుచున్నాడు.
కాబట్టి సోదరులారా! మాది మా పూర్వులు చేసినదన్న దురభిమానమును విడిచి య
సత్యము మన దయినను తెలియగానే త్యజించుచు సత్యము పరుల దయినను భజిం
చుచుండవలెను.

ముందుగ పైని నుదాహరింపబడిన ఋషులు పుట్టిన విధమును సంగ్రహముగ
నాలోచించి చూతము. పూర్వ కాలమందు మన దేశపు ఋషు లరణ్యములలో
తపస్సు చేసికొనుచుండి నపుడు రంభాదియప్సరస లా ఋష్యాశ్రమములను మెల్లగ
జేరి కామ విలాసములు చూపు తఱి యా ఋషుల మనస్సులు వికలము జెంది వారి
రేతస్సు ధర్మ మొదలగు వానిమీద పతనమయి యందుండి పుట్టిన వారినే కదా
అయోని సంభవులని మనము పురాణములందు జదువుచున్నాము? అవును. వసి
ష్ఠాగస్త్యుల పుట్టుక వినుడి. మిత్రావరుణు లొక తఱి తపము సలుపుచుండ నవ్వ
నంబున నూర్వశి పువ్వుల గోయ నేతెంచిన మిత్రావరుణులు దానిని గాంచి మోహ
పరవశులయియుండ కృష్ణాజినంబున వారి వీర్యము స్రవించెను. అంత నా వీర్య
ము నొక కడవయందుంచిన నందుండి వసిష్ఠును అగస్త్యుడును జనించిరని మత్స్య పు
రాణమునందు వ్రాయబడియున్నది. అసలు వీరి పుట్టుకలకు శాపములు గలవు.
ఎట్లనిన, ఒక సమయమందు నింద్రుడు అగ్నిని నీవు నేను చెప్పిన చొప్పున జేయ
వైతివి కావున నీవు భూమిని కుంభమందు బుట్టుదువని శపించెను. ఒకప్పుడు ని
మివసిష్ఠులు తిట్టులాడుకొని యొండొరులు శపించుకొనిరి. అంతట వసిష్ఠుడు ని
మి శాపమున మిత్రావరుణుల వీర్యముగ కుంభమునుండి జనించెను. పిదప నందుం
డియే యింద్ర శాపంబున నగ్నియగస్త్యుడుగ బుట్టెను. ఈ గాథలు కూడ మ
త్స్య పురాణములోనివే. అగస్త్యుని పుట్టుక కొన్ని పురాణములలో నింక కొన్ని

విధములుగా జెప్పబడి యున్నది. అవియెట్లనగా, ఒకప్పుడు బ్రహ్మ తిలోత్తమ యను అప్సరసను సృష్టించి దాని రూపమును గని మోహించి నప్పుడది దేవేంద్రుని కోటలో చేరగా ద్వారపాలకులు కోట కవాటములను బంధించిరి. అంతట బ్రహ్మయొక్క బిందువు స్ఖలితమయి పడగా నందు నగస్త్యుడు పుట్టెనని మఱియొక గాథకలదు. మఱియు, „శివుడు తపో ధర్మమును చూపుటకై కుంభయోనియందు అగస్త్యుడు పుట్టెను; వసిష్ఠునికి అన్నయైన ముని అగస్త్యుడని ప్రసిద్ధిచెందెను'' ని స్కాంద పురాణము, కావేరిమాహాత్మ్యము, 6వ అధ్యాయము నందు జెప్పియున్నది. పై వాక్యములకు ఖండనగా, అగస్త్యుడు యోని సంభవుడే యని మఱికొందఱు వ్రాసిరి. ఇందుకు నిదర్శనము భాగవతము, 4వ స్కంధము, 1వ అధ్యాయము:—

శ్లో॥ పులస్త్యోజనయిత్పత్న్యామగస్త్యంచహవిర్భుజి।
సోన్యజన్మనిదహ్రాగ్ని ర్విశ్రవాశ్చమహాతపాః॥36॥

„హవిర్భుక్కను పత్నియందు బులస్త్యుండను బ్రహ్మర్షి అగస్త్యుని గనెను; అతడు జన్మాంతరమున జఠరాగ్ని రూపంబున ప్రభవించెను.'' ఈ ఋషి అగ్నియా? శివుడా? లేక, అయోనిసంభవుడా? యోనిసంభవుడా? అని సందేహము పుట్టుచున్నది. వసిష్ఠుకుకూడ యోనిసంభవుడే యని కొన్ని పురాణములు చాటుచున్నవి. శ్లో॥ గణికాగర్భ సంభూతో వసిష్ఠస్స మహామునిః॥ అని భారతారణ్య పర్వమున జెప్పబడియున్నది. „వసిష్ఠుడు వేశ్యకు (ఊర్వశికి) బుట్టిన వాడని'' పయిదాని కర్థము.

శుకుని పుట్టుక: ఒక సమయమందు వ్యాసుడు తన యాశ్రమమున తపస్సాచరించుచుండ నచ్చటికి ఘృతాచియను దేవభోగముది వచ్చి కామోద్రేకము పుట్టించు పనులు పెక్కులు సేయ మొదలుపెట్టినపుడా మునియు వసంతయు కనిపెట్టి యజ్ఞముచేసికొనుటకు అరణిని (మథించు కట్టె) మథించుచుండగా నతని వీర్యము స్రవించి యా యరణియందు పడెను. అందుండి శుకుడు పుట్టెనని దేవీభాగవతమునందు జెప్పియున్నది. ఈ ఋషి చిలుక గర్భమున బుట్టెనని కొన్ని పురాణములు చెప్పుచున్నవి. గాధి రాజువకు దర్భయందు కౌశికుండును, భరద్వాజ మునికి ద్రోణ (కఱ్ఱతో జేసిన కుండ) ఘుండను ద్రోణాచా

ర్యలును గలిగిరి. గౌతము మునికి శరస్తంభమున (జెల్లు) కృపుడు కృపియు గలిగిరని భారతమునందు వ్రాయబడియున్నది.

అదియుగాక, బ్రహ్మ కొంతమంది ఋషులను మానస పుత్రులనుగా బుట్టించినట్టు పురాణములయందు వ్రాయబడియున్నది. మనస్సునందు సంకల్ప మాత్రముచేత బుట్టించిన ఋషులకు బ్రహ్మ మానస పుత్రులని పేరిడెను. వీరును అయోనిసంభవు లనబడుదురు. ఎట్లనిన, యోనిసంభవోన భవతీ త్యయోనిసంభవః, తస్య బహువచ మయోనిసంభవాః. గర్భమందు బుట్టని వాడు గనుక అయోని సంభవుడు. దాని బహువచనము అయోని సంభవులు. కావున మానసపుత్రులు గూడ మఱియొక విధముగ అయోని సంభవులే. సనక, సనంన, సనాతన, సనత్కుమార, ఋభువులను వీరు బ్రహ్మ మానస పుత్రులు. వీదరుగాక, పదిమంది గలరు. భృగువు, మరీచి, అత్రి, అంగిరసు, పులహుడు, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, పులస్త్యుడు, నారదుడు అనువారు. వీరును శాపములుబొంది వేఱు విధముగ బుట్టినట్టును గొన్ని గాధలు కలవు. ఇందుకు నిదర్శనముగా,—"తొల్లి సప్తర్షులు శివుని శాపంబుచే దనువుల విడిచి మఱల జనించిరి. అదెట్లనిన, మున్ను బ్రహ్మ అశ్వమేధ క్రతువు నొనర్చుతతి దేవపత్నును దేవ మాతలను వీక్షించుటచే నా బ్రహ్మకు రేతస్సు స్రవించి ధరణింబడెల. వుఅంత నా వీర్యమును నగ్నియందు హోమంబుజేయ నా యగ్నినుండి భృగు, అంగిరస్సు, అత్రి, మరీచి, పులస్త్యుడు, పులహుడు, వసిష్ఠుడు జనించిరి" ని మత్స్య పురాణములో 194వ అధ్యాయమునందు జెప్పబడియున్నది.

అదియుఁగాక, వారిలో అనేకులు యోని సంభవులుగా బుట్టిరని కూడ పురాణములు బోధింపుచునే యున్నవి ఇందుకు నిదర్శనముగా, భవిష్యోత్తర పురాణమునందు,—

శ్లో॥ ఊర్వశీగర్భసంభూతో వసిష్ఠస్సమహాముని:।
తపసా బ్రాహ్మణో జాత స్తస్మాజ్జాతిర కారణమ్॥
శుకస్యగర్భసంభూతశ్శుక యోగీమహాముని:।
తపసా బ్రాహ్మణో జాత స్తస్మాజ్జాతిర కారణమ్

రజకీగర్భసంభూతో నారదస్సుమహామునిః।
తపసా బ్రాహ్మణో జాత స్తస్మాజ్జాతిరకారణమ్॥

అని ప్రతిపాదింపఁబడియున్నది.

అదియుఁగాక, సనకసనందనాదులు ఈ ఋషులు బ్రహ్మ మానస పుత్రులనియు, ఋషి శ్రేష్ఠులనియు, మహావైరాగ్య సంపన్నులనియు బహుగా ప్రశంసింతురు. ఎప్పటికిని ఐదు సంవత్సరములు వయస్సుగలవారట. వీరు లెక్కకు ఐదుగురు. ,,సనక, సనందన, సనాతన, సనత్కుమార, ఋభువులను ఐదుగురు బ్రహ్మచే సృజింపఁబడిరనియు, బ్రహ్మతో సమానమయిన ద్విజులనియు స్కాందపురాణ శివమాహాత్మ్య ఖండమున వ్రాయఁబడియున్నది. శివుని దైదుగురు పుత్రు లీదైదుగురు ఋషులుగా బుట్టిరని మఱొక గాధకలదు. ,,బ్రహ్మ తన లోకమును పొంది సృష్టి కొఱకు శివుని భార్యను స్మరించినతోడనే గణేశుఁడు సనకుఁడను పేరితోను, వీరభద్రుఁడు సనందనుఁడను నామముతోను గలిగిరి. పిమ్మట సనాతనుడను పేరితో నందికేశుడు కలిగెను. సనత్కుమారుడను కుమారస్వామి పుట్టెను. పిమ్మట సనత్సుజాతుడను పేరితో మహాకాలుడు పుట్టెను. ఇట్లు ఆ దేవత లయిదుగురు శివస్వరూపులు, శివుని యాజ్ఞచేత అయిదేండ్ల యీడుగల బ్రహ్మ మానస పుత్రులుగా బుట్టిరి'' ని బ్రహ్మవైవర్త పురాణము; కేదార ఖండము, ౬౩వ అధ్యాయమున నున్నది. అందు సనకుడు యోని సంభవుడుగా జన్మించినట్లును చెప్పబడెను. ఆ పయియధ్యాయమునందే,—

శ్లో॥ కశిపోఃపుత్రభావేన ప్రహ్లాదిస్సనకస్త్వభూత్॥
సనకాద్యా అపిపునశ్శివాంశా బ్రహ్మసూనవః।
హిరణ్యస్యాపికశిపోఃపుత్రో భూత్సనకఃపునః॥

,,సనకుడు ప్రహ్లాదుడను పేరిచే హిరణ్యకశిపునకు కుమారుడుగా బుట్టెను. సనకాదులును శివాంశవలననే బ్రహ్మ పుత్రులయిరి. హిరణ్యకశిపుని కొడుకుగా మఱల సనకుడాయెను'' అని వక్కాణింపబడియున్నది. ఇందును బట్టి చూడగా, బ్రహ్మ మానస పుత్రులలో జ్యేష్ఠుడు (సనకుడు) యోనిజుడుగా బుట్టినట్లు తెలియబడుచున్నది. ఒకప్పుడు సనత్కుమారుడు విష్ణు శాపముచే పార్వతీ పరమేశ్వరులకు కుమారస్వామిగా బుట్టెనని వసిష్ఠ రామాయణము

నందు వ్రాయబడియున్నది. ఈ సనత్కుమారుడే విష్ణుని యవతారమని భాగవత ప్రథమ ద్వితీయ స్కంధములయందు వ్రాయబడియున్నది. ఈ విషయము లన్నియు విచారింపగా నిందు కాల వైపరీత్యమును అసంభవమును సంభవించినవి.

ఈ పుట్టుకలు విపరీతములును, అసంభవములును, అవాచ్యములునై యున్నవి. వీరినేనా మన వారయోని సంభవులని చెప్పుదురు! మహా పరిశుద్ధ జన్మము లందురు!

సోదరులారా! పయిని నుదాహరింపబడిన యయోని సంభవుల పుట్టుకల విషయమై యెట్టి మందునకైనను సందేహము పుట్టక మానదు. పురుష బీజము అరణి పర్భ మొదలగు నిర్జీవ పదార్థముల మీద పతనమగుటవలన శిశువులు కలుగుదురనుట సాధ్యమగునా? సాధ్యమగు ననుట నగుబాటే. శుక్లశోణితములు రెండు మిశ్రమమయిన యెడల శిశువేర్పడును. అట్లు కాని యెడల శిశువేర్పాటు కానేరదు. అట్లేర్పడిన దేహి నవమాసములు తల్లిగర్భస్థుడై తల్లి పుచ్చుకొను పదార్థములవలన వృద్ధిపొందవలెను. పిమ్మట నవమాసములు నిండిన వెనుక స్త్రీ ప్రసూతి ద్వారమున బహిర్గతుడగును. ఇది ప్రపంచ ధర్మము. ఉపనిషత్తుల యందు,—"ఏతత్తాట్కౌశికంశరీరం త్రీణిపితృతస్త్రీణిమాతృతః। అస్థిస్నాయుమజ్జానఃపితృతః। ఏవంత్వఙ్మాంసరుధిరాణిమాతృతః॥" అని యున్నది. "ఆరు కోశములు గల యీ శరీరము మూడు తండ్రి సంబంధమైన కోశములు కలది. మూడు తల్లి సంబంధమైన కోశములు కలది. తండ్రి సంబంధమైనవి యెముకలు, నరములు, మూలుగునై యున్నవి. అట్లే చర్మము, మాంసము, నెత్తురు అను మూడును తల్లి సంబంధములై యున్నవి." అని దాని యర్థము. ఈ ప్రమాణము చొప్పున తల్లియొక్క గర్భసుడుకాని వానికి చర్మము, మాంసము, నెత్తురు ఎక్కడనుండి కలుగును? ఇదియుగాక, గర్భోపనిషత్తునందు—

"సప్తమే మాసెజీవ సంయుక్తోభవత్యష్టమేమాసె సర్వసంపూర్ణోభవతినవమేపీవతే", అనియు, "తస్మైన దేహినోధనవమే మాసే సర్వ లక్షణ సంపూర్ణో భవతి" అనియును జెప్పియున్నది.

"ఏడవ మాసమందు జీవముతో గూడిన వాడగును. ఎనిమిదవ మాసమందు అన్నిటితో పూర్తిగలవాడగును. ఆ దేహముగలవానికే తొమ్మిదవ

మాసమునందు అన్ని లక్షణములు పూర్తియై యుండునని వాని భావము. ప యి వానిని బట్టి తల్లి గర్భమందు నవమాసములున్న వానికే అన్ని లక్షణములు చక్కగా ఏర్పడును గాని తదితరునికి కలుగ వనే కదా.

అదియుగాక, హిందూశాస్త్రములందు భర్త, భార్య గర్భమందు ప్రవేశించి పుత్రరూపుడై పుట్టునను సిద్ధాంతము ప్రబలమై యున్నది "జాయతేస్యాం పతిఃపుత్రరూపేణేతిజాయా" అనగా, "ఈమె యందు పతి పుత్ర రూపమున జనించెను గనుక భార్యకు జాయా అను పేరు కలిగెను. బహ్వృచ బ్రాహ్మణము:- శ్రు॥ పతిర్జాయాంప్రవిశతిగర్భో భూత్వేహమాతరం। తస్యాంపునర్నవో భూత్వా దశమేమాసిజాయతే। తజ్జాయాజాయాభవతియదస్యాంజాయతేపునః॥ "పతిగర్భ రూపుడై భార్యయందు ప్రవేశించుచున్నాడు. దాని యందు నూతనుడై పదియవ మాసమందు బుట్టుచున్నాడు. ఏ హేతువుచే దానియందు తాను జాతుడగుచున్నాడో ఆ హేతువువలన జాయకు జాయత్వముకలిగెను." ఈ లాగుననే మనుస్మృతి 9వ అధ్యాయము 8వ శ్లోకములో వ్రాసియున్నది.

పూర్వోదాహృతమైన అయోని సంభవుల పుట్టుక లట్లు సంభవమగుననుట లోక స్వభావమునకు బలవద్విరోధము.

ఇదియుగాక, స్త్రీలేనివాడు పుత్రసంతుడు కానేరడని వేదములు బోధింపుచున్నవి. వాజసనేయ బ్రాహ్మణమునందు,—

> శ్రు॥ అర్ధోహవాఏషఆత్మనస్తస్మాద్యజ్జాయాంనవిందతే।
> నైతావత్ప్రజాయతేఅసర్వోహితావద్భవతి।
> అథయదైవజాయాంవిందతేఽథప్రజాయతేతర్హిసర్వోభ
> వతి॥

"ఈ పురుషుడు తనలో సగము భార్య గావున భార్య నెవడొందడో వాడు సంతానవంతుడు కాలేడు. కావున పూర్ణుడుకాడు. ఎప్పుడు భార్యను అర్ధ శరీరముగా గైకొనునో యప్పుడు సంతానమును గనును. అప్పుడు పూర్ణుడగుచున్నాడు." అని బోధింపబడియున్నది.

ఇదియుగాక, ఋషులు మహాత్మ్యముగలవారు గనుక వారి తపో మహిమచేత నాలాగు పుట్టింపగలరని కొందఱందురేమో. అట్లు పుట్టించుటకు ఋషుల

లేరనుట కాదు. మహా భారతము, ఆది పర్వము, 74వ అధ్యాయములో,—

శ్లో॥ ఆత్మనో జన్మనః క్షేత్రం పుణ్యం రామాః సనాతనమ్।
ఋషీణామపి కా శక్తిః స్రష్టుం రామామృతే ప్రజామ్॥53॥

,,ఆత్మయొక్క జన్మకు సనాతనమైన పుణ్యక్షేత్రము స్త్రీలు. ఋషీశ్వరులకును ప్రజలను కలిగించుటకు స్త్రీ లేనిది శక్తి యెక్కడిది? (శక్తి లేదు)'' అని శకుంతల వక్కాణింపుచున్నది. దేవీభాగవతము, షష్ఠమ స్కంధము, లక్ష్మీ శివసంవాదమునందు,—

లక్ష్మీః॥ పతిసఙ్గం వినా పుత్రం దేవ దేన లభే కథమ్।
స తు తిష్ఠతి వైకుంఠే త్యక్త్వా దీనామనాగసమ్॥

,,పతితో గూడనిది పుత్రుని ఎట్లు పొందెదను? అతడు (విష్ణువు) విశేషముగా దీనురాలనైన నన్నువదలి వైకుంఠమందున్నాడు'' అని లక్ష్మి యుద్ఘోషింపుచున్నది. కాబట్టియే,—

శ్లో॥ సర్వే వై యోనిజా మర్త్యాః సర్వే మూత్రపురీషిణః।
ఏకేంద్రియేంద్రియార్థశ్చ తస్మాచ్ఛీలగుణైర్ద్విజః॥

అనగా, ,,నరులందఱును గర్భమునుండి పుట్టినవారు; అందఱును మూత్ర పురీషములు గలవారు; ఏకవిధమైన యింద్రియములను వాని ప్రయోజనములను గలవారు; కాబట్టి సదాచార సద్గుణములచేత ద్విజుడగునని'' స్పష్టముగా భారతారణ్య పర్వమున ధర్మరాజును గుఱించి వైశంపాయనుడు బోధించియున్నాడు.

ఋషులు మాత్రమేకాదు, దేవతలు కూడ అయోని సంభవు లనబడుదురు. వీరికి దివ్యోప పాదులని పేరియ్యబడెను. ఈ శబ్దమున కర్థమేమనగా, ,,స్వర్గమందుండు వారు దివ్యులు, తల్లి మొదలయిన వారు లేక అయోనిజులై పుట్టువారు ఉపపాదుకులు, దివ్యులయిన ఉపపాదుకులు, దివ్యోపపాదుకులు'' (గురుబాల ప్రబోధిక). ఆదితేయాః, ఆదితినందనాః, ఆదిత్యాః అని వారికి పెట్టబడిన యితర నామముల వలన వారికి తల్లియున్నట్టు స్పష్టము. ఆ నామములకు ,,అదితి దేవిపుత్రులని యర్థము. వీరు కస్యపునకు అదితి దేవియందు బుట్టిన

పుత్రులని సర్వపురాణ ప్రసిద్ధము. ఇందుకు ఋజువుగా, పద్మపురాణము, ఉత్తరఖండము, 86 అధ్యాయము,—

శ్లో॥ మరీచిర్భగవాం స్తత్రజనయామాసకశ్యపమ్।
కశ్యపశ్యాభవన్ భార్యాశ్చతస్రశ్శుభదర్శనాః॥
అదితశ్చదితి శ్చైవకద్రూశ్చవినతాతథా।
అదితిర్జనయామాసదేవతాశ్శుభదర్శనాః॥

"వారిలో మరీచికి కశ్యపు డుదయించెను. ఆ కశ్యపునకు అదితి, దితి, కద్రువ, వినత యనంగా నలువురు భార్య లేర్పడిరి. అందు అదితికి దేవత లుదయించిరి." ఈలాగుననే స్కాందపురాణము, నాగరఖండము, 7వ అధ్యాయమున వ్రాయబడియున్నది.

అదియుగాక, త్రిమూర్తులు కూడ అయోని సంభవులే. అదియెట్లనిన, బ్రహ్మాండ పురాణము—శ్లో॥ సర్వేశ్వరస్యవిష్ణోశ్చనాభికమలసంభవః। రజోగుణ స్తత్ప్రసాదాత్సృష్టికర్తాఽచచతుర్ముఖః। చతుర్ముఖాద్భమనామాలోకసంహారకృద్దరః। జాతొవిష్ణోర్నియోగాచ్చతదాత్మాతామసప్రియః॥ "సర్వేశ్వరుడైన విష్ణుమూర్తియొక్క నాభికమలమునుండి రజోగుణము పుట్టినది. ఆ రజోగుణము నుండి జగత్సృష్టికర్తయైన బ్రహ్మ పుట్టెను. విష్ణుమూర్తి ఆజ్ఞవలన చతుర్ముఖ బ్రహ్మచే తమోగుణప్రధానుడై భయంకరమైన లోక సంహారకుడైన రుద్రుడు పుట్టెను." స్కాందపురాణము కాంచీక్షేత్ర మాహాత్మ్యము,—శ్లో॥ దక్షిణాక్షుశ్చతుర్వక్త్రమసృజద్వామతోహరిం। మధ్యాన్మాహేశ్వరంసృష్టిస్థితిసంహారకారిణః॥ "లలితా దేవియొక్క కుడికంటివలన బ్రహ్మను, ఎడమ కంటివలన విష్ణువును, మధ్యకంటివలన మహేశ్వరుని సృష్టి స్థితి సంహారములకు సృజించెను." లింగపురాణము, పూ. భా 38 అధ్యాయములో,—విష్ణుః॥ అహంవామాఙ్గజో బ్రహ్మాచ్ఛ..రస్యమహాత్మనః। భవాన్భవస్యదేవస్యదక్షిణాఙ్గభవస్స్వయమ్॥ "బ్రహ్మయును, దేవుడైన శివునియొక్క దక్షిణాంగమునందు స్వయముగా బుట్టెను. నేను మహాత్ముడైన శివునియొక్క వామాంగమునందు పుట్టినవాడనని" విష్ణువు చెప్పుచున్నాడు. హరి వంశము, శివకృష్ణ సంవాదమునందు,—"శివః॥ కఇతి బ్రహ్మణోనామఈశోహంసర్వదేహినాం। ఆవాంతవాంగేసంభూతాతస్మాత్కేశవనామవాన్॥" "కః=బ్రహ్మ, ఈశః=నేను, మేమిద్దఱము నీ శరీరమున జ

నించితిమి. కావున నీవు కేశవనాముడవైతివి" అని శివుడు చెప్పుచున్నాడు. శివపురాణము, ఉత్తరఖండము,—శ్లో॥ ఆదిశక్తిమయంబీజం బీజశక్తిమయంశివః। శివశ్శక్తిమయంవిష్ణుస్సర్వంవిష్ణుమయంజగత్॥ "ఆదిశక్తికి నొక బీజము పుట్టెను. ఆ బీజమువలన శివుడు పుట్టెను. శివునివలన విష్ణువు పుట్టెను. లోకమంతయు విష్ణువునలన పుట్టెనని చెప్పుచున్నది మార్కండేయ పురాణములో ప్రాధానికరహస్యమునందు,—"మహా లక్ష్మినుండి బ్రహ్మ లక్ష్మియు, మహాకాళినుండి రుద్రుడు సరస్వతియు, మహా సరస్వతినుండి విష్ణువు పార్వతియును బుట్టిరి" అనియు స్కాందపురాణము, శివరహస్యఖండము, ఉపదేశకాండము, 74 అ॥ లో "ఒకప్పుడు శివుడు సర్వసంహారయాగ మొనర్చెను. ఆయాగ హోమకుండమున పునస్సృష్టి కొఱకు మూడండములను వడియందుంచుకొని యొకశక్తి పుట్టెను. ఆశక్తి యాయండములను బైటకు తీసి అవియింపగ, ఒకదానియందు బ్రహ్మయు, లక్ష్మియు, రెండవ యండమందు విష్ణువును, గౌరియును మూడవ యండమందు రుద్రుడును, సరస్వతియును గలిగిరి." అనియు గణేశపురాణమునందు—"వ్యాసులు చెప్పునదేమనగా, అన్నిటికిని గణేశుడే కారణుడు, అతని తొండమునుండి విష్ణు శివ బ్రహ్మ రవిశక్తి మొదలగువారలు జనించిరి" అనియు బ్రహ్మవైవర్త పురాణము, బ్రహ్మఖండము, 3వ అధ్యాయమునందు—శ్రీకృష్ణునివలన నారాయణుడు స్వయమావిర్భవించెను. ఆ కృష్ణువామపార్శ్వంబువలన పంచవక్త్రుండగు శివుడుద్భవించెను. ఆ కృష్ణుని నాభి పద్మమునుండి బ్రహ్మయుద్భవించెను. ఆ కృష్ణు ముఖమునుండి మహాసరస్వతియు, అతని మానసంబునుండి మహాలక్ష్మియు, అతని బుద్ధివలన మహాకాళియును, బుట్టిరి అనియు కనబడుచున్నది. సోదరులారా! ఇట్టి చరిత్రాంశములను బట్టి పురాణములన్నియు వ్యాసప్రోక్తములను మాట వ్యర్థమగుటయేకాక రచించిన కవులు పురాణములను జూడకయే రచించిరని తేలుచున్నది. ఎవరికి ఎవరు పుట్టినను పుట్టనిండు. అది ప్రకృతమున విచారింపవలసిన సంగతికాదు. అవి యొక దానికొకటి పొసగకపోయినను మొత్తమున వారందఱును అయోని సంభవులేకదా.

ఇప్పుడయోని సంభవులగు వారు పరిశుద్ధులా యను విషయమును కొంత విచారించి చూతము. ఇది మన కెట్లు తెలియును? ఈ ప్రశ్నకు ఉత్తరము,—శ్లో॥ కులీనమకులీనంవావీరంపురుషమానినమ్। చారిత్రమేవవ్యాఖ్యాతిశుచింవాయది వాఽశుచిమ్॥ అనగా, "ఒక పురుషుడు మంచి వంశమువాడో కాడో యనుట్లను,

శూరుడో బీరువో యనుటను, పరిశుద్ధుడో అపరిశుద్ధుడో యనుటను, అతని న డువడియే స్పష్టీకరించునని రామాయణమున వాల్మీకి మహర్షి ప్రతిపాదించుచు న్నాడు. "ప్రతి చెట్టు తన ఫలములవలన తెలియబడును; వారి ఫలములవలన మీరు వారిని తెలిసికొందురని యేసుక్రీస్తుకూడ సెలవిచ్చెను." కాబట్టి వారి వారి చారిత్రమును బట్టియే మనము తెలిసికొనగలము.

అగస్త్యుడు.—ఈ ఋషి గృహస్థుడు. ఈయన భార్య విదర్భ దేశపు రాజు కూతురు వేద విద్యతోపాటుగ నగస్త్య ముని ధనుర్వేదమును నేర్చి యిల్వలకాయులను నోడ దొంగల బరిమార్చెను. ఈయన నహుషుడు విశ్వకర్మ మొదలగు వారిని దారుణముగ శపించెను. ఈయనయు విశ్వకర్మచే శపియింపబడియెను. తన ప్రియ శిష్యుని (వింధ్యను) మోసపుచ్చి భూమిని అణచి పెట్టియుంచెను.

వసిష్ఠుడు.—ఈ ఋషియు సంసారియే. ఈయన భార్య అరుంధతి. తన కర్మార్తతచే స్వర్గమునకు బోనుద్దేశించిన త్రిశంక మహా రాజును ఛండాలు డవుదువుగాక యని వసిష్ఠుడు నిష్కారణముగా శపించెను. వసిష్ఠుడు బ్రహ్మ ఋషి. రాజర్షియగు విశ్వామిత్రుడు బ్రహ్మర్షి పదమున కాశించెను. దానికి వసిష్ఠు డంగీకరింపకపోవుటచేత వారల కిరువురకు కయ్యము ప్రబలమయ్యెను. ఒక వసిష్ఠ విశ్వామిత్రులు బకంబులగునట్లు ఒండొరులు దారుణముగ శపించుకొని యా రూపంబులందు పోట్లాడుకొనిరి.

సనక సనందనాదులు.—వీరు జితేంద్రియులట. బ్రహ్మతో సమానులట. ఈ దిగువ చరిత్రవలన వీ రెట్టివారో మీరే తెలిసికొందురు.

మహావిష్ణువు వైకుంఠమున నకుంఠిత లీలరాజ్య పరిపాలనము చేయుచుండెను. ఒకనాడు నిజాంతఃపుర మందిరమునందు లక్ష్మీదేవితోడ శేషశయ్యను వినోద గోష్ఠినుండి జయ విజయలను వారిని ద్వారముకడ నిలిపి యితరుల రానీయకుండగ కట్టడజేసియుండెను. అతని యాజ్ఞను శిరసావహించి జయ విజయులు ద్వారపాలకులై భృత్య ధర్మమును నెఱవేర్చుచుండిరి. అంతట, జితేంద్రియులట, సాత్విక గుణసంపన్నులట, సనక సనందనులను నిరువురు దివ్య పురుషులు ప్రభువు దర్శనమునకు వచ్చి ద్వారముకడనున్న భృత్యులను లక్ష్యము చేయక లోపలికి బోవుటకై ప్రయత్నపడగా, భృత్యులు పోవలనుపడదనిరి. అంతటి మహాత్ములు తాము వచ్చినప్పుడీ భృత్యులు తమ యెడ గౌర

వము లేక వారించినందులకు క్రోధమూర్తులై మర్త్యులై భూమియందు పుట్టుడని శపించిరి. తరువాత ప్రభువు తెలిసికొని భృత్యులం జూచి ,,మహర్షుల శాపములు మీకు దప్పవు. మీ రేడు తరములవఱకు మిత్రులుగానుండి తరువాత శత్రువులయిన రాక్షసులగుదురా? లేక మూడు తరములవఱకు రాక్షసులై శత్రువులుగానుండి తరువాత మిత్రులగుదురా? యని యడుగగా వారలు మొదట రాక్షస జన్మమేయెత్తెదమనిరట. దానికి ప్రభువుగారు సమ్మతించిరి. ఈ చరిత్ర భాగవతాది పురాణములన్నిటను కనుపించుచున్నది.

సోదరులారా! ఈ కథను బట్టి మనము నేర్చుకోవలసిన నీతి నిర్ణయములగుచున్నది. తమ భృత్యు ధర్మమును జక్కగ నెఱవేర్చుచున్న జయ విజయులను శపించుటవలన సనక సనందనాదులు మహర్షులు కారనియును, జితేంద్రియులు కారనియును, క్రూర స్వభావులనియును, వైకుంఠమున జేరుట కర్హులు కారనియును స్పష్టమగుచున్నది. సనక సనందనాదులు తన భృత్యులకు జేసిన యపకారమునకు రోషింపక వారల ననాదరించుటయు మీదు మిక్కిలి యా శిక్షలకు భృత్యులను బాత్రులనుగా జేయుటయు క్రూర ప్రభు లక్షణముగాని ధర్మ ప్రభువుయొక్క లక్షణముకాదు.

ఒకప్పుడు సనత్కుమారుడు కైలాస శిఖరమున యోగము సలుపుచుండగ నచ్చటికి శివుడు వేంచేసెను. ఆ ఋషి యా సంగతి కానకయుండినందున శివుడు తన గృహమునకు వెళ్లిపోయెను. పిమ్మట నందీశ్వరుడు, నీవు శివుని అగౌరవపరిచితివని యాగ్రహించి లొట్టిపిట్టయగునట్లు శపించెను. ఇట్లు శపింపబడి యొంటెయై సంచరించెనని స్కాందపురాణ కాశీకాఖండమందు వ్రాయబడియున్నది.

,,సనత్కుమారుడు బ్రహ్మలోకమున నుండెను. విష్ణువు వైకుంఠమునుండి యచటికేతెంచెను. అచట బ్రహ్మయును సత్యలోక నివాసులును విష్ణుని బూజించిరి. సనత్కుమారుడు మాత్రము పూజింపడయ్యెను. ప్రభుండగు హరి యతని జూచియిట్లనియె: సనత్కుమారుడా! నిష్కాముడవగుటకు గర్వించి కదలకను మెదలకనున్నావు. ఇందువలన, నీవు కుమారస్వామి నామంబున గామ పీడితుండవై వర్తిల్లుదువుగాక" అని శపించెను. ఇట్లు వసిష్ఠరామాయణమునందు ప్రథమ సర్గలో వ్రాసియున్నది.

శుకమహర్షి —ఈ ఋషి తన తండ్రితమ్ములలో మిగుల ఘంచివాడు. ఈ

యన పితరులు బ్రహ్మ, వసిష్ఠుడు, శక్తి, పరాశరుడు, వ్యాసుడునువారు. ఈ యన పితరు లందఱు బ్రహ్మర్షులే. ఈయన తన వంశములో మాత్రముగాక, యితర ఋషులలోను మిగుల దొడ్డవాఁడు. ఒకప్పుడు రంభ యీ ఋషిని బహు భంగుల భంగపఱుపవలెనని బహు ప్రయాసపడెను గాని తుదకదే మిగుల పరాభవము నొందిపోయెను. ఈ ఋషికి శపించుట యనగేమియో తెలియదు ఈయనకు గర్భయోగియను బిరుదు కలదు. ఈయన ఆద్యంతబ్రహ్మచారియని భాగవతమునందు జెప్పబడియున్నది. ఈ యోగి పరమ పదము పొందవలెనని సూర్య మండలములో జొచ్చిపోవుచున్న సమయమున సూర్యుడాఋషి కడ్డమై పోనియ్యక ఇట్లు సంభాషించెనట:—„ఓ యోగివర్యా! నీ వొక్క కులపతింగూడి క్రతువు లానరించి దేవ ఋణము తీర్పవలయును. అపల విజ్ఞాన వంతులైన సత్పుత్రులంబడసి పితృ ఋణము తీర్పవలయును. ఇట్లు విగత ఋణగ్రస్తుండవై బ్రహ్మజ్ఞానివై తదుపరినింగి కెగసి నామండలంబతిక్రమించి యావలి లోకంబులు గడిచి పరమ పదము జెందుము. పుణ్యవంతులైన పుత్రులంబడయక గాఢవైరాగ్యవంతుడవై పరంబుజెంద నిపుడుచితంబుగాదు గాన నీవు భూలోకమున కరిగియొక్క సత్పుత్రినింబడసి రాకంగాని, నా మండలంబుదాట సాధ్యంబుగాకుండు" నని పలికిన నవ్వియమ్మహా యోగీంద్రు డట్లుగాక యని తన దేహచ్ఛాయను సంకల్ప మాత్రంబున నొక పురుషుని పుట్టించెనట ఆ పురుషునికి ఛాయాశుకుండని పేరు. ఈ ఛాయాశుకుడు తన తండ్రి యనుజ్ఞ చేవ్యాసునియొద్ద నుండెను. పిమ్మట సూర్యుడు శుకుని మహిమల కత్యాశ్చర్యము నొంది యతని పోనిచ్చెనట. అటు పిమ్మట శుకుడు సూర్యమండల మతిక్రమించి పరమ పదము రూఢిగా చేరెనని యొకప్పు డొక శాస్త్రి నాతో విశేషముగా సంభాషించెను. ఈ కథ భవిష్యోత్తరపురాణమున శుకయోగి సూర్యసంవాదమునందు జెప్పబడియున్న మాట వాస్తవమే. కాని, యీ కథ నిజమేనా?

శుకునియొక్క నిర్వాణమును గురించియు, ఛాయాశుకుని పుట్టుకను గురించియు వేఱు విధముగ జెప్పియున్నది. ఎట్లనిన, శుకయోగి కైలాస శిఖరమునుండి యాకాశ మార్గమున సూర్యునివలె ప్రకాశించుచు పోయి బ్రహ్మ పదమును బొందెననియు పిమ్మట వ్యాసుడు తన పుత్రుని నిర్వాణమును విని కైలాస గిరి కరిగియందు బహుగా దుఃఖించుచుండెననియు నంత శివుడా మునికి ప్రత్యక్షమై బ్రహ్మ పదవి పొందిన పుత్రుని గూర్చి దుఃఖింపవలదని యెంత

బోధించినను వినక «నా దుఃఖము పోలేదు, నేనేమిచేతును, నా యొక్క క న్ను ఇప్పుడు కుమారుని చూడవలెనని» యని వ్యాసుడు ప్రత్యుత్తరమిచ్చెనట అంతట శివుడు «ప్రక్కగానుండు మనోహరమగు పుత్రునియొక్క నీడను (ఛాయాశుకుని) నీవు చూచెదవు, ఓ ముని శ్రేష్ఠుడా! దుఃఖము నశింపజేయుము» అని వ్యాసునికి వరమిచ్చి యంతర్ధానమాయెనని దేవీభాగవతము, ప్రథమస్కంధము 19వ అధ్యాయమునందు జెప్పబడియున్నది. భారత శాంతి పర్వములో ధర్మరాజాదులతో శుక నిర్యాణము చెప్పబడినది. భాగవతమునందు ధర్మరాజునకు మనుమడగు పరిక్షిత్తునకు భాగవతోపదేశమును శుకుడు బోధించునట్లున్నది. తొల్త కాలమున ముక్తిని పొందిన శుకమహర్షి మనుమని కాలము న నెట్లు కలిగిరి? ముక్తినుండి పునరాగమనము సయితము పురాణరీత్యా విరుద్ధమగుచున్నది. ఈ శంకా రాహిత్య మెట్లు? ఈ శుకుని ముక్తి విషయమై కూడ సందేహమే. ఎట్లనిన, ఈయన మిథ్యాద్వైతియని కొందఱును, శూన్యాద్వైతి (అచలమతస్థుడు) యని మఱి కొందఱును, విశిష్టాద్వైతి యని యింకను కొందఱును చెప్పుదురు. ఈయన భాగవతమతస్థుడనియు, బ్రహ్మసూత్రములకు ఆ మత పక్షముగా భాష్యము వ్రాసెననియు కొందఱు చెప్పుదురు. ఈయన పడసిన ముక్తి వారిలో ఎవరి మత సాంప్రదాయము?

ఇదియుకాక, ఈ యోగి నిత్య బ్రహ్మచారికాడు. గృహస్థుడేయని కొన్ని పురాణములు చాటుట మానలేదు. ఈ ఋషి భార్యపేరు పీవరి. ఈమెయందు కీర్తియను కన్యను, కృష్ణ, గౌర, ప్రభు, భూరిదేవ అను నలువురు పుత్రులను బడసెనని (దేవీభాగవతము, ప్రథమ స్కం. 19అ. 41-42శ్లో; మత్స్యపు. 15: 9-10 శ్లో.). చెప్పియున్నది. ఈ రెండు పురాణములందు సంతానముయొక్క పేరులలో కొద్ది భేదము మాత్రమున్నది.

«పురుషుడు పరస్త్రీ గమనము మనస్సునసైన దలపగూడదు» (మానవ ధర్మ చంద్రిక 5 అ; మార్కండేయ పురాణము 18.) యేసు ప్రభువు, మోహబుద్ధితో పరస్త్రీని దృష్టించినవాడు హృదయమందు ఆమెతో వ్యభిచరించినట్టే యని బోధించియున్నాడు. పరస్త్రీ గమనము మనోవాక్కాయ కర్మల చేత నిషేధింపవలెననుట సర్వమతసమ్మతము. ఇది యట్లుండగ, అయోనిసంభవుల జన్మరీతిని విచారింపుడు. తమ పితరులు జితేంద్రియులయి ఘృతాచి మొదలగు అప్సరసలను దృష్టించి నప్పుడు పతనమయిన బీజమువలన బుట్టిన పు

త్రులు పవిత్రులగుట యెట్లు? అసంభవమే. అదియుగాక, „ఆత్మావై పుత్ర నామాసి,” „క్షేత్రంమాతాపితాబీజం,” „యథాబీజం తథాంకురం” అను శ్రుతి స్మృతులవలన తండ్రులే పుత్రులై జన్మించెదరని తెలియుచున్నది. కావున అయోనిజులయందు గూడ పితృ దోషము, జన్మ దోషములేకుండునా? లేదనిన, ఆ సిద్ధాంతమే తప్పగును. మాలో శిష్యకులవలె యేసుక్రీస్తు కూడ మంచి వాడును, పరమ యోగియునై యుండవచ్చునని కొందఱు కొందఱు సామ్యము తెచ్చుచుందురు. ఆ యంత మాత్రము సరికానేకాదు. శుకుడు గృహస్థుడు. యేసుక్రీస్తు అద్యంత బ్రహ్మచారి అద్యంత పరిశుద్ధుడు. అది మాత్రమే కాక, ఆయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోత్రార్హుడై యున్నాడు (రోమా 9: 5).

బ్రహ్మ మానస పుత్రుల పరిశుద్ధతను గూర్చి విచారించి చూతము.

శ్లో॥ భ్రమత్యస్మిన్మహాగాధేసంసారేనృపసత్తమ।
వసిష్ఠనారదాద్యాశ్చమునయోజ్ఞానినఃపరమ్॥
తేభిభూతాస్సంసరన్తిసంసారేస్మిన్పునఃపునః।
నకోప్యస్యస్తినృపశ్రేష్ఠత్రిషులోకేషుదేహభృత్॥

„ఓరాజేంద్రుడా! ఈ గొప్ప అగాధమగు సంసారమందు నరుడు తిరుగుచున్నాడు. వసిష్ఠుడు, నారదుడు మొదలగు మునులు విశేషముగా జ్ఞానులయినను వారును ఈ సంసారమందు అభిమానముగలవారలై తిరుగుచున్నారు. దేహధారులలో ఒకడును మూడు లోకములయందు జ్ఞానియొకడైనను లేడు”. అని దేవీభాగవతము, 4వ స్కంధము, 7వ అధ్యాయమందు ప్రతిపాదింపబడియున్నది. దేవీభాగవతము, షష్ఠమ స్కంధము, 16వ అధ్యాయములో,—

శ్లో॥ మునయోబ్రహ్మపుత్రాశ్చతథాన్యేతాపసోత్తమాః।
తేపిగుణత్రయావిద్ధాఃకింపునర్మానవాభువి॥

అని యున్నది.

అర్థము: „మునులు, బ్రహ్మ పుత్రులును, అట్లే తపస్సుచేత శ్రేష్ఠులయిన వారును గుణత్రయముచేత (సత్త్వరజస్తమోగుణములు) గ్రుచ్చబడినవారు. ఇక భూమిలో మనుష్యులనెంత!” బ్రహ్మాండ పురాణములో శ్రీరంగ మహాత్మ్యమందు 7వ అధ్యాయమున,—

శ్లో॥ కామక్రోధవశాస్సర్వే దేవర్షి పితృమానవాః॥

„సమస్త దేవతలు, ఋషులు, పితృ దేవతలు, మానవులు కామక్రోధము లుగలవారు" అని వక్కాణింపబడియున్నది. అది యట్లుండనిమ్ము.

ఋషి శబ్దమునకు జ్ఞాని యని యర్థము. „జ్ఞానస్య పారగమాత్ ఋషిః" (లింగాభట్టీయము, పుట 195). జ్ఞానముయొక్క పారమును బొందిన వాడు ఋషియని యర్థము. మన దేశపు ఋషులు ఋషి శబ్దార్థమును ధరించుట కర్హులు కారుకదా. వారు దైవతత్త్వమును జక్కగ దెలిసికొని యనుభవించి దానిని మనకు దెలియజేయ సమర్థులును కాకపోయిరి. ఇందుకు నిదర్శనములు ఆదిత్య పురాణము, ప్రథమాధ్యాయము,—

శ్లో॥ తత్త్వంవిచారయామాసుర్మిథోయత్రమహర్షయః।
అశక్తాస్తేమహాభాగభృగ్వాద్యాస్తత్త్వనిర్ణయే॥

„మహర్షులు ఉన్నదోలేదో అను తత్త్వమును గూర్చి విచారించిరి; కాని, భృగువులోనగు మహానుభావులు తత్త్వమును నిర్ణయింపలేక పోయిరి." మహాభారతము, శాంతి పర్వము 210వ అధ్యాయము,—

శ్లో॥ అనాద్యంతంపరంబ్రహ్మనదేవానర్షయోవిదుః॥

„ఆద్యంతములు లేని పరబ్రహ్మమును దేవతలును ఋషులును తెలిసికొనలేరైరి."

యేసుక్రీస్తు నిజమయిన ఋషి. దేవఋషి. ఆయన పరతత్త్వమును సంపూర్ణముగా తెలిసినవాడు. ఆయనే పరతత్త్వము కూడ నయినవాడు. „నీలోనుండి ఇశ్రాయేలును ఏలువాడొకడు నా కొఱకు లేచును. అతని బైలు వెళ్లుటలు ఆది నుండియు గతించిన యుగములనుండియు కలిగియుండెను." (మీకా 5: 1.) „నేనును తండ్రియు నేకమైయున్నామని వారితో చెప్పెను" (యోహా 10: 30.) „నాయందు విశ్వాసముంచువాడు నాయందు కాదు, నన్ను పంపిన వానియందే విశ్వాసముంచుచున్నాడు. నన్ను చూచువాడు నన్ను పంపిన వానినే చూచుచున్నాడు" (యోహాను 12: 44, 45). (యోహాను 1: 1–3, 14; 1యోహాను 5: 20) వాక్యములను జదివి చూడుము. క్రీస్తు యేసు నందు దేవుడత్యాశ్చర్యముగను, అత్యున్నతముగను బయలు పడియు

న్నాడు. యేసుక్రీస్తువతారమునందు అదృశ్యుడగు దేవుడు ప్రత్యక్షుడును, అరూపియగు దేవుడు స్వరూపియునైయున్నాడు. ఇవ్విధముగ మానవులముగు మనము సత్యక్రుపాదులతోడను నిబిడీకృతమై యుండు దేవమహిమను దృష్టించుచున్నాము. మనము దేవునియొక్క సులక్షణములను ఆయన మన యెడల కలిగియుండు గుణాతిశయములను తెలిసికొనగోరిన, యేసు ప్రభువును దృష్టించి, ఆయనను ఆసక్తిగల పారాయణము చేయవలెను. ఆయన దేవుని యొక్క పరిపూర్ణమగు రాయభారియు, బయలు పఱుచువాడునైయున్నాడు. ఇందుకు సాక్ష్యముగ „నన్ను చూచినవాడు తండ్రిని చూచియున్నాడు" అని ఆయనే వాక్రుచ్చియున్నాడు. ఆయనయొక్క పాపరహితమగు ప్రవర్తనవలన, సుబోధనవలన, క్రియాతిశయమువలన ఈశ్వర హృదయము మనుష్యాకృతిజెంది మనకు ప్రత్యక్షమగుచున్నది. ఋషుల సంగతి యట్లుండనిమ్ము.

దేవతలు, యోనిజులనియు, అయోనిజులనియు రెండు తెగలు గలరు. ఒకవేళను, వారందఱయోనిసంభవులని యనుకొనినను, వారైనను పరిశుద్ధులయి యుందురా? ఈయంశమునకు మేముత్తరము చెప్పబూనుటకంటె హిందూ గ్రంథములలోని ఋషుల యభిప్రాయముల నిందుబొందుపఱుచుట యుక్తమని యెంచి యట్లు చేయుచున్నాము.

శ్రు॥ శ్రీగౌతమవివాహకాలేతామహల్యాందృష్ట్వాసర్వే।
దేవాఃకామాతురాఅభవంతతదానష్టజ్ఞానా॥
దూర్వాససంగత్వాప్రపచ్ఛుస్తద్దోషం
శమయిష్యామీత్యువాచ॥

„గౌతముల వారి వివాహకాలమందు దేవతలందఱు అహల్యను జూచి మన్మథోద్రేకముకలవారైరి. అప్పుడు జ్ఞానహీనులై దూర్వాసుని దగ్గఱకు వెళ్లి ఉపశమనమును అడిగిరి. ఆ దోషమును శమియింపజేతునని ఆయన పలికెను" అని బృహజ్జాలోపనిషత్తులోని 6వ బ్రాహ్మణములో జెప్పియున్నది. బ్రహ్మాండపురాణము, లలితోపాఖ్యానము, 15వ అధ్యాయములో, —

మన్మథః॥ వసిష్ఠోవశీనాంశ్రేష్ఠోదేవేమేచణ్డాలకన్యయా।
చన్ద్రోగురుకళత్రస్యనిశ్శజ్కో౽భూత్పురాగ్రహే॥

మాధవో గోపనారీషు జారవృత్తిర్మయాకృతః।
గౌతమస్య ప్రియాఽహల్యా వాసవేనోపధర్షితా॥
దణ్డకో నామ భూపాలో మునికన్యాం సమగ్రహీత్।
సూర్యోమదీయ బాణాన్ధో బడబాం రోహణం వ్యధాత్॥
ప్రజాపతిర్జగద్ధాతా స్వసుతామేవ భుక్తవాన్॥

"యోగులలో నుత్తముడయిన వసిష్ఠుడు చండాల కన్యతో రమించెను. చంద్రుడు గురు భార్యను పరిగ్రహించుట యందు సందేహము లేనివాడయ్యెను. కృష్ణుడు గోపికా స్త్రీలయందు వ్యభిచరించునట్లు నాచేతనే చేయబడినవాడాయెను. గౌతము ముని భార్యయగు అహల్య ఇంద్రునిచేత రమింపబడెను. దండకుడను రాజు మునికన్యను పరిగ్రహించెను. సూర్యుడు నా బాణముల చేత కన్ను తెలియక బడబానలమును పొందెను. జగత్తునకు ధాతగా నేర్పడిన బ్రహ్మదేవుడు తన కుమార్తెనే యనుభవించెను" అని మన్మథుడు వక్కాణించుచున్నాడు.

దేవీభాగవతము, ప్రథమస్కంధము, 14వ అధ్యాయములో,—

వ్యాసః॥ విశ్వామిత్రో మహాభాగ తపః కృత్వాతి దుశ్చరమ్।
త్రీణి వర్ష సహస్రాణి నిరాహారో జితేన్ద్రియః॥
మోహితశ్చ మహాతేజా వనే మేనకయా స్థితః।
శకున్తలా సముత్పన్నా పుత్రీ తద్వీర్యజా శుభా॥
దృష్ట్వా దాశసుతాం తాలీం పితా మమ పరాశరః।
కామబాణార్దితః కన్యాం తాం జగ్రాహోడుపే స్థితః॥
బ్రహ్మాపి స్వసుతాం దృష్ట్వా పంచబాణ ప్రపీడితః।
ధావమానశ్చ రుద్రేణ మూర్ఛితశ్చ నివారితః॥

"ఓ మహానుభావుడా! విశ్వామిత్రుడు ఇతరులు చేయ నశక్యమగు తపస్సు చేసి మూడు వేల సంవత్సరములు ఆహారమును భుజింపక యింద్రియనిగ్రహము కలవాడయినను మేనకను గని మోహించి దానితో వనమందుండెను. అతని వీర్యమునకు శోభాయుక్తురాలగు శకుంతల యను కుమార్తె పుట్టెను. నా తండ్రి

యగు పరాశరుడు దాశ కూతురగు తాలి యను దానిని చూచి మన్మథప్రేరితుడై సంగడియందుండిన ఆ కన్యను పట్టుకొనెను. బ్రహ్మయును తన కూతురిని చూచి మన్మథోద్రేకముకలవాడై పరుగెత్తుచున్నవాడగుచు మూఢాత్మవసను జెందియుండగా రుద్రునివలన నివారింపబడినవాడాయెను" అని వ్యాసుడు పలుకుచున్నాడు. ఆగ్నేయ పురాణము, తులాకావేరీమాహాత్మ్యము, 2(వ అధ్యాయము.

శ్లో॥ సౌభరిశ్చమహాయోగీమాంధాతృదుహితుర్వశీ।
ఉద్వాహ్యస్మరబాణార్తొభోగీజాతఇతిశ్రుతం॥
గౌతమోప్యంబుధౌమగ్నో వశీవర్షసహస్రకం।
అహల్యార్థేమహాతేజాఃపశ్చాద్రేమేతయాసహ॥
పరాశరోపియోగీంద్రస్సాక్షాదంశోహరేర్మునిః।
కైవర్తకన్యాంకామార్తస్స్వయమేవగ్రహీజ్జలే॥
కిమత్రబహునోక్తేనస్వష్ట్వాబ్రహ్మతిలోత్తమాం।
స్వయంసమారేభేకామోవీక్ష్యాహాసచ్ఛ్రుతం॥

"వశి (జితేంద్రియుడు) యైన సౌభరిమహాయోగిమాంధాతయొక్క కూతురిని పెండ్లాడి మన్మథ పీడితుడైన భోగమును అనుభవించిన వాడాయెనని వింటిమి. ఇంద్రియనిగ్రహముగల (వశి) గౌతముడు వేయి సంవత్సరములు అహల్యకొఱకు సముద్రమధ్యమందుండి తపస్సుచేసి పిమ్మట ఆమెతో భోగించెను. పరాశరుడను యోగీంద్రుడు విష్ణువుయొక్క అంశగల ఋషి పల్లెదానిని కామార్తుడయి నీటియందు గ్రహించెను. వేయి మాటలేల! బ్రహ్మదేవుడు తిలోత్తమను సృజించి అతడు దానిని చూచి కాముడైతానే భోగింప నారంభించెను." దేవీభాగవతము, చతుర్థస్కంధము, 13వ అధ్యాయము,—

శ్లో॥ హరిర్బ్రహ్మాశచీకాన్తస్తథాన్యేసురసత్తమాః॥
సర్వేచ్ఛలవిధౌదక్షామనుష్యాణాఞ్చకాకథా॥
కామక్రోధాభిసంతప్తాలోభోపహతచేతసః।
ఛవేదక్షాస్సురాస్సర్వేమునయశ్చతపోధనాః॥

వసిష్ఠో వామదేవశ్చ విశ్వామిత్రో గురుస్తథా।
ఏతే పాపరతాః కాత్ర గతిర్ధర్మస్య మానద॥
ఇన్ద్రోఽగ్నిశ్చన్ద్రమా వేధాః పరదారాభిలమ్పటాః।
ఆర్యత్వం భువనేష్వేషు స్థితం కుత్రము సేవద॥
వచనం కస్య మన్తవ్యముపదేశధియా నఘ।
సర్వే లోభాభిభూతాస్తే దేవాశ్చ మునయస్తదా॥

"హరి, బ్రహ్మ, ఇంద్రుడు, ఇంకను ఇతర దేవతలు వీరందఱు ఛలవిధి యందు శక్తివంతులు. మనుష్యులయొక్క ప్రసంగమేమున్నది? (అనగా మనుష్యులనెంతవారు) యక్షులు, దేవతలందఱు, తపోధనులయిన మునులు కామ క్రోధములచే బాధపడువారు. వసిష్ఠుడు. వామదేవుడు, విశ్వామిత్రుడు, బృహస్పతి వీరందఱు పాపము చేయుటయందాసక్తిగలవారు. ఇట్టి విషయములో మర్యాదనిచ్చువాడా! ధర్మమునకు గతియేది? ఇంద్రుడు, అగ్ని, చంద్రుడు, బ్రహ్మదేవుడు వీరు ఇతరుల భార్యలను పొందినవారు. మర్యాదగల నీవు ఈ భువనములయందెచ్చట ఉనికి చేసికొనియుంటివి? చెప్పుమా? ఎవని మాట ఆలోచింపదగినది? ఊహించి బోధించుము దేవతలును మునులును అందఱును లోభులుగా నేయున్నారు."

శ్లో॥ బ్రహ్మావిష్ణుగిరీశాదయస్సురా యేపి సిద్ధమునయః పురాతనః।
తేపి యోగబలినోపి మోహితా లీల
యా తదబలాభిర [illegible] తమ్॥

ఛల, స్ఖలిల శబ్దములు యుద్ధమందు మర్యాద తప్పుట. స్ఖలిత మర్యాద నుండి చలించుట ఛలము=కార్యమును తెలుచునది.

"పూర్వ కాలమువారైన బ్రహ్మ విష్ణు మహేశ్వరుడు ఇతరులయిన దేవతలు యోగ సిద్ధిని పొందిన మునులు మొదలగు వారనేకులు యోగ బలముగల వారై యుండియు స్త్రీల విలాసచేష్టలచే మోహింపబడినవారైరి. ఇది ఆశ్చర్యము" అని ఘోషింపబడియున్నది. ఇది యిట్లుండనిమ్ము.

దేవాదులు పాపముచేసినను నిందార్హులుకారని కొందలు వాదింతురు. అదెంత మాత్రమును యుక్తియుక్తమయిన వాదముకాదు. ఋషులు పాపము చేసినను, దేవతలు పాపముచేసినను, మఱి యెవరు పాపముచేసినను పాపము పాపమేయయియున్నది. అట్లుకాదనుట గొప్పతప్పు. ఎట్లనిన, ఒక పిల్లవాడు తప్పుచేసినయెడల వాడు నిందింపబడును. ఒక సాధారణుడు తప్పుచేసినట్లయిన ఎక్కువనిందకు పాత్రుడగును. ఒకరాజు తప్పుచేసిన పక్షమున అందువలన కీడు సంభవించునుగాన అతడు మఱింత యెక్కువ నిందార్హుడగును. శ్రీలార్థమై దేవతలు పాపము చేసిరని చెప్పుట మిక్కిలి ఘోరమయిన సంగతియై యున్నది.

ఒకప్పుడొకశాస్త్రి మనలో పాపమయినది మహాత్ములలోను తేజోవంతులలోను పాపముకానేకాదని యీ దిగువ ప్రమాణములను చదివి వినిపించెను:—

ఆపస్తంబః॥ దృష్టోధర్మవ్యతిక్రమస్సాహసంచపూర్వేషాం తేషాం తేజోవిశేషేణప్రత్యవాయోనవిద్యతే॥
తదనువీక్ష్యప్రయుంజానస్సీదత్యవరః॥
యద్యేషీకాతూలమగ్నౌప్రోతందూయతేతథా
పాప్మానఃప్రదూయంతే॥

మనుః॥ ధర్మవ్యతిక్రమోదృష్టోమహతాంసాహసంతథా।
తదన్వీక్ష్యప్రయుంజానస్సంసీదత్యవరోఽబలః॥
తేజోమయానిపూర్వేషాంశరీరాణీంద్రియానిచ।
దోషైస్తేనోపలిప్యంతెపద్మపత్రమివాంభసా॥

"ధర్మమును దాటుటయును సాహసమును పూర్వులయందును జూడబడెను. వారియొక్క తేజో విశేషమువలన దోషములేదు. దానిని జూచి యిప్పటి వారటులాచరించిన నశింతురు. ఎటుల రెల్లును దూదియును ఏలాగు అగ్నివలన దహింపబడునో ఆలాగుననే మహాత్ముల పాపమును దహింపబడును (ఆపస్తంబులు) "గొప్పవారియందును ధర్మాతిక్రమము కనబడుచున్నది. దానిని చూచి శ్రేష్ఠుడుకాని బలహీనుడును అలాగేచేయుచు దుఃఖమును నను,

భవించుచున్నాడు. పూర్వుల శరీరములును ఇంద్రియములును తేజోమయ ములు గనుక తామరాకునందు నీరు అంటని విధమున దోషములు వారికంటవు" (మనువు)

భాతృవరులారా! పయి వాక్యములను బట్టి విచారించినను మహాత్ములు ధర్మము నతిక్రమించి పాపము చేసినట్టు విస్పష్టమేకదా. పామరులట్లు చేయుచు దుఃఖమనుభవించుచు నశించుచున్నారని కూడ తేలుచున్నది. మహాత్ముల నడతలను జూచి నేర్చికొని పామరులు బాగుపడుటకు బదులుగా వారినవి నాశనమునకే హేతువైయున్నవి. అట్టి మహాత్ముల దుష్కార్యములవలన ఏమి ప్రయోజనము? ఆ కార్యములవలన పామరులకు కీడు సంభవించుటచేత ఆ తేజో వంతులు మిక్కిలి నిందార్హులగుదురు. ఎట్లనిన,—

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః।
సయత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే॥

"శ్రేష్ఠులు ఏమి చేతురో దానినే యితరులు కూడ చేయుదురు. వారి నడవడిని జూచి లోకము వారివలెనే ప్రవర్తించును" అని కృష్ణుడు భగద్గీత లలో తృతీయాధ్యాయమునందు జెప్పుచున్నాడు. భాగవతములోనున్న దానిని విచారించిన యెడల కృష్ణుని నడవడియే అతని భక్తులకు చాలకీడు కలుగజేయు నదిగాయున్నది. మహాత్ములు సహితము దోషములు చేయుచున్నారని పామ రులును పాప దోషములు చేసి తత్కర్మ ఫలబద్ధులై చెడుచున్నారుగాన, "లోక సంగ్రహమేవాపిసంపశ్యంకర్తుమర్హసి" అను గీతావచనానుసారముగా మహా త్ములును తేజోవంతులును లోక సంగ్రహణార్థమైనను పరదారాగమనాది పాప కృత్యములను జేయరాదు.

ఇదియుకాక, ధర్మము ధరించుటవలననే మహాత్ములనబడుదురు. ధర్మ ము నతిక్రమించినవారు మహాత్ములెట్లుకాగలరు? ధర్మ శబ్దార్థమును వినుడు. మ త్స్య పురాణము 144వ అధ్యాయమున,—

శ్లో॥ ధర్మేతిధారణేధాతుర్మాహాత్మ్యేచైవఉచ్యతే।
ఆధారణేమహాత్వేవాధర్మస్సతునిరుచ్యతే॥

"ధారణమను అర్థమందు ధర్మమనునది వర్తించును. దానినే మహత్త్వమందును చెప్పబడును. విశేష ధారణమందుగాని మహత్త్వమందుగాని ధర్మశబ్దము నిరుక్తము చేయబడెన"ని చెప్పియున్నది. ధర్మమును ధరించినవారే ధర్మాత్ములును మహాత్ములును అని చెప్పబడుదురు.

శ్లో॥ నపరదారాంగచ్ఛేత్।
నాప్సుమూత్రంపురీషంకుర్యాత్।
ననిష్ఠీవేత్ నోచేన్నరకంవ్రజేత్॥

"పరస్త్రీతో పోగూడదు, జలములలో మూత్రపురీషములు విడువగూడదు, ఉమ్మివేయగూడదు, లేకున్న నరకమునబడును" బ్రాహ్మధర్మము, ద్వితీయఖండములో,—

శ్లో॥ విరక్తపరదారేషునిస్పృహాఃపరవస్తుషు।
దంబమాత్సర్యహీనోయస్తేనలోకత్రయంజితమ్॥

"ఎవడు పరస్త్రీలయందిచ్ఛలేనివాడో పరుల పదార్థములయందలి యపేక్షలేనివాడో గర్వమత్సరరహితుడో వానిచే మూడు లోకములును జయింపబడునని" చెప్పియున్నది. స్కాందపురాణము, ముక్తి ఖండము, 6వ అధ్యాయములో,—

శ్లో॥ కామఃక్రోధశ్చలోభశ్చమోహోహ్యాధంభస్తథైవచ।
ఆలస్యమపిమాత్సర్యంజ్ఞానానుత్పత్తికారణమ్॥
పరస్త్రీదర్శనాశ్రద్ధాపరస్త్రీగమనేరతిః।
పరస్త్రీగమనంచాపిజ్ఞానానుత్పత్తికారణమ్॥

"కామము, క్రోధము, లోభము, మోహము, దంభము, మాత్సర్యాది గుణములు గలిగియుండుట జ్ఞానములేకపోవుటకు హేతువైనది. ఇతర స్త్రీలను చూచుటయందాసక్తియు, ఇతర స్త్రీల బొందనాసక్తికలిగియుండుటయు, ఇతరుల స్త్రీలను బొందుటయును జ్ఞానములేకపోవుటకు హేతువైనవి." అనియున్నది.

సోదరులారా! పరస్త్రీలయందపేక్ష లేనివారే మహాత్ములు ధర్మమును మూలబెట్టి పరదారాగమనాదికములగు దుర్వృత్తులపాలబడిన వారు మహాత్ములును తేజోవంతులును నెట్లుకాగలరు? ఇవన్నియు నట్లుండనిమ్ము. మహాత్ములు పాపములుచేసినప్పటికిని తామరాకునందు నీరు అంటని విధమున దోషములు వారి కంటవని చెప్పుదురు. ఒకప్పుడొక పండితుడు,—

గీ॥ సర్వభక్షకుడగ్ని సర్వంబు భక్షించి।
దోషికానిపగిదిదోషమైన।
జేసిదోషపథముజెందరు తేజస్వు।
లగుటచంద్రవాసవాదులనఘ॥

అని భాగవత ప్రమాణమునుజూపి, సమర్థులగు దేవతలు ఆ కార్యకరణమునకు జొచ్చినను దోషులు కారని వాదించెను ఈ వాదము సమస్త పురాణేతిహాసములకు విరుద్ధమైయున్నది.

పరస్త్రీని బొందువాడు పాపముతప్పక పొందును. అందుకు విరుద్ధముగా బలుక సాహసించెడు ధీమంతుల మాటలు వట్టికల్ల. దేవతలు సహితము పరస్త్రీ గమనముచేసి బహుదుఃఖముల ననుభవించిరి. పరస్త్రీని మోహించినందున పంక్తిముఖుడు పుత్రబంధు సహితముగ నాశనమొందెను. పరస్త్రీ మీద గన్నువేసినందున చతుర్ముఖుడు తలబోగొట్టుకొనెను. పరస్త్రీని మోహవీక్షణములతో వీక్షించినందున గుబేరుడు కన్నుచెడగొట్టుకొనెను. పరస్త్రీని కామించినందున సుందోపసుందులు నాశనమొందిరి. పరస్త్రీని మోహించినందున హుషుడు పదభ్రష్టుడై క్రిందబడి కొండచిలువయైనాడు. పరాంగనతో బొందినందున జంద్రుడు క్షయరోగ పీడితుడాయెను. పరస్త్రీని మోహించినందున వాని ప్రాణములబోగొట్టుకొనెను. ఎంతో శ్రమపడి నూఱు యజ్ఞములు జేసి స్వర్గాధిపత్యమునుబొందిన యింద్రుడు మునిపత్ని మీది మోహమునేత నక్రమమునకు జొచ్చి దేహమును జెడగొట్టుకొనెను. ‚‚అధర్మప్రభవంచైవ దుఃఖయోగంశరీరిణామ్’’ అనగా, ‚‚శరీరముగల జీవులకు అధర్మమువలన దుఃఖమనుభవింపవలసియున్నది!’’ అను మనువచనానుసారముగా, తేజోవంతులును ధర్మము వ్యతిక్రమించినపుడు తత్ఫలమనుభవించిరి.

ఇందుకు శాస్త్ర నిదర్శనము:—

స్కాందపురాణము, రుద్రకోటి మహాత్మ్యము, 4వ అధ్యాయమునందు,—

మార్కండేయః॥ కస్యవాకీర్ధృశంకష్టంనభవేద్భృతవర్ష్మణః।
ఇంద్రోనారాయణోబ్రహ్మాప్యన్యభూయఅతిక్షయమ్॥
తేపిదోషాదుపహతాఃపదభ్రష్టావిచేతనాః।
కాలేనమహతాచైతేపాపాత్ స్థానంప్రపేదిరే॥

“శరీరము గలవానికెవనికి గష్టములేదు? ఇంద్రుడు నారాయణుడును బ్రహ్మయును దోషముపొందిన వారలై మిక్కిలి సంకటము ననుభవించి స్థాన భ్రష్టులై తెలివిలేనివారలై యుండి బహుకాలమునకు శాపమువదలి తమస్థానము బొందిరి” అని మార్కండేయుడు వచించెను.

వ్యాసః॥ సర్వేషాంసుఖదాదేవాప్రత్యక్షౌశశిభాస్కరౌ।
ననశ్యతితయోఃపీడాశ్చచిత్తజాతిసమ్భవా॥
భాస్కరస్యసుతోమన్దఃక్షయీచన్ద్రఃకలఙ్కవాన్।
పశ్యరాజన్నథేస్వాత్రందుర్వ్యాతంమహతామపి॥
వేదకర్తాజగద్ధర్తాబ్రుద్ధదస్తుచతుర్ముఖః।
సోపివిక్లవతాంప్రాప్తోద్రుష్ట్వాపుత్రీంసరస్వతీమ్॥
శివస్యాపిమృతాభార్యాసతీదగ్ధ్వాకళేబరమ్।
సోభవద్దుఃఖసంతప్తోకామార్తశ్చజనార్తిహా॥
కామాగ్నిదగ్ధదేహాస్తుకాళిన్ద్యాంపతితశ్శవః।
సాపిశ్యామజజాతాతన్నిదాఘవసాన్నృప॥
కామార్తోరమమాణస్తునగ్నసోపిభృగోర్వనమ్।
గతఃప్రాప్తోథభృగుణాశప్తఃకామాతురోభృశమ్॥
పతత్వాద్వ్యైవలిఙ్గంనిర్లజ్జోతిభృశంకిల।
పపౌచామృతవాపీఞ్చదానవైర్నిర్మితాంముదే॥
ఇంద్రోపిచవృషోభూత్వావాహనత్వంగతఃక్షితౌ॥

అని దేవీభాగవతము, చతుర్థస్కంధము, 20వ అధ్యాయమందు "అంద ఱకును సుఖమిచ్చువారలకు ప్రత్యక్షులైన సూర్యచంద్రులు తమకు శత్రువుల వలన కలుగు బాధను నశింపు చేసికొనలేరైరి. సూర్యుని కొడుకగు శనిక్షయ రోగముకలవాడాయెను. చంద్రుడు డాగుకలవాడాయెను. ఓరాజా! విధి సూత్రమును జూడుము మహాత్ములకును (గొప్ప వారికిని) నివారింపతరముకాదు. బ్రహ్మదేవుడు వేదములనుజేసినవాడును జగత్తును ధరించినవాడును బుద్ధిని నిచ్చు వాడునయియున్నాడు. అతడట్టివాడయినప్పటికి కూతురైన సరస్వతిని జూచి మోహింపబడినవాడయ్యెను. శివుడును చచ్చిన భార్యయొక్క శరీరమును వహించి దుఃఖించెను. అతడు జనముల దుఃఖముల హరించువాడైనను కామా ర్తుడై దుఃఖముచే దహింపబడినవాడయ్యెను. శివుడు మోహాగ్నిచే దహింప బడి కాళిందియందుపడెను. అప్పుడు గ్రీష్మర్తువగుటచేత ఆనదీజలము నల్లబ డెను.) ఇతడు భృగువుయొక్క వనమందు దిగంబరియై మిక్కిలి కామార్తుడై అచ్చటికిపోయి భృగువువలన శపింపబడెను. ఇప్పుడే నీలింగము పడిపోవు గాక, నీవు మిక్కిలి సిగ్గులేనివాడవుకదా. (ఇంద్రుడు) దానవులచేత నిర్మింప బడిన అమృతముగలనూతిని సంతోషముచేత త్రాగివేసెను. ఇంద్రుడు వాహన రూపముగా భూమియందు ఎద్దాయెను" అని వాసుడు వక్కాణించెను. దేవీ భాగవతము, చతుర్థస్కంధము, 2వ అధ్యాయము,—

శ్లో॥ కర్మణాభ్రమ తేసూర్యశ్శశాంకఃక్షయరోగవాన్।
కపాలీచతథారుద్రఃకర్మణైవనసంశయః

"సూర్యుడు కర్మచేత తిరుగుచున్నాడు. చంద్రుడు క్షయరోగము కలవాడాయెను. కర్మవలననే శివుడు కపాల ఆయెను. ఇందుకు సందియము లేదు." ఈ స్కంధములోనే, 15వ అ. ము.

శ్లో॥ నిస్పృహాఃకోపిసంసారేనభవేనభవిష్యతి।
శశినాధగురోర్భార్యాహృతాజ్ఞాత్వాబలాదపి॥
గౌతమస్యతథేన్ద్రేణజానతాధర్మనిశ్చయమ్।
గురుణానుజభార్యాచభుక్త్వాగర్భవతీబలాత్॥
శప్తోగర్భగతోమూలఃకృతాశ్చాన్ధస్తథాపునః।

"సంసారమందు ఇచ్ఛలేనివాడు ఎవడు, ఇదివఱకులేడు, ఇకముందును ఉండబోడు. చంద్రుడు తెలిసియు గురుభార్యను బలముచేత గ్రహించెను. ధర్మనిశ్చయమును ఎఱిగియు ఇంద్రునిచేత గౌతముని భార్య గ్రహింపబడెను. బృహస్పతి అన్న భార్యను (గర్భవతిని) కలిసెను పిల్లవాడు శపింపబడి గ్రుడ్డివాడుగా జేయబడెను. రాహువుయొక్క శిరస్సు విష్ణుచక్రము చేత నరకబడెను. ఓపార్వతీ! అపరాధములేని కామము సత్వముతో సమానమేయగును. (దైకృత్యములు అపరాధముతో గూడినవే)." ఈ స్కాంధములోనే, 2వ అధ్యాయమునందు,—

శ్లో॥ కర్తుమిచ్ఛేచ్ఛకోమూఢశ్శ్రమదంసుఖనాశనమ్।
సర్వదైవన్నృపశ్రేష్ఠసర్వే బ్రహ్మాదయస్సురాః॥
కృతకర్మవిపాకేనప్రాప్నువంతిసుఖాసుఖే।
అవశ్యమేవభోక్తవ్యంసర్వదాదుష్కృతంకిల॥

"శ్రమను కలిగించునదియు సుఖమును బోగొట్టునదియునగు దానిని ఏ మూఢుడు చేయనిశ్చయించును! ఓ రాజశ్రేష్ఠుడా! అన్ని విధములచేతను బ్రహ్మ మొదలగు దేవతలందఱు తాము చేసిన కర్మ ఫలముల వెంబడి సుఖదుఃఖములను పొందెదరు. దుష్కృతము ఎల్లప్పుడును అవశ్యముగా అనుభవింపక తప్పదుకదా." అని ప్రతిపాదింపబడియున్నది.

ఇదియుగాక, మహాత్ములు దుష్కృతములు చేసినప్పుడవి దుష్కృతములని తామే యొప్పుకొనిరి. ఇందుకు నిదర్శనములు:—

స్కాందపురాణములోని రుద్రకోటి మాహాత్మ్యము, 7వ అధ్యాయములో,

శ్లో॥ తతోవిష్ణుస్సమాగత్యప్రణమ్యమునిపుంగవమ్।
ప్రమాదాద్ద్రోహమారబ్ధంక్షమస్వేత్యభియాచితః॥

"అంత విష్ణువు వచ్చి భృగుమహర్షికి నమస్కరించి యేమో పొరబాటుచేత మీకు ద్రోహముచేసితిని, క్షమింపవలయునని ప్రార్థించెను" అని చెప్పియున్నది.

అంతట భృగుమహర్షి చెప్పినది వినుడి:—

శ్లో॥ అశేషజగదాధారకరుణాకరమాధవ।
తవాపిమతిరుత్పన్నా పాతకేత్వదృశేహారే॥
కంవాకానర్థాదయోదోషానభాధేరంచ్ఛరీరణమ్।
త్వాదృశోపియతఃపాత్రామీదృశామేనసామభూత్॥

„ఎల్ల జగత్తులకు ఆధారమైనవాడా! లక్ష్మీనాథుడా! నీకు గూడ అట్టి పాపకార్యమందు బుద్ధికలిగెను గదా. నీవంటివాడు గూడ ఇట్టి మహాపాతకము చేయుటకు పాలుపడగా ఇక సాధారణుడైన మనుష్యుడెవడు కామక్రోధాది దోషములకు లోబడకుండును?''

ఒకప్పుడు శివుడు బ్రహ్మ శిరస్సును ఖండించినందున తనకు బ్రహ్మహత్య దోషమురాగా, శివుడు నారదునితో అనిన మాటలు వినుడి:—

శ్లో॥ అహామస్మ్యపరాధానమాలయోకిఞ్చనోగతిః।
త్వమేవోపాయభూతోమేభవేతిప్రార్థనామతిః॥
శరణాగతిరిత్యుక్తస్సదేవోస్మిన్ప్రయుజ్యతామ్॥

„నేను అపరాధములకు ఉనికి పట్టును. గతిలేదు. నీవే నాకు ఉపాయభూతుడవుకమ్మ అని ప్రార్థనాబుద్ధికలవాడనైతిని. నీవే శరణము. ఈ విషయమందు కరుణింపవలయును'' అని విష్వక్సేను సంహితలో, రుద్రనారద సంవాదమందు వ్రాయబడియున్నది. బ్రహ్మ తన దోషము నొప్పుకొనెను. స్కాందపు, పక్షి తీర్థమాహాత్మ్యము, 8వ అ. నందు,—

శ్లో॥ ఇతితద్వచనంశ్రుత్వాప్రజాపతిరథాబ్రవీత్।
అజ్ఞానాదవమానేనసావిత్రీకుపితాగతా॥
అథనారాయణఃపుత్రమ్వినింద్యమతివర్జితమ్॥

„ఇట్లు విష్ణుని మాట విని బ్రహ్మవిష్ణుని జూచి 'నేనజ్ఞానము చేత సావిత్రి నవమానించితిని, అందుకు సావిత్రి కోపించి నన్ను విడిచి పోయెను' అని చెప్పెను. అంత నారాయణుండు బుద్ధి భ్రంశము నొందిన తన కొడుకైన బ్రహ్మనునిందించెన''ని చెప్పియున్నది. ఒకప్పు డింద్రుడు తన పాపమునకై యిట్లు విలపించెను:—

శ్లో॥ లీనః ప్రక్షీణవిభవః మలినో దుర్మనాయన్స్మరన్।
అవసత్సహరిస్తత్రగుహామధ్యేపిసంస్థితః॥

"ఇట్లింద్రుడు తన వైభవమునంతయు గోలుపోయి మలినుండై తాను చేసిన పాపమును తలంచుచు ఆ గుహాలోపల బడియుండెన"ని యీ పయి మాహాత్మ్యమున నే చెప్పబడెను.

మహాత్ములును తేజోవంతులును తామొనర్చిన దుష్కృతములను దుష్కృతములని యొప్పుకొనినట్టును, వాని విషయమై నిందబొందినట్టును పురాణాది గ్రంథములయందు కన్పట్టుచున్నది. ఋషులు కూడ వానిని పురాణపీఠికల యందు వ్రాసి పెట్టి యుంచిరి. దేవీభాగవతము, షష్ఠమస్కంధము, 10వ అధ్యాయములో,—

శ్లో॥ పాపంకరోతిమనుజస్తథాదేవాదయోపిచ।
తథానారాయణోరాజన్నరశ్చధర్మజావుభౌ॥
జాతౌకృష్ణార్జునౌకామమంశౌనారాయణస్యసౌ।
పురాణపీఠికేయంస్మైమునిభిఃపరికీర్తితా॥

"ఓరాజా! మనుష్యుడు పాపముచేయుచున్నాడు. అట్లే దేవాదులును పాపముచేయుచున్నారు. ధర్ముని పుత్రులగు నారాయణుడు నరుడు అను ఋషులును అట్లే పాపముచేయుచున్నారు. వారు నారాయణుని అంశవలన కృష్ణార్జునులుగా పుట్టిరి. ఇది మునులవలన జెప్పబడిన పురాణపీఠికయందున్న ద"ని వ్యాసమహర్షి చెప్పుచున్నాడు.

దోషము చేసినవాడు దోషిగానే యెన్నబడునని వేదము కూడ ఘోషింపుచున్నది.

శ్రు॥ యథాచారీతథాభవతిసాధుకారీసాధుర్భవతిపాపకారీ
పాపోభవతిపుణ్యఃపుణ్యేనకర్మణాభవతిపాపఃపాపేన॥

అని బృహదారణ్యకోపనిషత్, 6వ అధ్యాయము, 5వ మంత్రము ఉద్ఘోషింపుచున్నది.

"ఎట్లు ఆచరించువాడు అట్టివాడగును. మంచి పనులు చేయువాడు మంచి వాడగును. పాపము చేయువాడు పాపుడగును. పుణ్యము కలుగు పనులు చేయుటచేత పుణ్యమును, పాపము కలుగు పనులు చేయుటచేత పాపమును కలుగుచున్నది."

మహాత్ము లాచరించు దుష్ కార్యములు దోషకృత్యములని దూషించిన దోషము వచ్చునని కొందఱు చెప్పుదురు. ఈ సిద్ధాంత మెంతమాత్రము సరి కాదు. మన మెంత మాత్రము దూషింపరాదు. మనము కన్నది విన్నది యున్నది యున్నట్టుగా జెప్పుట న్యాయము. మనము కనిన దానిని వినిన దానిని వికల్పపఱిచి చెప్పుట దోషము.

శ్లో॥ సమక్షదర్శనాత్ సాక్ష్యం శ్రవణాచ్చేతిధారణాత్ ।
తస్మాత్సత్యం బ్రువన్ సాక్షీ ధర్మార్థాభ్యాం నహీయతే॥

(మహాభారతము, సభాపర్వము) "కన్నులార చూచుటచేతను, చెవులార వినుటచేతను సాక్ష్యమగుచున్నది. కాబట్టి, నిజము చెప్పెడు సాక్షి ధర్మార్థములందు హానిని జెందడు"

దేవాదు లాచరించు దుష్కార్యములకు రహస్యార్థము లున్నవని కొందఱు చెప్పుదురు. ఆ కార్యములకు బాహ్యార్థము నిజమైన అర్థము కాదనియు, గూఢార్థమే నిజమైన యర్థమని వాదింతురు. భ్రాతృవరులారా! గూఢార్థమేమి? బాహ్యార్థమేమి? మతమునకంతమర్మమేమి? నీతి కంతమర్మమేమి? అవి యంత మధ్యముగా వ్రాయబడియుండెనేని యవి నీతి ప్రసంగమేయగును. ఈ విషయమై యొక హిందూపండితుడు వ్రాయునది వినుడు:—

"కృష్ణుని గూర్చిన జారచోరత్వాది సంగతులన్నియు నిజముగా జరిగినవే యని జనసామాన్యము యొక్క హృదయమున నాటుకొని యున్నది. వీని వలన నీతియందు వారలకు గౌరవము తగ్గినను పూర్తిగా నశింపనందున "సమర్థునకు దోషనహి" యను నార్యోక్తి నాధారము చేసికొని సమర్థించుచున్నారు. కాని యీ సమాధానము కొందఱు విద్యాధికులగు నవనాగరికుల కంతగా రుచింపనందునను ఇట్టివి లోపములుగా కనుబడినందునను పలుమాఱు పత్రికలయందు ప్రచురించుచున్నారు. విమర్శకులును, జిజ్ఞాసులును, ముముక్షువులును తో గాలము పుచ్చక లోపములను దెలియబఱచి తద్వారా దేశక్షేమ మపేక్షించునట్లు చేయుట

స్వాభావికమని యెంచి తగిన సమాధాన మియ్యనేరక మూర్ఖాచారపరాయణు లును, దురభిమాన పిశాచా వేశ పరవశులును, క్రోధాలంకార భూషణులును నగు కొందఱు తమ జ్ఞాన హీనతను వెళ్ల బుచ్చుచు కసికీర దూఱుచున్నారు. కొందఱు కన్నములో తేలుకుట్టిన దొంగరీతి మిన్నకున్నారు. కొందఱు భయ పక్షముల వారిని సంతోషపెట్టదలచి సత్యములైన చరిత్రలని కొందఱి తోడను కల్పిత కథలనియు బాహ్యార్థమును గ్రహింపక రహస్యార్థమును గ్రహింప వలెననియు కొందఱితోడను వాదించుచున్నారు. మఱి కొందఱు కొంత వఱకు సత్యమైనదనియు మిగిలిన దానికి రహస్యార్థము గ్రహింపవలెననియు వాదించుచున్నారు. ఈ కడపటి రెండు తెగల వారివలనను దేశమునకు మహో పకారము కలుగు నట్లు కానబడినను వీరివలననే మఱింత యనర్థము కలుగుచు న్నది. 'పాము చావదు బడిత విఱుగ' దను సామెతగా నిశ్చయమైన యభి ప్రాయమును వెలిబుచ్చక యొకప్పుడు పురాణగాధలన్నియు నిజమయిన చరి త్రలే యనియు నట్లు నమ్మకుండుట యపచారమనియు, మఱియొకప్పుడు రహ స్యార్థమును బోధింపగల్పింపబడిన కట్టుకథలనియు వాదింతురు. ఇవి పర స్పర విరుద్ధములైన సంగతులని సామాన్యునకు సహితము స్ఫురింపకమానదు. సత్యమును గ్రహింప నిచ్ఛగల విమర్శకులకీ క్రింది సందియములు తఱచుగా గలు గుచున్నవి.

1. పురాణములయందభివర్ణింపబడిన కృష్ణుడును, రాధ, గోపికలు మొదలగు తదితరులును కల్పిత పురుషులా? లేక చరిత్ర పురుషులా?

2. రాధ, గోపికలు కల్పిత స్త్రీలును, కృష్ణుడు చరిత్ర పురుషుడును అని యందురేని అందుకుగల యాధారమేమి?

3. లేక యందఱు కల్పిత పురుషులందురేని, జనసామాన్యమునకు గల యభిప్రాయమునకుగాని, పురాణోక్తములగు పట్టణాదుల యాథార్థ్యమునకుగాని సమాధానమేమియిత్తురు?

4. నిజమైన చరిత్రలేయనియు, బుద్ధి బలముచేత రహస్యార్థము కల్పిం పబడిన దనియు, దానిని గ్రహించుట శ్రేయస్కరమనియు నందురేని, కృష్ణుని విషయమై మొదట వ్రాయబడిన సంగతులన్నియు యథార్థములని యొప్పుకొ న్నవారగుదురు.

5. అట్టి దుష్టవర్తనముగల కృష్ణుని మహానీతి సంపన్నుండైన భగవంతుని యవతారమని యెంచి పూజింపనగునా?

ఇటులనే రామాయణ భారతాది గ్రంథములకు జెప్పుచున్నారు. కావున బుద్ధిమంతులగు పండితులీ సందియములను దీర్చ సవినయముగా ప్రార్థితులు." (సత్యవాదిని Vol. I. No. 36.) ఇవన్నియు నిటులుండనీయుడి.

సోదరులారా! క్రీస్తుయేసు యోనిసంభవుడుగా జన్మించి నప్పటికిని ప్రజలందఱివలె పురుష సంయోగమువలన గలిగిన వాడుకాడని సవిస్తరముగా తెలిపియుంటిమి. దేవుని కిష్టమయిన యెడల యేసుని అయోనిసంభవునిగా ఆయన పంపగలడు. అయినను, మానవ రక్షకుడగు వాడు మానవుల బలహీనత లెఱిగినవాడు గాను, దేవుని యోగ్యతలకు దగినవాడు గాను నుండవలయును. కాబట్టియే, క్రీస్తు నర స్వభావమును, దైవ స్వభావమునుగలవాడుగ నుండెను. దైవత్వమందు దేవునితో సమానుడుగాను, మానుషత్వమందు దేవునికన్న తక్కువ వాడుగా నుండెను. స్త్రీ గుండ పాపము గలిగెను గనుక స్త్రీ సంతానము గుండనే మోక్షము గలుగు నటుల దేవుని ప్రధాన వాగ్దానమై యుండినందున ఆయన కన్యకాగర్భమున గలిగెనని గ్రహింపవలయును. దేవుడు యేసుని అయోనిసంభవునిగా బంపక, కన్యకాగర్భమునందు నత్యద్భుత విధముగా బంపి నందుకు బయిని దెలిపిన దేవుని ప్రధాన వాగ్దాన కారణము కన్న నెక్కువగా మనకు దెలియదు. దేవుడు సర్వశక్తిమంతుడైయుండినందున తన కిష్టమయిన వెల్లను జేయగలడు.

యేసు మనుష్యులలో శ్రేష్ఠుడు మాత్రమె కాక, కేవల మనుష్యుడని పిలువబడుట కర్హుడు. ఈయనే నిష్కళంకమైన దొడ్డవాడు. ఈశ్వరుడే యిట్టి వానిని గ్రహింపగలడు; ఈయనకన్న శ్రేష్ఠుని భగవంతునిగాన నూహించుట కశక్యము. మన హృదయ సంపూర్ణతతో దేవునిని ప్రేమించుచు, మనలను మనము ప్రేమించునట్లు మన యిరుగు పొరుగు వారిని ప్రేమించుటకన్న నధికము చేయగోరుట నిష్ఫలము. ఈ ద్వివిధమగు ప్రేమను సంపూర్ణముగా గ్రహించినవాడు శ్రీ యేసుక్రీస్తే.

ఆ జన్మ మరణ పర్యంతము యేసు ఏ మాత్రమును పాప మెఱుగనివాడయి యుండెను. ఆయన సుఖము ననుభవించుటకుకాక మనుష్యులను రక్షించుటకే యీ లోకమునకువచ్చెను. కాబట్టి ఆయన యెన్నడును పెండ్లిచేసికొనలేదు. ఆయన యే స్త్రీ మీదను కన్నువేయలేదు. ఆయన యెన్నడు నొక్క చెడ్డ

మాటయైన నుచ్చరింపలేదు. ఎట్టి దుష్కార్యమైనను చేయలేదు. ఆయన తన స్వంత సౌఖ్యమును జూడక ముఖ్యముగ ఇతరుల సౌఖ్యమును వృద్ధిచేయగోరెను. ఆయన యెల్లప్పుడు నితరులను ప్రేమించుచుండి తన శత్రువులను సహితము ప్రేమించెను. ఆయన తన్ను సిలువమీదను జంపుచుండిన వారికొఱకు కూడ ప్రార్థించెను. మనసునందును, మాటయందును, క్రియయందును మొదటి నుండి కడవఱకు ఆయన సంపూర్ణముగా పాపరహితుడై యుండెను. ఇది మిగుల ఆశ్చర్యకరమయిన సంగతి.

ఇంతియేకాక, యేసుక్రీస్తును గూర్చి మనము బైబిలు వేదమును జక్కగా పర్యాలోచించి చూడగా, ఆయన పాపము చేసినాడని యనుటకు నెవరికిని నోరురాకపోయెనని మనకు కనబడుచున్నది. ఆయనను గూర్చి సత్య వేదపు పూర్వభాగములో అనేకములయిన ప్రవచనములున్నవి. వాని నన్నిటిలో ననేకములయిన యేసును పొగడునట్టి మాటలు మాత్రమే యున్నవి. ఆయన పుట్టుకను గూర్చియును, ఆయన క్రియలను గూర్చియును, ఆయన బోధను గూర్చియును, ఆయన మరణ పునరుత్థానోర్ధ్వారోహణములను గూర్చియును, ఆయన విషయమై అపోస్తలులు (శిష్యులు) చేసిన ప్రసంగములను గూర్చియును ఉత్తరభాగములో విశేషముగా వ్రాయబడియున్నది. అయినను సువార్తయొక్క ప్రారంభము మొదలుకొని కడవఱకును మనము చదివి చూచినను ఆయనలో నొక్క దోషమైనను కనపడదు.

ఇంతియకాక, క్రీస్తు శోధింపబడినను పాపముచేయలేదు. క్రీస్తు నిజమైన మనుష్యుడగుటచేత ఆయనకు గూడ శోధనలు కలిగెను. ఆయన సమస్త విషయములలో మనవలె శోధింపబడెను. సాతాను శోధన లెంత బలముగలవియైనను, ఎంతటి యుక్తికలవియైనను ఆయన యా శోధనలకెన్నడును లోబడలేదు (మత్తయి 4: 3-10.) ప్రబలవిరోధులాయన చెడ్డవాడని ప్రజలకు జూపుటకై ఎంతగా కోరినను వారాయన నడతలో చిన్న యక్రమమునైనను జూపలేకపోయిరి. జనులు తమ పాపముల నొప్పుకొని క్షమాపణవేడవలెనని ఆయన వారికి మాటిమాటికి బోధించినను, తనకు పాపమున్నదని యొప్పుకొనినట్లు ఆయన చేసిన ప్రార్థన లన్నిటిలో నొక్క దానిలోనైనను ఏ సూచనయైనను కనబడదు,

ఇందువలన క్రీస్తునకు కర్మ పాపము లేదని తెలిసికొనగలము. ఆయన తన పాపముల కొఱకు గాక కేవలము మన పాపముల కొఱకే చనిపోయెను. (1 పేతురు 2: 24.)

ఇదియుగాక, దేవునియెడల తాను చేయవలసిన వానిలోను క్రీస్తు పరిశుద్ధుడైయున్నాడని చూడగలము. మనుష్యులయెడల తాను చేయవలసియుండిన వానిని జూచినను క్రీస్తు పరిశుద్ధుడైయున్నాడు. క్రీస్తు పరిశుద్ధత ఆయన దైవత్వమును నిర్ధారణచేయును. క్రీస్తు పరిశుద్ధత మానవకోటికి మాదిరైయున్నది. క్రీస్తు తన పరిశుద్ధతను బట్టి దేవుని యాజ్ఞలను మానవుల కొఱకు పూర్ణముగా నెఱవేర్చెను. క్రీస్తు పూర్ణ పరిశుద్ధుడైనందున మనకు ప్రతిగా దేవుని చిత్తమును ఆయన యాజ్ఞలను పూర్ణముగా నెఱవేర్చెననునదే యీ బోధవలన మనకు కలుగు ముఖ్యమైన ఆదరణయయియున్నది. (రోమా 5: 18, 19).

యేసు పాపరహితుడనియును (2 కొరిం 5: 11) పవిత్రుడును, నిర్దోషియును, నిష్కల్మషుడును, పాపులలో జేరక ప్రత్యేకముగానున్నవాడును, పరమండలము కన్న హెచ్చైనవాడును (హెబ్రీ 4: 15; 7: 26) అనింద్యమైన వాడును, నిష్కళంకమైనవాడును, పాపముచేయనివాడును (1 పేతురు 1: 19; 2:22) అని చెప్పబడియున్నది. వేయి మాటలేల? „ఆయన దేవునియొక్క ప్రతిబింబమును ఆయన తత్వముయొక్క మూర్తిమంతమునైయుండెను" (హెబ్రీ 1: 3). అది యట్లుండవలెను.

యేసుక్రీస్తుయొక్క పరిశుద్ధతనుగూర్చి యితర సాక్ష్యములు:—

క్రీస్తునుగూర్చి ఖురాను నేమి సాక్ష్యమిచ్చుచున్నదో చూడుడి. యేసులో నొకపల్లెత్తు తప్పయినను నున్నట్టు ఖురానులో నేమూలను జెప్పియుండలేదు. ఆయనను శ్లాఘించుచునే కాని మరే విధముగాను యేసునుగూర్చి ఖురాను ప్రశంసింపదు. యేసు „కలంఉల్లా," అనగా దేవుని వాక్యము, అని ఇమ్రాన్ అను సురాలోనికి 30,40 ఆయతులలో పిలువబడుచున్నాడు. నిసా అను సురాలోని 169వ ఆయతులో, ఆయన „రుహుఉల్లా" అనగా „దేవుని యాత్మ" అని పిలువబడుచున్నాడు. ఈ యాయతులోనే „యేసు మరియమ్మ కుమారుడు, దేవుని ప్రవక్త, దేవుడు మరియమ్మలోనుంచిన వాక్యము, ఆయనయొద్దనుండివచ్చిన ఆత్మ" అని వర్ణింపబడుచున్నాడు. „యేసు దేవుని

వాక్యము" అయియున్నందున పాపరహితుడయి యుండవలెను. ఆయన 'దేవుని ఆత్మ' అయియున్నందున దేవుడే యయియుండి పాపరహితుడయి యుండవలెను. కాబట్టి యేసు దేవుని వాక్యమును, దేవుని ఆత్మయును నయి యుండుటచేత పాపరహితుడయి యుండక తప్పదు.

యేసుక్రీస్తును విచారించిన రోమన్ గవర్నరైన పిలాతు సయితము— "నాకు ఈయనలో ఏ తప్పిదమైనను కనబడదు" అని తీర్మానించెను.

యేసుక్రీస్తుని పరిశుద్ధ చారిత్రమును నత్యాసక్తితో పరీక్షించిన యీ కాలపు పండితోత్తములలో ప్రముఖుడగు క్రైం అను నాయన వ్రాయునది వినుడి: "మన మధ్యలోక నిజమయిన పురుషు డుద్భవించెను. మనుష్య స్వభావమం దుండు దైవ బీజము వారియందు మహాద్భుతమున వర్ధిల్లి, సంపూర్ణముగ వికసించి ఫలించెను. మనుష్యునకు స్వభావసిద్ధమైన దైవ సహవాసమును అన్యోన్య సంభాషణమును మన మెన్నడును కనని వినని విధముగ వీరిలో పరిపూర్ణమై యున్నవి. వీరు మానుషికమై మచ్చు అయిన పురుషులు. దేవునివలన కాలాదినుండి ప్రేమింపబడి పూర్వ దృష్టితో సృష్టి శిరోభూషణ ఫలమని చూడబడిన వారు. వీరిని ధ్యానించుటయందు సృష్టికర్తయగు దేవుని పరిశుద్ధ ప్రేమ వాంఛలు తృప్తిపఱుపబడినవి. ఏలయనగా, వీరి హృదయమునందును, వర్చస్సునందును జ్ఞానమూర్తియగు భగవంతుడు తన నిజ స్వరూపము ప్రతి ఫలించుట జూచుచున్నాము." ఇట్టి సాక్ష్యము పెక్కులు గానవచ్చుచున్నవి.

కావున, భ్రాతృవరులారా! యేసుక్రీస్తు సర్వలోక రక్షకుడుగాను భక్తపాపహరుడుగాను నుండుటకు జాలినవాడనుట నిర్వాదాంశమే.

క్రీస్తు మనకు జ్ఞానమును, నీతియును, పరిశుద్ధతయును, విమోచనమును, ఆయెను. (1కొరిం. 1: 31.)

## 6వ ప్రకరణము.

## యేసుక్రీస్తు చేసిన యద్భుత కార్యములను గురించి.

యేసు దేవుని కుమారుడైయున్నాడను విషయము నిర్ధారణచేయుటకై ఆయన అద్భుతములను వింత కార్యములను జేసెను. తండ్రి క్రీస్తును పంపించెనని వానివలననే మనము తెలిసికొనగలము. "ఆదేమనిన, నెఱవేర్చుటకై తండ్రి

యే క్రియలను నా కిచ్చియున్నాడో నేను చేయుచున్న ఆ క్రియలే తండ్రి నన్ను పంపియున్నాడని నన్ను గూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి" (యోహా. 5: 36). „నేను నా తండ్రి క్రియలు చేయని యెడల నన్ను నమ్మకుడి; చేసిన యెడల నన్ను నమ్మకున్నను తండ్రి నాయందును నేను తండ్రియందును ఉన్నానని మీరు గ్రహించి తెలిసికొనునట్లు ఆ క్రియలను నమ్ముడని వారితో చెప్పెను. (యోహా. 10:37,38.)

ఇదియుకాక, ఆయన అద్భుతముల నొనర్చునని మహర్షియైన యెషయ „సడలు చేతులను బలపఱచి, తొట్రిల్లు మోకాళ్లను దృఢపఱచుడి; చంచల హృదయులను చూచి—ధైర్యముగా నుండుడి, భయపడకుడి; ఇదిగో! మీ దేవుడు వచ్చి ప్రతిదండన, దేవుని ప్రతీకారము చేయును, ఆయనవచ్చి తానే మిమ్మును రక్షించును. అప్పుడు గ్రుడ్డివారి కన్నులు తెరవబడును; చెవిటివారి చెవులు విప్పబడును. అప్పుడు కుంటివాడు జింకవలె లఘువులు వేయును; మూగవాని నాలుక పాడును; ఏలయనగా, అరణ్యములో నీళ్లును, అడవిలో కాలువలును ఉబుకును" (యెష. 35: 3-6). „ఆ దినమునుండి చెవిటివారు గ్రంథ వాక్యములను విందురు; అంధకారము, గాఢాంధకారము గలిగినను గ్రుడ్డివారు కన్నులార చూచెదరు" (యెష. 29: 18). ఇట్లు క్రీస్తు రాకకుముందే 712వ సం॥ మున దైవాత్మానుసరణితో యెషయ భవిష్యత్తుగ బలికెను. ఇవన్నియు నెఱవేఱుటను గుఱించి (మత్తయి 11: 4,5; లూకా 7: 12; మత్తయి 4: 23,24; 15: 30, 31) చదివి చూడుము.

క్రీస్తు చరిత్రను చూడగా ఆయన యనేక అద్భుత కార్యములను చేయుటవలన ఆయన కీర్తి పాలస్తీనా దేశమంతటిలో మ్రోగుచుండినటుల తెలిసికొనగలము (మత్తయి 4: 34; లూకా 4: 37). సూర్యుడస్తమించుచుండగా నానావిధరోగముల చేత పీడింపబడుచున్నవారు ఎవరెవరి యొద్దనుండిరో వారందఱు రోగులను ఆయన యొద్దకు తీసికొనివచ్చిరి; అప్పుడాయన వారిలో ప్రతివానిమీద చేతులుంచి స్వస్థపఱిచెను. (లూకా 4: 40). ఆయన యీ లోకమున మనుష్యావతారములో నుండగా అద్భుతములు చేయని దినమొకటియైనను లేనట్లు కనబడును. స్వస్థత నొందుటకు మనుష్యులు దివారాత్రములు ఆయన యొద్దకు వచ్చుచుండిరి. ఆయన రోగులను, కుంటివారిని, గుడ్డివారిని, చెవిటివారిని, కుష్ఠరోగులను బాగుచేసెను. ఆయన మాటప్రకారము ఆయన శిష్యులు వలలువేసి గొప్పచేపల రాసులను పట్టిరి. ఆయన దయ్యములను వెళ్ళ

గొట్టెను. ఆయన తన మాటవలన తుఫానును నిమ్మళింపజేసెను; కొన్ని రొట్టెలను చేపలను తీసికొని వానితో గొప్పసమూహములకు భోజనము పెట్టించి తృప్తిపఱిచెను; మృతులను బ్రతికించెను; తానే స్వయముగా మృతులలోనుండి సజీవుడయి లేచెను.

ఇంతియేకాదు. క్రీస్తు చేసిన యద్భుత కార్యములను జూచిన వారందఱును విస్మయమొందుచుండిరి. (లూకా 4: 36; మార్కు 7: 37). అట్టి వింతయిన శక్తి క్రీస్తులోగాక మఱియెవరిలోను ఎన్నడు నుండలేదు. గాలివానలు, వ్యాధులు, జీవమరణములు మొదలగునవి యన్నియు ఆయనకు లోబడెను. పాతనిబంధన కాలపు ప్రవక్తలలో కొందఱిట్టి యద్భుతములను జేసిరను మాట వాస్తవమేయయినను వారు మిగుల అరుదుగా నద్భుత క్రియలను జేసియుండిరి. వారు వానిని తమ స్వంతశక్తివలనగాక దేవుని ప్రార్థించి దేవుని సహాయమువలన జేసియుండిరికాని, క్రీస్తు వారివలె కాక తన స్వశక్తిచేత అద్భుతములను జేసి తనకున్న దైవాధికారమును మాహాత్మ్యమును గనబఱిచెను. క్రీస్తు చేసిన అద్భుతకార్యము లన్నియు బైబిలులో వ్రాయబడియుండలేదు. యేసు చేసినకార్యములింక ననేకములుకలవు. వానిలో ప్రతి దాని వివరించి వ్రాసిన పక్షమున అట్లు వ్రాయబడిన గ్రంథముల కీలోకముపట్టదు. (యోహాను 21: 25) ఇది యట్లుండనిండు.

మాలో అగస్త్య మహాముని మొదలగువారు యేసుక్రీస్తుకన్న గొప్ప అద్భుతములను జేసిరి గావున క్రీస్తులోఉన్న విశేషమేమి యని యప్పుడప్పుడడుగుచున్నారు. మంచిది; వీరు ఋషులయొక్క అద్భుతముల తారతమ్యము గొంత యోజించి చూతము.

అగస్త్యుని యద్భుతములు (1) అత్యున్నతమై దినదినము వృద్ధి నొంది సూర్యుని కడ్డముగా నిలిచిన వింధ్యపర్వతములను నేల పరుండ బెట్టుట (2) శివుడు పార్వతిని హిమవత్పర్వతమునందు వివాహముచేసికొని నప్పుడు జనభారముచేత ఉత్తర భూమి క్రుంగి దక్షిణ భూమి హెచ్చినది చూచి యగస్త్యుడు మలయ పర్వతము మీదనుండి సమముగా జేయుట (3) సముద్రజలమునంతయు జేత దీసికొని ఆచమనముచేయుట.

ఇవి యద్భుతములట! క్రీస్తు చేసిన యద్భుతములకన్న మిగులగొప్పవట. ఇవి కట్టుకథలని చెప్పవలయునుగాని యద్భుతములని చెప్పుట కాస్పదము

లేదు. ఈ కథలను ఎవరు నమ్మగలరు? అచల వస్తువయిన రాతికొండకు గర్వించుటయును, విశ్వరూపమును దాల్చుటయును, సూర్యుని కడ్డముగా నిలుచుటయు నెట్లు సాధ్యమగును? వింధ్యయను చిన్నకొండ తొమ్మిదికోట్ల యేబదిలక్షల యోజనములకు మీద పెఱిగిన దనునది యెవరు నమ్మగలరు? సూర్యుడు బ్రహ్మాండ జ్యోతియై గగన వీధిలో నిలిచియుండగ దానిని చుట్టు తిరిగెడు గ్రహములలో నొకటియగు భూమిలో నొకచిన్న ప్రదేశమందు బడి యుండెడు పర్వతము ఔన్నత్యము చెంది సూర్యునికి మరుగుగా నిలుచు టెట్లు? ఇదియసంభవమే. (2) కన్యాకుమారి మొదలు మ్లేచ్ఛ దేశ నైఋతి దిక్కు వఱకు నుండు భూమిని సరిగా రెండు భాగములు చేసి చూడగా హిమవత్పర్వతము దక్షిణ పార్శ్వమున నిలిచినదేకాని యుత్తర భాగమందు నిలిచినది కానేరదు. అట్లయిన హిమగిరి దక్షిణమే యుండును. గాని ఎప్పటికిని యుత్తరమున నుండజాలదు. అట్లుండగా నుత్తర భూమిదిగిపోయిన దనుట వీలులేనేలేదు. ఇదియుగాక, ఆ వివాహమహోత్సవమునకు హిను వద్దిరికి సకల బ్రహ్మాండ ప్రజలువచ్చియుండిరని పురాణ ప్రసిద్ధము.

“బ్రహ్మాద్యామునయస్సర్వే త్రిలోకాంతరవాసినః” (బ్రహ్మవైవర్తక పురాణము).

“పాణిగ్రహణకల్యాణం ప్రాపుస్సర్వే డోవర్తినః” (స్కాందపురాణము).

“సకల బ్రహ్మాండవర్తులౌ జనము లెల్ల శీతనగరాజపురికిని జేరిరప్పు” (కాంచీక్షేత్రమాహాత్మ్యము 4ఆ) అని ప్రతిపాదింపబడియున్నది. అయినందున ఆ హిమవద్గిరియందు సకల బ్రహ్మాండ జనులెలాగు పట్టిరి? భూమి పొర్లగా ఆగిరి భూమిలోనుండునద్దానందునలన దానితోగూడ క్రిందు మీదవునుగదా! అప్పుడందుండు వారేమైరి?

అదియుగాక, బ్రహ్మభూచక్రమును సమము చేయు టెట్లో తెలిసికొన లేకపోయెనట. ఆబ్రహ్మనారాయణునితో నాలోచించి యాయన సలహో చొప్పున విశ్వకర్మను ప్రార్థింప నతడును “అగస్త్య మునీంద్రుడు సమర్థుడు గాని నేను శక్తుడనుగాన”ని విన్నవించెనట. ఈ వృత్తాంతమంతయు తెలిసి యగస్త్య ముని యలిగి విశ్వకర్మనుద్దేశించి పార్వతీ కల్యాణోత్సవము చూచుటకు ననేక మునీంద్రులను గూడి నేను వచ్చితి నిట్టి నా పై బ్రహ్మకడబిసునో క్తి జెప్పుటకు గారణమేమని యొండొరులు కలహించి దారుణముగా శపించు

కొనిరి. అంతట బ్రహ్మ అగస్త్యుని వేడుకొనగా నతడు దక్షిణ దిగ్భాగంబు నందొక్క చోట తన కమండలమునుంచి భూచక్రమంతయు సమమునుగావించెనట. ఈ కథ బ్రహ్మవైవర్త పురాణములోని మంగళాద్రి క్షేత్రమహాత్మ్యమున 29వ అధ్యాయమునందు వ్రాయబడియున్నది. సోదరులారా! సృష్టికర్తకు నలవిగాని పనియొకటియుండునా? (3) అగస్త్యుడు సముద్రోదకమునంతయు పానముచేసినాడని చెప్పుదురు. ఇది యసంభవమే. ఎట్లనిన, నరులను బాధించు తారకుడు కమలాక్షుడు మొదలగు రాక్షసులను నశింప సముద్రోదకము నెల్లను పానము చేసెనని మత్స్యపురాణములో జెప్పియున్నది. ఆ యసురలు పౌలేమి కాలకేయులనియు, అగస్త్యుడు సముద్రోదకమును ఆచమనము చేయగా, ఇంద్రాది దేవతులారక్కసులను యుద్ధమందు జంపిరని మహాభారతమునందు వ్రాయబడియున్నది. తారకుడు కమలాక్షుడు మొదలగు రాక్షసులను కుమార స్వామి యుద్ధమందు జంపెనని స్కాందపురాణ శివరహస్యఖండమందున్నది. ఇందులో ఏది నిజము? ఆ సముద్రజలమంతయు నగస్త్యుడు మూత్రము ద్వారా విడిచి పెట్టినందున ఉప్పునీరాయెనని చెప్పుదురు. ఇట్టి గాథ లద్భుతములని యెవరు నమ్ముదురు? పయిని జెప్పబడిన యద్భుతములద్భుతములుగావు. ఆయద్భుతకార్యములు జరిగిన కాలమెవరికిని తెలియదు. వానిని ప్రసిద్ధిచేయుటకు మంచి చరిత్రయును గానరాము. వానిని అద్భుతములని నమ్ముటకును యోగ్యమైన సాక్షులగుపడుటలేదు. ఆయద్భుతకార్యములను తెలియజేసిన వారు వానిని జూచిన వారు కారు. ఆయద్భుతకార్యములవలన మేలు పొందిన వారును కారు. అవి యాకాలమందుండిన వారికైనను, మనకైనను నిజమైన జ్ఞానసంబంధమగు మేళ్లను గలిగించుటకు హేతువేమియులేక వ్యర్థమయిన కథలుగానున్నవి.

యేసుక్రీస్తుచేసిన యద్భుతము లనేకములు. అవి మహత్తయినవి. ఆయన చేసిన యద్భుతకార్యములు సర్వశక్తిగల కారణునికి ఘనముగాను, తగినవిగానునుండినవి. దేవుడనాదినుండి ప్రజలను గురించి చేయుచువచ్చిన యాలోచన నెఱవేర్చుటకును పూర్వపు సత్యవేదపు ఋషుల ప్రవచనములను దృఢపఱుటకును మానవుల నిత్యసౌఖ్యమునకు విరోధమైన యవిశ్వాసమును, తెలియనితనము, దుర్గుణము, దుర్మార్గము మొదలయిన వానిని నాశనముచేసి, నిత్య సౌఖ్యమునకు కావలసిన విశ్వాసము, జ్ఞానము, సుగుణము, సన్మార్గము, సద్భక్తి

మొదలయిన వానిని కలుగజేయుటకును మనుష్యులకు గలిగిన యుపద్రవములను దౌర్భాగ్యమును. బోగొట్టి బాధగల వారికి ఉపశమనమును ఏడ్చు వారికి సంతోషమును, సాతానుచే పీడింపబడిన వారికి విడుదలయును నిచ్చివారిని పరలోక భాగ్యవంతులనుగా జేయుటకే యీయద్భుతకార్యములను జేసెను. క్రీస్తు తాను నిజముగా దేవుని యవతారమనియు, తన మతము సత్యమతమనియు దేవుని గుణ విశేషణమునకు తగినవనియు, ఆయన శక్తికిని తత్త్వమునకును దారుఢ్యమైన సాక్ష్యములుగా నుండునటులను జేసెను. క్రీసు శిష్యులు తాము చూచిన వానిని గూర్చి సాక్ష్యమిచ్చినదిగాక తాము చెప్పుచుండ్చిన బోధను దృఢపఱచుటకును తామే యద్భుతకార్యములను జేసి దానివలన దేవునిసాక్ష్యములను బొంది పిదప తాము చెప్పిన సాక్ష్యముల నిమిత్తమనేక ఉపద్రవములను కడపట మరణమును సహించుకొనిరి.

కాబట్టి, భ్రాతృవరులారా! బైబిలులో నిమిడియుండు అద్భుతకార్యములు సత్య భక్త సాహురుని మతమును దృఢపఱచుటకు మాత్రమేకాక, బైబిలును వ్రాసినవారు పరిశుద్ధాత్మచేత నడిపింపబడిరనుటకు మంచి సాక్షీభూతములై యున్నవి.

## 7 వ ప్రకరణము.

## యేసుక్రీస్తు చేసిన జ్ఞానోపదేశములను గుఱించి.

ప్రభువైన యేసునకుగల యుద్యోగములలో ప్రవక్తోద్యోగ మొకటి కావున ఆయన పనిలో బోధయను నది యొక ముఖ్య విషయముగానున్నది. ఆయన నరావతారములోనుండగ యూదయ్యలోను, సమరయ్యలోను గలిలయ్యలోను మఱి యెచటకు బోయినను ప్రజలకు బోధించుచుండెను. ఆయన దేవాలయమందును సమాజమందిరములలోను, అరణ్యప్రదేశములందును నీటి పల్లుయందును విశ్రాంతికాలమందును తాను తిరిగిన ప్రదేశములందంతటను బోధించుచుండెను. ఆయన అనేకులుండు గుంపులకును ఒక్కొక్కరికిని బోధించెను. క్రీస్తు తన బోధను తేటపఱచుటకై యనేకపర్యాయములు ఉపమానముల రీతిగా నుపదేశించెను.

ఇంతియేకాక, పూర్వము దేవుడు ప్రవక్తలద్వారా తన చిత్తమును మనుష్యులకు తెలియజేసియుండెను గాని చివరికాలములో ఆయన తన చిత్తమును

తన కుమారుని ద్వారా తెలియజేసియున్నాడు. క్రీస్తు దేవుని "రొమ్మునయున్న వాడు" గనుక ఆయన దేవుని సంగతులను పూర్ణముగ దెలియజేయగలిగియు న్నాడు. ఆయన యట్టి యధికార శక్తులతో బోధించినందున ఆయన బోధ లను వినిన వారాశ్చర్యపడి (మత్త. 7: 28, 29). ఆయన దేవునియొద్దనుండి వచ్చిన బోధకుడని యొప్పుకొనవలసివచ్చెను (యోహా. 3: 2) ఆయన బోధిం చినది ఖండింపబడనేరని పరిపూర్ణ సత్యమై యుండెను (లూకా 21: 33). ఆయన బోధించిన సత్యము లన్నిటి కన్నఁ నున్నతమైనవి (హెబ్రీ 2: 2, 23). దేవుని గూర్చి మనము తెలిసికొనవలసిన వాని నన్నిటిని ఆయన బయలుపఱిచెను.

ఇంతియకాక, క్రీస్తు ధర్మ శాస్త్రమును బోధించి దాని యాంతర్య భావ ములను దెలిపెను. కొండమీద వినిపించిన ధర్మోపన్యాసములో ఆయన దీనిని గూర్చి మిగుల తేటగా బోధించెను. (మత్త. 5-7అ). మానవులు కల్పించిన వెలుపలి కట్టడల నాయన కొట్టివేసి, వెలుపలి యాచారముల నాచరించుట వలనగాక, మనస్సునందు దేవునిని, మనపొరుగువానిని పూర్ణముగా ప్రేమించుట వలన (మత్త. 22: 37, 39.) దేవుని ధర్మశాస్త్రమును గైకొనవలెనని బోధిం చెను. క్రీస్తు చేసిన నీతి బోధలను వినుడి:—

"ఈ యాజ్ఞలలో మిక్కిలి అల్పమైన యొకదానినైనను మీరి మను ష్యుల కాలాగున చేయ బోధించువాడెవడో వాడు పరలోకరాజ్యములో మిక్కిలి అల్పుడనబడును గాని వాటిని గైకొని బోధించువాడెవడో వాడు పరలోకరాజ్యములో గొప్పవాడనబడును" (మత్తయి 5: 19). "సిద్ధుడైన ప్రతివాడును తన గురువువలెనుండును" (లూకా 6: 40). దేవునిని పొరుగు వానిని ప్రేమింపవలెను. (మత్తయి 22: 37 39)" మనుష్యులు మీకేమి చేయ వలెనని మీరు కోరుదురో ఆలాగుననే మీరును వారికిచేయుడి (మత్తయి 7: 12).

ఇంతియేగాక, యేసుక్రీస్తు తననుగూర్చి ప్రకటించిన బోధలను వినుడి: (1) మనుష్యులకు నిత్యజీవము కలుగునట్లు తాను పరలోకమునుండి వచ్చుట (యోహా. 13: 3-17). తన ప్రాణమును విమోచన క్రయధనముగా పెట్టుట వలన వారిని రక్షించుట; (3) తానే మార్గమును, సత్యమును, జీవమునైయున్నా ననుట (యోహా. 14: 6). తన ద్వారానేకాని యెవడును దేవుని ఎఱిగి యాయనయొద్దకు జేరలేడనుట; (4) తన నామమందే మనుష్యులందఱకు మాఱు

మనస్సును, పాపపరిహారమును ప్రకటింపబడవలెననుట (లూకా 24: 27). రక్షణపొందుటకు తనయందలి విశ్వాసము అత్యవసరమనుట (యోహా. 3: 16); తనను విశ్వసింపనివారు శిక్షకులోనగుదురనుట (యోహా. 3: 17). ఆయన రక్షకుడు మాత్రముగాక మనుష్యులకు తీర్పుచేయువాడునైయున్నాడనుట (5) ప్రతివారికి వారివారి క్రియల చొప్పున ప్రతి ఫలమిచ్చుటకై తాను మరల వత్తునని చెప్పుట (మత్త. 16: 27). మొదలగునవియై యున్నవి. ఇవన్నియు నట్లుండనిమ్ము.

అద్భుతకార్యధురంధరుడును, సమస్త సద్గుణ పరిపూర్ణుడును, కళంకరహితుడునగు క్రీస్తుయేసే "జగద్గురు" స్థానమునకు దగినవాడు. ఆయన వాచా యొకటి పలికి, కర్మణా మరియొకటి చేసినవాడు కాడు. అనేకులు నీతులు పలుకుదురు గాని పలికినట్లు చేయజాలరు. ఈ దేశపు ఋషులట్లు చేసియుండి తాము చేసినట్లు చేయక తాము చెప్పినట్లు చేయుమనివారు బోధించిరి. ఇందుకు నిదర్శనముగా, బోధాయన ధర్మ సూత్రములలో,

సూ॥ అనుష్ఠితంతుయద్దైవైర్మునిభిర్యదనుష్ఠితంనా
నుష్ఠేయగమనుష్యైస్తదుక్తంకర్మసమాచరేత్॥

"దేవతలచే మునులచే నాచరింపబడినటుల మనుష్యులాచరింపగూడదు. వారానతిచ్చు కర్మనాచరించుము"ని చెప్పియున్నది.

శ్లో॥ నదేవాజ్ఞాంవిలంఘ్యేధాఃనదేవాచరితంచర॥

"దేవాజ్ఞను సారిగా నడిచిదానిని దాట గూడదు; దేవతు లాచరించు నటులాచరింపరాద"ని స్కాందపురాణ బ్రహ్మోత్తరఖండమునందును బ్రతిపాదింపబడియున్నది.

పయి వచనములను బట్టి, దేవతులు, ఋషులు తాము విధించు ధర్మ విధుల ప్రకారముచేయనట్లు స్పష్టము. తాము నడిచి చూపింపని బోధ లేమి బోధలు అవి పాటు లేని బోధలే యనుటకు సందియములేదు. ఎందుకనిన,—

శ్రు॥ సత్యంచస్వాధ్యాయప్రవచనేచ॥

"సత్యమును తానసుష్ఠించి యితరులకు ప్రవచనముచేయనలసినద"ని తైత్తిరీయోపనిషత్తు, 9వ అను వాకమందు జెప్పియున్నది. మహాభారత మాది పర్వమున,—

శ్లో॥ ఆపత్సుయోధారయతిధర్మంధర్మవిదుత్తమః॥

„ఎవడు తన యాపత్కాలమందును ధర్మమును ననుసరించుచున్నాడో, వాడు ధర్మము తెలిసిన వారిలో శ్రేష్ఠుడు;'' అనియు, వనపర్వమున శ్లో॥ ధర్మజ్ఞః పండితోజ్ఞేయోనాస్తికోమూర్ఖఉచ్యతే॥ „ధర్మమును తెలిసిన వాడే విద్వాంసుడు, నాస్తికుడు మూర్ఖుడ''నియు జెప్పియున్నది

శ్లో॥ కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్॥

„విద్వాంసుడు లోకానుగ్రహార్థమై శ్రద్ధతో సుకర్మను జేయవలయు''నని భగవద్గీతలు, బోధించుచున్నవి.

శ్లో॥ మనస్యేకంవచస్యేకంకర్మణ్యేకంమహాత్మనామ్।
మనస్యన్యద్వచస్యన్యత్కర్మణ్యన్యద్దురాత్మనామ్॥

„మహాత్ములకు మనస్సునందు నొకటే, మాటయందును అదియే కార్యములందును అదియేయుండును; దుష్టవారికి తలంపునందు వేఱొకటి, మాటలయందు మఱియొకటి, కార్యములందు నంతకన్న వేఱొకటియుండున''ని ఆర్యమత నీతి బోధిని, ప్రథమ భాగమునందును జెప్పియున్నది.

కాబట్టి ఆర్య సోదరులారా! పయిన జెప్పబడిన శ్రుతిస్మృతి ప్రమాణ వాక్యములను బట్టి చూడగా ధర్మములను మీరి బోధించిన వారి బోధలు మన కేమి పాటియగును? యేసుక్రీస్తన్ననో, ఆయన దేవునివలె నడిచి మాటలాడెను. ఆయన యధికారముతో బోధించి, బోధించిన విధమున త్రికరణ శుద్ధిగా ప్రవర్తించెను. „వారును సత్యమువలన ప్రతిష్ఠచేయబడునట్లు వారి కొఱకై నన్ను ప్రతిష్ఠచేసికొనుచున్నాను'' అని (యోహాను 17:19) ఆయన చెప్పుకొనెను. మనుష్యుని సర్వశక్తులు సంపూర్ణముగా శుద్ధీకరింపబడవలయునని క్రీస్తు ఈ వాక్యమువలన మనకు నేర్పుచున్నాడు. క్రైస్తవ ఋషుల బోధ వినుడి: „ఎలాగు మమ్మును పోలి నడుచుకొనవలెనో అది మీకే తెలుసును. మేము మీ మధ్యను అక్రమముగా నడువలేదు'' (2 తెస్సలొనీకై 3: 7); „మీరు మమ్మును పోలి నడుచుకొనవలెనని మమ్మును మేము మాదిరిగా కనపరచుకొనుటకే యీలాగు చేసితిమి గాని, మా కధికారములేదని కాదు'' (2 తెస్స. 3: 9). „మేము విశ్వాసులైన మీ యెదుట యెంత భక్తిగాను నీతిగాను అనింద్యము

గాకు ప్రవర్తించితిమో అందుకు మీరు సాక్షులు, దేవుడును సాక్షి'. (1 థెస్స. 2: 10). యేసును యేసు శిష్యులును మన దేశపు ఋషుల బోధలకు ఎంతో భిన్నముగా బోధించిరి.

ఈ దేశపు ఋషులు, కొన్ని కొన్ని కార్యములందు నవసరమువచ్చినప్పు డబద్ధమాడవచ్చునని యనుజ్ఞనిచ్చిరి. క్రీస్తు అట్లనుజ్ఞ యియ్యక మీ ప్రాణము పోయినప్పటికిని మీరబద్ధమాడ కూడదని ఖండితముగా బోధించెను.

శ్లో॥ ననర్మయుక్తంవచనంహినస్తినస్త్రీషురాజన్న
వివాహకాలే।
ప్రాణాత్యయేసర్వధనాపహారేప
ఞ్చానృతాన్యాహురపాతకాని॥

"మాన భంగమందును, స్త్రీలయందును, వివాహకాలమందును, ప్రాణము పోవునపుడును, యావత్తు ద్రవ్యము దొంగిలింపబడినపుడును పలికిన యబద్ధములు పాతకములు కావ''ని మత్స్య పురాణము, 31వ అధ్యాయమందు జెప్పియున్నది. మనుస్మృతి 8వ అధ్యాయములో,—

శ్లో॥ మహర్షిభిశ్చదేవైశ్చకార్యార్థంశపథాఃకృతాః।
వసిష్ఠశ్చాపిశపథం శేపేపైయవనేనృపే॥
నవృథాశపథంకుర్యాత్స్వల్పేప్యర్థేనరోబుధః।
వృథాహిశపథంకుర్వన్ప్రేత్యచేహచనశ్యతి॥
కామినీషువివాహేషుగావాంభక్ష్యేతథేంధనే।
బ్రాహ్మణాభ్యుపపత్తౌచశపథేనాస్తిపాతకమ్॥

"మహర్షులచేతను, దేవతలచేతను కార్యము కొఱకు శపథములుచేయబడినవి. పైయవనుడను రాజు విషయమందు వసిష్ఠుడు శపథముచేసెను. పండితుడైన మనుష్యుడు స్వల్ప విషయములో వృథాగా శపథము చేయరాదు. వృథాగా శపథముచేసినేని ఈ లోకమందు దుఃఖపడి నశించును. స్త్రీ విషయమందును, వివాహవిషయమందును, గోవుల మేత విషయమందును, సమిత్తుల విషయమందును, బ్రాహ్మణులకు మేలు కలుగు విషయమందును శపథము చేసిన దోషముల పాతకములేదు" అని బోధింపబడియున్నది. వాసిష్ఠసూత్ర

ములను గౌతమ సూత్రములను జదివి చూచినపుడు పయివాక్యము లందబద్ధపు ప్రమాణమే సూచింపబడుచున్నది. ,,తాను చూచిన దానిని వినిన దానిని సత్యముగా జెప్పవలయును: సత్యముగా నున్నప్పటికి నొకనికి అనిష్టమైన (హానికరమైన) దానిని జెప్పరాదు. ప్రియముగా నున్నను అసత్యమును జెప్పరాదు. ఇది వేదమందు పురాతనమైన ధర్మమని చెప్పబడుచున్నది'' (మనుస్మృతి 4అ 138).

అన్ని విధములైన యబద్ధములు పయిన నుదాహరింపబడిన మిషలలో నిమిడియున్నవి. అవసరమువచ్చినపుడు దాదాపుగ నన్ని విషయములందును అబద్ధమాడవలయుననేగదా వారు బోధించినది?

పయిబోధలకు ప్రతికూలమైన బోధలునుగలవు. ప్రశ్నోపనిషత్తులో,—

శ్లో॥ సమూలోవాఏష పరిశుష్యతి యోఽనృతమభివదతి॥

అర్థము॥ ,,ఎవడబద్ధములాడుచున్నాడో వాడు వేరుతో నాశనము జెందును'' అనియు తైత్తిరీయోపనిషత్తు, శిక్షావల్లి, 11వ అనువాకములో,—

శ్లో॥ సత్యంవద। ధర్మంచర। సత్యాన్నప్రమదితవ్యమ్।
ధర్మాన్నప్రమదితవ్యమ్॥

అ॥ ,,సత్యమును పలుకుము. ధర్మమును నాచరింపుము. సత్యమునకు పరాకుజెందకుము. ధర్మమునకు పరాకుజెంచకుము'' అనియు మనుస్మృతి, 4వ అధ్యాయములో,—

శ్లో॥ పరిత్యజేదర్థకామౌయౌస్యాతాంధర్మవర్జితౌ।
ధర్మంచాప్యసుఖోదర్కంలోకవికృష్టమేవచ॥176॥

,,అర్థ కామములు ధర్మమునకు విరోధములైన యెడల త్యజింపవలెను. ఉత్తర కాలమునందు దుఃఖమిచ్చునదియు లోకవికృష్టమైనదియునైన పక్షమున ధర్మమునుగూడ త్యజించుము'' అనియు ప్రతిపాదింపబడియున్నది.

క్రీస్తు పై ఋషులకు భిన్నముగా మీ ప్రాణము పోయినను మీ రెప్పుడును అబద్ధమాడకూడదని బహు ఖండితముగా బోధించెను. ఇందుకు ఋజువులు: ,,నరహత్య చేయవద్దు, వ్యభిచరింపవద్దు, దొంగిలవద్దు, అబద్ధసాక్ష్యముపలుకవద్దు, తలిదండ్రులను సన్మానించుము, నిన్నువలె నీ పొరుగువాని ప్రేమింప

వలెను" (మత్తయి 19: 18). "నీవు అప్రమాణముచేయక, నీ ప్రమాణములను ప్రభువునకు చెల్లింపవలెనని పూర్వికులతో చెప్పబడిన మాట మీరు విన్నారు. అయితే నేను మీతో చెప్పేది ఏమనగా, ఎంత మాత్రము ఒట్టు పెట్టుకొనకుడి మీ మాట అవును అవును, కాదు కాదు అన్నదైయుండవలెను; వీటిని మించునది దుష్టుని నుంచి పుట్టును". (మత్తయి 5: 33, 37). "ఉపకారము చేయుటకు అసత్యమును కల్పింపరాదు" (రోమా 3: 8; 6: 1, 15). "మిక్కిలి కొంచెములో నమ్మకముగా నుండు వాడు ఎక్కువలోను నమ్మకముగా నుండును, మిక్కిలి కొంచెములో అన్యాయముగా నుండువాడు ఎక్కువలోను అన్యాయముగా నుండును" (లూకా 16: 10). ఇది యట్లుండనిండు.

"బ్రాహ్మణుడు నిరభ్యంతరముగా శూద్రులని ఆస్తి తీసికొనవచ్చును. ఎందుకనగా శూద్రునికి ఏ వస్తువును చెందదు అతని యాస్తిని అతని యజమానుడు తీసికొనవచ్చును" (మనుస్మృతి, 8: 417). "శూద్రునికి సలహాచెప్పరాదు. బలియర్పింపగా మిగిలిన యన్నమును నేతిని ఇయ్యరాదు. అతనికి ధర్మశాస్త్రమును గాని మతాచారములనుగాని యెవరును నేర్పరాదు. ఎందుకనగా వానిని నేర్పువాడును ఆ శూద్రుడునుగూడ అసంవృత్తమను నరకములో బడుదురు" (మనుస్మృతి 4అ: 80, 81).

ఈ బోధ లెంత విపరీతములై యున్నవో చూడుడు. అయినను, ఈ బోధలకు ప్రతికూలమగు బోధలునుగలవు. అన్నపూర్ణోపనిషత్,—

"ఆత్మవత్సర్వభూతానిపరద్రవ్యాణిలోష్టవత్ ।
స్వభావాదేవనభయాద్యఃపశ్యతిసపశ్యతి॥

"అన్ని జంతువులను తనవలెను, ఇతరుల ధనమును మట్టి యుంటవలెను, ఇట్లు భయముచేతగాక స్వభావముచేతనే యెవడెంచుచున్నాడో వాడు నిజమైన తెలివిగలవాడు," అనియు, శారీరకోపనిషత్,—

"అయంబన్ధురయంనేతి గణనాలఘుచేతసా।
ఉదారచరితానాంతువసుధైవకుటుంబకమ్॥

"వీడు నా చుట్టము, వీడు నావాడు కాడు, అనునట్టి భేదబుద్ధి నీచబుద్ధులకు నుండును. గొప్పబుద్ధిగలవారిచే నీప్రపంచమునందుండు వారందఱు నొకటే కుటుంబముగా నెన్నబడుదురు" అనియు చెప్పబడియున్నది.

ఇవ్విధముగా, ఈ దేశపు ఋషులలో కొందఱు బోధించిన దానిని మఱి కొందఱు ఖండించుచు, కొంద ఱు సిద్ధాంతీకరించిన దానిని మఱి కొందఱు పూర్వపక్షము చేయుచు నుండిరి. అందుకు భిన్నముగా, మనుష్యులంద ఱను ప్రేమింపవలెనని యేసుక్రీస్తు బోధించియున్నాడు. దేవుని యాజ్ఞలలో గొప్పదేదియని ఒకనాడొక పండితుడు క్రీస్తు నడిగెను అందుకు ఆయన— ,,నీ పూర్ణహృదయముతోను నీపూర్ణాత్మతోను నీపూర్ణ మనస్సుతోను నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెననేదే. ఇది ముఖ్యమైనదియు మొదటిదియు నైన ఆజ్ఞ. నీవు నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమింపవలెననే రెండవదియు దానివంటిదే'' అని అతనితోనెను (మత్తయి 22: 37–39). మన హృదయ సంపూర్తితో దేవుని ప్రేమించుచు, మనలను మనము ప్రేమించుకొనునట్లు మన యిరుగు పొరుగు వారిని ప్రేమించుటకన్న నధికముగా గోరుట నిష్ఫలము. ఈ ద్వివిధమగు ప్రేమను సంపూర్ణముగా గ్రహించి బోధించినవాడు యేసుక్రీస్తే. ఈ విషయమై దేవుని బోధ వినుడి. ,,నీ పొరుగు వాని ఇల్లు ఆశింపవద్దు. నీ పొరుగు వాని భార్యనైనను, అతని దాసునైనను, అతని దాసినైనను, అతని ఎద్దునైనను, అతని గాడిదనైనను, నీ పొరుగు వానికి కలిగినదేనినైనను ఆశింపవద్దు''. ఇది యట్లుండనిండు.

మన దేశములో మత స్థాపకులకు ,,ఆచార్యుడు'' అను నామ మిడుదురు. ఆయాచార్యపదమును ధరించుటకు క్రీస్తు యేసే తగినవాడు. ఎట్లనిన, తైత్తిరీయోపనిషత్తు, శిక్షావల్లి, 11వ అనువాకములో,—

శ్రు॥ ఆచార్యదేవోభవ॥

,,ఆచార్యుడే దేవుడ''ని యున్నది. ఆపస్తంబధర్మ సూత్రములు, 6వ ఖండ, 1వ ప్రశ్నలో,—

సూ॥ దేవమివాచార్యముపాసీత॥

,,ఆచార్యుని దేవునివలె సేవింపదగినది'' అని చెప్పి యున్నది. ఈ సిద్ధాంతము మిగుల సత్యమైనదే. ఎందుకనిన, ఆచార్యుడు దేవుడైయుండిన గాని దేవుని సంకల్పమందున్న సంగతులను బయలుపఱచి కఱపి దేవుని శిష్యులనుగా జేయ జాలడు. దేవుడయిన వాడే యాచార్యుడుగా నుండవలయును. ఇదిగాక, క్రీస్తు ,,దేవుని వాక్యము'' అని పిలువబడుచున్నాడు. కాబట్టి, దేవుని వాక్యము దేవుని స్వభావమును ప్రతిఫలింపజేయును.

ఖండింపలేక, ఆచార్యశబ్దార్థమును వినుడి. లింగపురాణములో,—

శ్లో॥ స్వయమాచరతే యస్తు ఆచారే స్థాపయత్యపి।
ఆచినోతి హి శాస్త్రార్థానాచార్య స్తేనచోచ్యతే॥

„తాను ఆచరించుచు ఆచారమును స్థాపించుచు శాస్త్రమునందుగల విషయమును గ్రహించి సమకూర్చుటచేత ఆచార్యుడని చెప్పబడెను" అని చెప్పబడియున్నది. అవ్విధముగా జరిగించిన యాచార్యుడెవడు? నిజమునకు యేసు గురు డొక్కడేగాని మఱొకనిని గానము. ఈ లోకమున ఆచార్యుడని పేరు పెట్టుకొనిన వారందఱిలో సత్యదేవోక్తులను తాను దేవుని యొద్ద నేర్చుపొంది వానిని బ్రచురింపజేయుచు, వాని ప్రకారము ప్రజలను ఆచరింపజేయుచు, తాను త్రికరణ శుద్ధిగా సంతోషముతో నాచరించుచునుండిన వాడు యేసు నాథు డొక్కడే కన్పించుచున్నాడు. ఇందుకు లేఖనములు—„నేను నా తండ్రి యొద్ద చూచి యున్నది పలుకుచున్నాను" (యోహాను 8: 38). „నేను దేవుని యొద్దనుండి బయలుదేరి వచ్చియున్నాను". (యోహాను 8: 42). „దేవుడు పంపినవాడు దేవుని మాటలు పలుకును; దేవుడు పరిమితిలేకుండ ఆత్మను ఇచ్చును" (యోహాను 3: 34). „బుద్ధి విజ్ఞానముల సర్వసంపదలు ఆయన యందే గుప్తములైయున్నవి. (కొలె 2: 3). „నేనును తండ్రియును ఏకమైయున్నాము" (యోహాను 10: 30) „నేనే మార్గమును, సత్యమును, జీవమునైయున్నాను. నా ద్వారానే కాని ఎవడును తండ్రియొద్దకు రాడు" యోహా 14: 6) అని పలుకుచున్నవి. అది యట్లుండనిండు.

క్రీస్తునుగూర్చి యొక హిందూగ్రంథకర్త వ్రాయునది వినుడి

„మతమునకు పరిశుద్ధ హృదయమును పరిశుద్ధవర్తనమును, సర్వజనసౌభ్రాత్రమును, ఈశ్వరభక్తియు ప్రధానములు గాని నిరర్థకములైన బాహ్యకర్మలును, బాహ్యవేషధారణములును ముఖ్యములు కావన్నది జీసస్సు చేసిన బోధ యొక్క సారాంశము. ఇంచుమించుగా నిటువంటి సిద్ధాంతములనే యప్పుడప్పు డుపదేశించుచు వచ్చిన వారొకానొకరుండుచు వచ్చిరి కాని తమ యుపదేశముల ననుష్ఠానములో జూపిన వారు మాత్రము కాన రారు. సర్వము ననుష్ఠానములో నున్నది కాని యుపదేశములో నేమియులేదు. వెనుకటి వారివలె కేవలోపదేశముతో తృప్తినొందియుండక జీసస్ తానుపదేశించిన దాని నెల్ల ననుష్ఠించి చూపెను. సత్యమెప్పుడు నుపదేశ కాలమునకంటె ననుష్ఠానమునం

దే లోకమున కధికోపకార దారకమగును ఎవ్వడు మాటలలోను చేష్టలలోను ధర్మము ననువర్తించునో, ప్రాణము పోయినను ధర్మమును విడువకుండునో, అట్టి వాడొక్కడే లోకములో సర్వజనులకును పూజనీయుడగును" (జీసస్ చరిత్ర, పుట 19).

వెక్కియను చరిత్రకారు డిట్లు వ్రాసియున్నాడు,—

"లోకమునందు పదునెనిమిది శతాబ్దములలో నెన్ని మార్పులు కలిగినను మనుష్యుల హృదయములలో స్వచ్ఛమయిన ప్రేమ విస్తారముగా పుట్టినట్లు చేయగల పురుషునిగూర్చి క్రీస్తు మతము మాత్రమే మనుష్యులకు కనపరుపగలిగి యున్నది. ఆయన సకల కాలములందును సకల స్థితులలోను ఉండిన పరిపరి స్వభావములు గల మనుష్యుల హృదయములను స్వాధీనపరుచుకొన గలిగియున్నాడు. ఆయన లోకమునకు చేసిన మేలు అపారమయినది. శాస్త్రజ్ఞులందరును లోకమునకు చేయ గలిగిన మేలంతటికంటె ఆయన మూడేండ్లు మాత్రము కష్టపడుటవలన చేయ గలిగిన మేలు చాల ఎక్కువైయున్నది". ఇట్టి సాక్ష్యము లనేకములున్నను గ్రంథ విస్తరభీతిచే వానిని విడిచి పెట్టుచున్నాము. ఇట్టి దివ్యోపదేశకుడగు యేసు మనకు భక్తి పహాయుడుగా నుండదగునుగదా.

## 8 వ ప్రకరణము.

## క్రీస్తు యజ్ఞమే పాపనివృత్తియనుటను గుఱించి.

అద్భుతమయిన పుట్టుక కలవాడును, అఖండమైన పరిశుద్ధత కలవాడును, అద్భుతమైన కార్యములు కలవాడును, అద్భుతమైన బోధలుగలవాడును, అగు క్రీస్తుయేసు అద్భుతమయిన మరణమునుకూడ బొందెను.

ప్రాయశ్చిత్తములేనిది పాపము క్షమింపబడనేరదు. తప్పుచేసినవాడు ఆ తప్పును బట్టి శిక్ష నొంది యేలాగు దానిని క్రమపరుపకపోయిన పక్షమున లోకవ్యవహారములలో కష్టములు కలుగును. ఆ విషయము మన కందఱకును స్వాభావికముగా దెలిసిన సంగతియైయున్నది. నేరస్థుడు శిక్ష నొందకపోయిన పక్షమున మానవులలో న్యాయము చెడును. మనుష్యుల విషయములో నిట్లుండగా పాపమునే మాత్రము సహింపలేని దేవుని విషయములో అది మఱింత రూఢిగా నట్లుండునుగదా? శిక్షలేనిదే పాపము క్షమింపబడనేరదని మను

ష్యులు మొదటినుండి స్వాభావికముగా తెలిసికొని యొప్పుకొనుచున్నారు అసత్యమును బైబిలుకూడ నిర్ధారణచేయును.

పాపపరిహారార్థమై చేయబడు సత్క్రియ ప్రాయశ్చిత్తమనబడునని హిందూగ్రంథములు వ్రాయుచున్నవి. కూర్మపురాణము.

శ్లో॥ అకృత్వావిహితంకర్మకృత్వానిన్దితమేవవా।
దోషమాప్నోతిపురుషః ప్రాయశ్చిత్తంవిశోధనమ్॥

"పురుషుడు అనుకూలించిన కర్మను జేయకను, దూషింపదగిన దానిని జేసియును పాపమును బొందుచున్నాడు. ప్రాయశ్చిత్తము (శిక్ష) శుద్ధిని గలుగజేయునది".

కాబట్టి, పాపనివృత్తికయి ప్రాయశ్చిత్తము మిక్కిలి యవసరమనుట నిర్వివాదాంశము. అదియట్లుండనిమ్ము సత్యవేదపు ఋషులు క్రీస్తు మరణమునుగూర్చి బహుగా భవిష్యోక్తులు ప్రవచించియుండిరి. క్రీస్తు పాపులకొఱకు ఖండింపబడునని బైబిలు పూర్వభాగములో (కీర్తన 22; యెషయా 53అ; దానియేలు 9: 26) బహుగా వర్ణింపబడియున్నది. ఈ ప్రవచనములన్నియు దేవుని ప్రధానవాగ్దత్తములో (ఆదికా. 3: 15) నిమిడియున్నవి.

ఇదియుకాక, క్రీస్తు తన శిష్యులతో తన మరణమునుగూర్చి పదే పదే బోధించుచుండెడివాడు. "నేను గొఱ్ఱెలకొఱకు నా ప్రాణమును పెట్టెదను" (యోహాను 10: 15) "నా ప్రాణమును ధారబోసి మరల బ్రతికెదను గనుక తండ్రి నన్ను ప్రేమించుచున్నాడు (యోహాను 10: 17) అలాగే మనుష్యకుమారుడు ఉపచారము చేయించుకొనుటకు రాలేదు గాని యుపచారము జేయుటకును అనేకులకు ప్రతిగా విమోచన క్రయధనముగా తన ప్రాణము నిచ్చుటకును వచ్చెనని" చెప్పెను. (మత్తయి 20: 28.) మఱియు, (లూకా 18: 31, 33; మత్తయి 26: 2) వచనములను చూడుము.

ఇది యుట్లుండగా, క్రీస్తునకును పేతురునకును జరిగిన సంభాషణము వినుడి: "అప్పటినుండి యేసు తాను యెరూషలేమునకు వెళ్ళి పెద్దలచేతను ప్రధానయాజకులచేతను శాస్త్రులచేతను అనేక హింసలుపొంది, చంపబడి, మూడవ దినమున లేపబడుట అగత్యమని తన శిష్యులకు అగుపఱుపనారంభించెను. అప్పుడు

పేతురు ఆయనను పట్టుకొని, ప్రభువా, అది నీకు దూరమగు గాక, అది నీకు ఏ మాత్రము కలుగదని ఆయనను గద్దింపనారంభించెను. అయితే ఆయన తిరిగి, సైతానా, నా వెనుకకు పొమ్ము; నా ఆటంకము నీవే; నీవు మనుష్యుల వాటియందే కాని దేవునివాటియందు మనస్కరింపవని పేతురుతో చెప్పెను" (మత్తయి 16: 21-28). దీనిని బట్టి చూడగా, యేసు చనిపోవకయుండునట్లు ప్రధాన శిష్యుడయిన పేతురు కోరినపుడు అతడు సైతానువలెనున్నాడనుచు వాతని బహుగా గద్దించెను.

ఇంతియేకాక, క్రీస్తు మూడవదినమున మృత్యుంజయుడై లేచిన తరువాతకూడ తన మరణమును గూర్చి తెలుచుగ ప్రశంసించెడువాడు. ఒక పర్యాయము ఆయన తన శిష్యులతో నిట్లనెను: ,,అంతట ఆయన మోషే ధర్మశాస్త్రములోను ప్రవక్తల గ్రంథములలోను కీర్తనలలోను నన్నుగూర్చి వ్రాయబడిన వన్నియు నెరవేరవలెనని నేను మీ యొద్దనుండి మీతో చెప్పిన మాటలు ఇవే అని వారితో చెప్పెను అప్పుడు వారు లేఖనములు గ్రహించునట్లుగా ఆయన వారి మనస్సును తెరచి క్రీస్తు శ్రమపడి మూడవ దినమున మృతులలోనుండి లేచుననియు యెరూషలేము మొదలుకొని సమస్త జనులలో ఆయన పేరిట మారు మనస్సును పాపపరిహారమును ప్రకటింపబడుననియు వ్రాయబడియున్నది అని చెప్పెను. (లూకా 24: 44-47) ఈ విధముగా, మనుష్యులందరి పాపములకొఱకు తగిన ప్రాయశ్చిత్తము చేయుటకై క్రీస్తు శ్రమపడి చనిపోయెను.

క్రీస్తు ఈ లోకములో ఉన్నకాలమున శ్రమపడెనని తెలిసికొనవలెను. ఆయన మనుష్యుల కష్ట దుఃఖములన్నియు అనుభవించుకొనెను. అంతేకాక, విరోధులాయన నెడ తెగకుండ హింసించుచుండిరి. (హెబ్రీ 12: 3) నిష్కళంకుడైన క్రీస్తు ఈ లోకకల్మషములలో నివసించి తిరుగుట ఆయ కెంత బాధకరముగా నుండునో దాని నూహింపగలవారెవరు? ఆ శ్రమలాయన జీవితకాలాంతమందు మిగుల అధికమాయెను. గెత్సెమనె వనమునందాయన పొందిన వేదనయును (మత్త. 26: 47-56), శత్రువు లాయనకు గలుగజేసిన యవమానమును యూదుల యధికారులవలనను, రోమన్ గవర్నరు వలనను విమర్శింపబడి, యన్యాయముగ బొందిన సిలువ మరణమును (మత్తయి 26; 57; 27; 51) ఆయన శ్రమల యుత్కృష్టస్థితిని జెప్పుచున్నవి.

ఈ శ్రమలు ఆయనకు హఠాత్తుగా వచ్చినవనియు, వానివలన ఆయన పని నిరర్థకమైనదనియు తలంచుకొనరాదు. వీనిని పొందుటకే యాయన యీ లోకమునకు వచ్చెను (మత్తయి 20: 28). క్రీస్తు ముందుగానే యెతిగియున్నట్లు దేవుని సంకల్పము చొప్పున అవి జరిగెను (1 పేతు 1: 19-20). అట్టి శ్రమలు కలుగునని యాయన తన శిష్యులతో ముందుగా చెప్పి, వానిని పొందుటకు స్వతముగా వెళ్లెను. ఆయన ప్రాణమును నెవడును తీసికొనలేదు; తీసికొనజాలడు. ఆయనే స్వయముగా దానిని పెట్టెను. (యోహా. 10: 18). ఆయనను పట్టుకొనలేక పోయెను (యోహా. 18: 6; మత్త. 26: 13-54). తాను మన పాపములకు తగిన శిక్షనుపొంది, వానిని భరించుకొనులాగున తన్ను పట్టుకొనుటకును, చంపుటకును ఆయనే వారికి సెలవిచ్చెను. (లూకా 24: 46). ఇది యిట్లుండనిమ్ము.

"ధర్మశాస్త్ర ప్రకారము సమస్త వస్తువులును రక్తముచేత శుద్ధిచేయబడుననియు, రక్తముచిందింపకుండ పాపపరిహారము కలుగదనియు సామాన్యముగా చెప్పవచ్చును" (హెబ్రీ 9: 22). ఇది బైబిలుయొక్క మూల సిద్ధాంతము.

బలులు, యజ్ఞములు చెల్లింపకుండ పాపముక్షమింపబడదని పైవచనమునకు తాత్పర్యము. ఈ సిద్ధాంతము, పారసీకులలోను, చీనావారిలోను, రోమావారిలోను, హూణులలోను హిందువులలోను గలిగియున్నది. దాదాపుగా అన్ని దేశములలోను అన్ని జనాంగములలోను పూర్వమునుండి బల్యర్పణలర్పించువాడుక సాధారణముగా గలదు. పూర్వకాలపు హిందువులు గోవులు మొదలయిన వానితో బహుయాగములు చెల్లించినట్లు వేదములవలనను, పురాణములవలనను కానవచ్చుచున్నది. యాగములను సూచింపని మంత్రమొక్కటియైనను వేదములలో లేదు. మఱియు, వేదములోని సిద్ధాంత భాగముకూడ యాగములు ప్రధానమైనవని చెప్పుచున్నది. ఆ యా వేద బ్రాహ్మణములలోను మండలములలోను యజ్ఞములను గూర్చి "ప్రథమానిధర్మాణి," "యజ్ఞే సర్వం ప్రతిష్ఠితం," "యజ్ఞోవైసుతర్మానౌః," "యజ్ఞేనహిదేవాదివంగతాః," "ఋతస్యవఃపథానయాతివిశ్వానిదురితా" అని వేదములయందు వ్రాయబడియున్నది. యజ్ఞములు కర్మలన్నిటిలో ప్రధానమైనవనియు, అవి సర్వము ననుగ్రహించుననియు, అవి సుకరముగా తరింపజేయునావలైయున్నవనియు, వానివలె ననేక దేవతలు స్వర్గమును పొందిరనియు, అవి సర్వ పాపములను తొలగించి

సురక్షితముగా స్వర్గమునకు తోడుకొనిపోవుననియు' పయి వాని కర్థము. భగవద్గీతలు, 3వ అధ్యాయములో,—

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాసృష్ట్వాపురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేషవో౽స్త్విష్టకామధుక్ ॥
సర్వేప్యేతేయజ్ఞవిదోయజ్ఞక్షపితకల్మషాః।
యజ్ఞశిష్టామృతభుజోయాన్తి బ్రహ్మసనాతనమ్॥
నాయంలోకో౽స్త్యయజ్ఞస్యకుతో౽న్యఃకురుసత్తమ॥

,,యజ్ఞములు, అగ్నియందే ప్రజలతోగూడ ప్రజాపతివలన సృజింపబడి సమస్తమయిన కోరికల నిచ్చుననియు, యజ్ఞములవలన పాపక్షమను బొంది శాశ్వత బ్రహ్మ లోకమును జెందవచ్చుననియు, అవి లేని వారికి ఇహపరలోకములు లేవనియు'' జెప్పియున్నది.

ఇదియుకాక, మహమ్మదీయులలోగూడ యజ్ఞ కర్మను సూచించు విశేషాచార మొకటి కలదు వారి సంవత్సరములో మిగుల ముఖ్యమయినది ,,బకి రీదు'' అను పేరుగల పండుగ. దానికి ఈ దిఖో ర్బాను, యీదుల్ జుహ (బల్యర్పణ పండుగ) అను నామములు గలవు. వారికి అది మిగుల పుణ్యకరమైనదియు ప్రతి మహమ్మదీయుడు నాచరింపవలసినదియునైయున్నది.

మహమ్మదు వారు ఈ పండుగను స్థాపన చేసినప్పుడు రెండు మేక పిల్లలను తెప్పించి వానిలో నొక దానిని మతస్థుల నిమిత్తమును, రెండవ దానిని తన నిమిత్తమును తన కుటుంబ నిమిత్తమును దేవునికి బలిగానర్పించెను. ఇందునుగూర్చి అయిషా అను నామె తన భర్తయగు మహమ్మదుగారివలన స్వయముగా విని, ,,ఆ పండుగనాడు రక్తము కార్చుటకన్న నెక్కువకార్యము లేదు ఆ రక్తము నేల కారకముందు దేవుడు దానిని అంగీకరించును. దేవుడు ఉత్తర లోకమందు మనుష్యుల పాపపుణ్యములను తూచి ప్రతిఫలమిచ్చు దినమందు యజ్ఞముగా నర్పింపబడిన పశువు స్వశరీరముతో లేచివచ్చి యర్పించినవాని పుణ్యపు త్రాసు కొమ్మును భారముగా తూగునట్లుచేయును, గాన అందు నిమిత్తము సంతోషించుడి'' అని చెప్పెనట. ఇంకను కొందఱు మహమ్మదీయులు ఉత్తరలోకమందు బ్రతి జీవిదాటవలసిన పుల్ సరాతను నత్యుచ్చ మార్గము గుండ అర్పణ పశువే సురక్షితముగా గొంచుపోవలసియున్నదని చెప్పుదురు

ఆ పండుగ నాడు వారు చేయు "వజా" అను పేరు గల హస్త పాదములు మొదలగు ప్రక్షాళనలో, ఓ దేవా! ఈ బల్యర్పణను మా పాపపరిహారముకొఱకు అంగీకరించి మా లోని దుర్మార్గమును గిసివేసి మా మతమును పవిత్రము చేయుమని స్మరింతురు. ఆ దినమునకు నేర్పడిన యుపన్యాసములో నిట్టి బల్యర్పణ వలన, గతించిన యేబది సంవత్సరములలోని పాపములును ముందు రాగల యేబది సంవత్సరములలోని పాపములును క్షమింపబడునని చెప్పియున్నది. వారా పండుగ నాడు శ్రేష్ఠమైనట్టి మేకనుగాని పొట్టేలునుగాని గోవునుగాని లొట్టి పిట్టనుగాని బలిగానర్పింతురు. అది యట్లుండనిమ్ము.

పూర్వకాలమందు యోహోదీయులనబడు నొక జాతివారు తమ పాప పరిహారముకొఱకు ప్రతి దినము ప్రతి వారము ప్రతి సంవత్సరము గోవులు గొఱ్ఱెలు మొదలైన వానిని దేవునికి బలిగా చెల్లించినట్లు బైబిలు వేదము చెప్పుచున్నది. అవి, అపరాధ పాపపరిహార యాగములనియు, ఆరోహణ మంగళ యాగములనియు నామములుగలవి. వారు విశేషముగా బల్యర్పణల మూలముగానే దేవుని నారాధించిరి.

క్రీస్తు మతసిద్ధాంతముగూడ సర్వత్రులకు సర్వకాలములయందు యజ్ఞ మూలముగానే ముక్తికలుగవలసినదనియు వక్కాణింపుచున్నది. అయినను, పాపమెఱుగని పశువేల మనకు బదులుగా వధింపబడవలెననియు, అజ్ఞాన పశువుల రక్తము నరుల పాపములను పరిహరింపకలుగునా యనియు శంక పుట్ట వచ్చును. అవును, నిజమే; అవి యే మాత్రమైనను పాపములను పరిహరింపజాలవు. దేవుడు, ఈ యజ్ఞములను నుపమానార్థములగాను ఛాయారూపముల గాను నొక విశేష తాత్పర్యముతోను ఏర్పఱిచియున్నాడు. అవి యట్టి భావముతో ఏర్పడక పోయిన యెడల నిరర్థకమైనవనియు నిష్ప్రయోజనకరమైనవనియు చెప్పవలసియుండును. ఈ బల్యర్పణలు బహు జనాంగములలో వ్యాపించియుండుటనుబట్టి చూడగా, దేవుడే యాదియందు వీనిని నేర్పాటుచేసినట్లు నిస్సందేహముగా స్ఫురించుచున్నవి. ఈ విధముగా జనులు వీనిని ఆర్పించుటనుబట్టి యాలోచింపగా వారు తాము పాపులమనియు తమ పాపములకు శిక్ష తప్పక సంభవించుననియు తమకు బదులుగా మఱియొకరు శిక్షబొందుట యవసరమనియు నమ్ముచున్నట్లు కనబడును. కాని జనులు క్రమముగా కొంతవఱకు వాని నిజోద్దేశమును అంతరార్థమును మఱచిపోయి వేఱయిన భిన్నాభిప్రాయములతో బల్యర్పణలు చేయుచున్నారు. ఇవి యెందుకేర్పడినవో

ఏ మహా పురుషునిగూర్చి సూచించుచున్నవో యా సంగతినిగూర్చి బైబిలు గ్రంథముయొక్క ఉత్తరభాగమందు విశదపఱుపబడియున్నది. సర్వేశ్వరుడు మానవకోటికి మొదటివారగు స్త్రీ పురుషులను పరిశుద్ధులనుగా సృజియించెను. అనంతరమువారీశ్వరాజ్ఞను మీరి పాపులైరి. కాబట్టి దేవుడు తన అఖండ న్యాయము చొప్పున వారిని నరక పాత్రులనుగా శపించెను. అయినను, ఆయన తన కరుణాబాహుళ్యము చొప్పున వారితో మీ పాపములకును మీ సంతతిలోని వారి పాపములకును పరిహారమునకుగా ఒక రక్షకుని పంపుదునని సెలవిచ్చి వాగ్దానమొసంగెను. ఆ వాగ్దాన పురుషుడు భూమియందు వెలయు వఱకును ఆయనకు ముంగుర్తులుగా బల్యర్పణలను చెల్లించుటకు దేవుడాజ్ఞాపించెను. ఆ చొప్పున పూర్వకాల భక్తులు ఆ మహా రక్షకుడు వేంచేయువఱకు వాసిని అనేక వేల సంవత్సరము లాచరించిరి. ఇప్పటికి సుమారు రెండు వేల వర్షముల క్రిందట దేవుని ప్రియ పుత్రుడగు యేసుక్రీస్తు శరీరధారియయి భూమియందవతరించెను. ఆయన ముప్పదిమూడు సంవత్సరము లవతారమందుండి, అనేకాద్భుతములను జేసి పరమార్థములను బోధించి, దోషరహితుడును పరిశుద్ధమూర్తియునై, మనుష్యులందఱి పాపపరిహారార్థమయి యజ్ఞ పశువుగా ప్రాణమర్పించెను. ఈ రక్షకునిగూర్చి సూచించుటకే యీ యజ్ఞ యాగము లేర్పడినవి. ఇది కొంత సేపు అట్లుండ నీయుడి.

ఆర్య భ్రాతృవరులారా! ఈ సత్యమును మన దేశపు వేదఋషులుకూడ జాల భాగము కనుపెట్టియున్నట్లుకనిపించుచున్నది. ఈ యజ్ఞమున కింతయాధిక్య మొందువలనగలిగినదనిన సామవేద తాండియ మహాబ్రాహ్మణములో ఇట్లున్నది:

శ్రు॥ ప్రజాపతిర్దేవేభ్యఆత్మానంయజ్ఞం।
కృత్వాప్రాయచ్ఛత్॥ (బంగాళాపత్రం. 410)"

ఈ జగత్తునకు సృష్టికర్తయు, రక్షకుడు, అయినట్టియు "సృష్టికి పూర్వమే కలిగిన పురుషుడును" విశ్వకర్మయును నయియున్న ప్రజాపతి తన్నుదానే యాగపశువుగా నర్పించుకొనె ననుటయే యీ యజ్ఞము ముఖ్యమైనదనుటకు హేతువు. ఈ యభిప్రాయము ఋగ్యజుస్సామములను మూడు వేదములయందును మొదటినుండి చివరవఱకును కానబడుచున్నది.

* దైవ పురుషుడు తన్నుదానర్పించుకొనిన సెడి యంశము వేదవచనములయందు నరుదుగను నొకచోటను మాత్రమే చెప్పబడియుండలేదు. అలాగైన యెడల

అట్టులకే ఏదో యొక యర్థము చెప్పి యీ బాధను నివారణ చేయవచ్చును. కొన్ని చోట్ల గూఢముగను, కొన్నిచోట్ల *విశదముగను, కొన్ని చోట్ల సూచనగను నాలుగు వేదములయందును చెప్పబడియున్నది. ఈ విషయమై మొత్తమున విచారింపగా, దైవ పురుషుడు తన్నుదాను యాగముగా నర్పించుకొనెను అను సిద్ధాంతము ముఖ్యమైనదయియుండి అది యజ్ఞకర్మలను శ్రద్ధగా జేయవలసినందుకు ఏర్పాటుపబడిన విధివాక్యములు చెప్పుటకు ముందు నగత్యమును స్పష్టము చేయుచున్నది.

కాబట్టి మిత్రులారా! పాపపరిహారమునకు యజ్ఞము అనగా రక్తము చిందబడుట యవసరమనుట ధ్రువము. ఇదికాక, యజ్ఞము లన్నియు మహాపురుష యజ్ఞమునకు సూచనగానుండి దాని బలము వలన ఫలవంతములైయున్నవనుట కూడ నిర్వివాదాంశమే. ఇందుకు ఋజువులు.

శ్రు॥ యజ్ఞో వాఽవతితస్యఛాయా క్రియతే॥

(తాండియ మహాబ్రాహ్మణము, వాల్యూము; పుట 332).

„యజ్ఞమే రక్షించుచున్నది. దానియొక్క ఛాయయే జరపబడుచున్నది”.

శ్రు॥ ఆత్మదాబలదాః . యస్యఛాయామృతం
యస్యమృత్యుః॥

(ఋగ్వేదము X మం. 121 సూ. 2 మం) „ఎవనియొక్క ఛాయయును మృత్యువును అమృతమగునో యతని ఛాయా మృత్యువులు ఆత్మదమును బలమును నిచ్చునవియైయుండ నున్నవి” అట్లు కాని యెడల అజ్ఞాన పశువుల యజ్ఞముల కట్టి శక్తి యెక్కడనుండి కలుగును? అవి వట్టి చిల్లిపడవలవలెనుండును.

శ్రు॥ ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః॥

(ముండకోపనిషత్తు 2వ ఖండ, 7వ మంత్రము) „ఈ యజ్ఞరూపములైన ఉడుపములు (తెప్పకొయ్యలు) గట్టివికావు” స్కాందపురాణము, యజ్ఞ వైభ

---

*ఇట్లు చతుర్వేద పండిత శిరోమణియగు కృష్ణమోహన్ బెనర్జిగారు వ్రాయుచున్నారు. ఈ సంగతి తెస్సగా దెలిసికొనుటకు ఆయన రచించిన „క్రీస్తుమతమునకును హిందూమతమునకును సంబంధము” అను పుస్తకమును సంపాదించి చదువుడి. దీని వెల రు. 0—0—6 మాత్రమే.

వ ఖండమున, 7వ అధ్యాయము: శ్లో॥ ప్లవాహ్యేతే సురా యజ్ఞా అదృఢాశ్చన సంశయః॥ (స్కాందపురాణము, యజ్ఞవైభవ ఖండమున 7వ అధ్యాయము) “దేవతలారా! ఈ యజ్ఞములు తెప్పలవంటివి; ఈ విషయమందు సందేహములేదు”. బైబిలు చెప్పునది వినుడి.

“ధర్మశాస్త్రము రాబోవుచున్న మేలుల ఛాయగలదియే కాని ఆ వస్తువుల నిజస్వరూపము కలది కాదు గనుక ఆ యాజకులు ఏటేట ఎడతెగకుండ నర్పించు నొక్కటే విధమయిన బలులు వాటిని తెచ్చువారికెన్నడును సంపూర్ణసిద్ధి కలుగచేయనేరవు. ఎందుకనగా ఎద్దులయొక్కయు మేకలయొక్కయు రక్తము పాపములను తీసివేయుట అసాధ్యము. యేసుక్రీస్తుయొక్క శరీరమొక్కసారియే అర్పింపబడుటచేత ఆ చిత్తమును పట్టి మనము పరిశుద్ధపరచబడియున్నాము” (హెబ్రీ 10: 1, 4, 10). ఇవి రాబోవువాటి ఛాయయే కాని నిజస్వరూపము క్రీస్తులోనున్నది” (కొలొ. 2: 17). హెబ్రీ 9: 9; 9: 1'-1 ; 9: 9). వచనములను చదివి చూడుము.

వేదములలో జెప్పియున్న ప్రజాపతియు యేసుక్రీస్తును ఒక్కటే వాయని మీలో నెవరయిన నడుగుదురేమో అందుకు చతుర్వేద పాండిత్య ప్రముఖుడగు క్రిష్ణమోహన్ బెనర్జీగారు చెప్పునది వినుడి “హిందూశాస్త్రములలో ననేకులకు ప్రజాపతి యను పేరు జెందుచున్నది. ముఖ్యముగ బ్రహ్మకు ఈ పేరు పెట్టబడియున్నది. అతని సామాన్యమైన నడవడికయు, ముఖ్యముగ తన పుత్రిక యెడల అతని నడతయును అతనిని ప్రజాపతి ప్రభువని తెలుపుటకు సమర్థములయియున్నవి. ప్రజాపతి యను మాటకు మొదటి యర్థమయియున్న రక్షించుట అను ఉద్యోగమునకు దగినవాడు కాడని తెలియజేయుచున్నది. నిశ్చయముగ అతనిని ప్రత్యేకము దైవముగా ఆరాధింపదగినవాడు కాడని యతనికి దేవాలయము కూడదని పూర్వమే దేవతాశాపమున్నట్లు చెప్పబడియున్నది. కాబట్టి యీ పేరు జెందిన వారిలో నొకని చరిత్రయయిన తన్నుదాను యాగపశువుగా నర్పించుకొనిన లోక రక్షక భావమునకు సరిపోదు. హిందూదేశస్థులుగాని, మరియొక దేశపు వారుగాని యారాధించు దేవతలలో సకల లోక రక్షణకు యాగపశువుగా తన్ను అర్పించుకొన్నట్టు ఎవని గురించియు జెప్పియుండలేదు. మర్త్యామర్త్యుడును నిత్యానిత్యుడును మనుష్యుల నిమిత్తమై తన్ను యాగపశువుగా నర్పించుకొనిన వేద విదితుడైన మహా పురుషుని పేరున

కును, అతని స్థానమునకును, చరిత్ర సాక్షిగా ఈ లోకమునందు పుట్టిన నజరేతువాడైన యేసే తుల్యుడుగనున్నాడని విద్వాంసులందఱికి దెలిసియుండును. ఈ ప్రకారము ప్రజాపతియను పేరు వహించిన ప్రతివాని చరిత్ర, పరీక్షించిన తరువాత చివఱకు యేసే సత్యమైన ప్రజాపతి అనియును, వాస్తవముగ లోక రక్షకుడనియును „దేనివలన మనము రక్షింపబడవలెనో అట్టి నామమును మనుష్యులలో కలిగియున్నవాడు'' నియును స్థాపింపవచ్చును. వేదములలో జెప్పబడియున్న మహా పురుష వర్ణనతో తుల్యమైనవాడు చరిత్రలో ఈయన తప్ప యింకొకడు లేడు. అట్టి మహా పురుషుడను నేనే యని చివఱకు చెప్పుకొనినవాడును లేడు. ఇది యిట్లుండ నిమ్ము.

యేసుక్రీస్తు యజ్ఞములయొక్క సంపూర్తియయి యున్నాడు. దేవుని వాగ్దత్తము చొప్పున ఈయనవచ్చి రక్షణయాగమును సంపూర్తిచేసినాడుగాన వేఱు బల్యర్పణలతో మనకు నిమిత్తము లేదు. „పూర్ణమైనది వచ్చునప్పుడు అపూర్ణమైనది కొట్టివేయబడును'' (1కొరి. 13: 10)ని బైబిలు వాక్యము చొప్పున సంపూర్ణమైన యేసుక్రీస్తుని యజ్ఞము నెఱవేరబడెను గనుక అసంపూర్ణమైన ఛాగాది పశువుల యజ్ఞములతోనిక పనిలేదు. ఈ మహా పురుషుని యజ్ఞము పరమేశ్వర ప్రీతికరమైనదియు సర్వ జన రక్షణకు చాలినదియునైయున్నది. ఈ యేసు రక్షకుని విశ్వసించి ఆయన యుపదేశములను గైకొనువారికి ఆయన నెఱవేర్చిన యజ్ఞ పుణ్యముచేత సర్వ పాపపరిహారమును సకల శుభములును గలిగి చివఱకు మోక్ష ప్రాప్తులగుదురు.

యేసు రక్తము ప్రతి పాపమును పరిహరించి మనలను పవిత్రులనుగా చేయును'' (1యోహా 1: 7).

„దేవుని కృపా మహదైశ్వర్యమును బట్టి ఆ ప్రియునియందు ఈయన రక్తమువలన మనకు విమోచనము అనగా మన అపరాధములకు పరిహారము మనకు కలిగియున్నది'' (ఎఫెసీ 1: 7).

సోదరులారా! పాపరహితుడగు క్రీస్తు పాపులకొఱకు శ్రమపడియుండక పోయినట్టయిన మనుష్యులకు రక్షణలేనేలేదు. యేసు ప్రభువు పాపములేకుండెను గనుక, ఆయన పాపమేధ యాగముకాగలిగెను; ఆయన కేవలము పూర్ణ

పరిశుద్ధుడగుటచేత, మన పాపములను భరింప గలిగెను. దేవుడు తన నీతి న్యాయములకు భంగము కలుగకుండుటకును పాపమానవులను రక్షించుటకును దేవుడే యిట్లొక తారకమార్గ మేర్పఱిచెను.

[1] దేవుడు పరిశుద్ధుడు గనుక పాపమును ద్వేషించును.
[2] దేవుడు న్యాయవంతుడు గనుక పాపిని శిక్షింపవలసి యున్నది.
[3] దేవుడు దయాళుడు గనుక శరణన్న పాపిని కాయవలయును.

అట్లు దేవుడు తన కళ్యాణగుణత్రయమునకు సమన్వయముగా పాపిని రక్షింపవలసియున్నది. దేవుడట్లు చేయక పాపిని ఊరకనే తన దయవలన క్షమించిన యెడల తన పరిశుద్ధన్యాయములను సుగుణములకు లోపము వచ్చును గదా. అట్టి దైవసుగుణములకు సమన్వయముగా పాపికి రక్షణ యేమతమునందును గనిపించుట లేదు. ఒక్క క్రీస్తు మతమునందు మాత్రము కన్పట్టుచున్నది. ఎట్లనిన,—

[1] దేవుని యాజ్ఞలు పరిశుద్ధముగాను, న్యాయముగాను, మంచివిగాను నున్నవనియు, ఆయన న్యాయము చక్కగా నున్నదనియు, పాపము విషయమై దేవునికి కలిగిన రౌద్రము నీతిగా నున్నదనియు యేసుక్రీస్తు తన మరణమువలన గనబఱిచెను. "ఆయన నీతి నిమిత్తము యెహోవా బహుసమ్మతిగా నున్నాడు. ఆయన ధర్మశాస్త్రము గొప్పగాను ఘనముగాను చేయును" (యెషయా 42: 21.)

[2] యేసుక్రీస్తు మరణ యజ్ఞమునలనే దేవుని న్యాయము ఆనందించెను. "కృపయును సత్యమును నొకటి కొకటి ఎదురుకొనినవి. నీతిసమాధానములు ఒకదాని నొకటి ముద్దుపెట్టుకొనినవి." [కీర్తన 85: 10.]

[3] దేవుని కృపవలన మనము రక్షింపబడుచున్నాము. ఈకృపనిజముగ యేసుక్రీస్తు యజ్ఞమూలమున దేవుడు గనబఱచుచున్నాడు. "మన మాయన ద్వారా జీవించునట్లు దేవుడు తన అద్వితీయ కుమారుని లోకములోనికి పంపెను; దీనివలన దేవుడు మన యందుంచిన ప్రేమ కనబడెను. మనము దేవుని ప్రేమించితిమని కాదు, ఆయనే మనలను ప్రేమించి మన పాపములకు శాంతికరుడుగ నుండుటకు తన కుమారుని పంపెను" [1 యోహా. 4: 9, 10.] "పాపము వలన వచ్చు జీతము మరణము కాని దేవుని కృపావరము మన ప్రభువైన క్రీస్తు యేసునందు నిత్యజీవము [మోక్షము]" [రోమా 6: 23.]

ఇక్క డొక ప్రశ్న. యేసుని ప్రాయశ్చిత్తము నిర్నిమిత్తమైనది కాదా? దేవుడు దేవుడే గనుక, ఆయన క్షమింపవలెనని కోరిన యెడల క్షమింపవచ్చును గదా యని కొందఱందురు. దీనికి ప్రత్యుత్తరము. దేవుడు నిజస్థుడు గనుక అబద్ధమాడనేరడు. దేవుడు తన నీతికి విరోధముగా ఏమియు జేయనేరడు. పాపమునకు శిక్షవిధింపవలెనని నియమించిన పిదప శిక్ష లేకుండిన ఆయన మార్పుగలవాడగును. దేవు డట్లుమార్పు వాడయిన యెడల అపూర్ణుడగును. అపూర్ణుడయిన యెడల దేవుడు దేవుడు కాకపోవును. తన దైవత్వమునకే భంగము వచ్చును. కావున, దేవుడు పాపిని ప్రాయశ్చిత్తము లేకుండ ఊరకనే క్షమింపలేడు.

ఆర్యసోదరులారా! దేవుడు న్యాయము చేయవలెను గావున పాపమును క్షమింపగూడదను మాట యిక చెల్లదు. ఏలయనిన, క్రీస్తుచేసిన యజ్ఞప్రాయశ్చిత్తమును బట్టి దేవుడు పాపము నుచితముగా క్షమింపగలడు. దేవుడు ధర్మశాస్త్రము విధించినది యావత్తు క్రీస్తు వలన నెఱవేర్పబడగా దేవు డికను తన న్యాయమును బట్టియు, ప్రేమను బట్టియు పాపములను క్షమింపక తప్పదు. క్రీస్తు ద్వారా పాపక్షమను కోరువారందఱు దాని పొందగలరు. ఆయన సిలువరక్తముచేత సంధిచేసి ఆయన ద్వారా సమస్తమును సమాధానపఱచుకొనెను. ఇది యిట్లుండనిమ్ము.

దేవుడు భూమియందవతరించి మరణించి మనలను రక్షింపవలెనా యని కొందఱు హిందువులు ప్రశ్నింతురు.

వారు చక్కగా యోచించిన యెడల ఈప్రశ్నకు జవాబువారంతట వారే తెలిసికొనగలరు. అయినను క్లుప్తముగా జెప్పెదము. "పెట్టినవా డెఱుంగు నిక్షేపము" అను సామెత ప్రకారము మన ఓగుబాగులను గుఱించి సర్వజ్ఞుడగు భగవంతునికే తెలియును. భగవంతుడనగా, "ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతింగతిం వేత్తివిద్యామ విద్యాంచ సవాచ్యోభగవానితి" [వి. పు. 6 అం. 5 అ] అను సూక్తినిబట్టి "లోకముల జన్మమృత్యువులు భూతభవిష్యత్తులు జ్ఞానాజ్ఞానములు నెఱింగిన వాడని యర్థము. కావున లోకమునకు ఏ యే మేళ్ళు ఏయే సదుపాయములు చేయవలెనో భగవంతునికే తెలియును. మన కేమియు తెలియనే తెలియదు. కాబట్టి, దేవుడు సాధక బాధకము లాలోచించి తన దయాలోచన ప్రకారము మన రక్షణ సిద్ధపఱచినపుడు దానిని సరికాదని యెవరు చెప్పగలరు?

యేసుక్రీస్తుయొక్క అవతారము నవతరింపించు సంకల్పము సయితము దేవుని ప్రథమ సంకల్పములో నున్నదియే కాని యిప్పు డొక్క ప్రమాదము సంభవించిన

నైన దిద్దుకొనుటకు జేసిన క్రొత్తసంకల్పము కాదు. వస్తు సామగ్రీ స్వభావములును వాని వైచిత్ర్యములు నిట్లు నడచునని యీశ్వరుడు మొదటనే సంకల్పించియున్నాడు. మన పూర్వులగు ఆదాము హవ్వలను మోసపుచ్చి, వారిని వారిసంతతి యయిన మనలను పాపిష్ఠులనుగ జేసి నరకాగ్నిపాలు చేసిన సాతానును నిగ్రహించి రక్షించినందున మన పూర్వులకును మనకును సద్గతి కలకాలము కలుగుటకు హేతువైన భగవదావతారమును తత్కృతయజ్ఞప్రాయశ్చిత్తమును కృతజ్ఞతామూలమున స్మరించుట మన కందఱకును మేలగును గాని కీడు కాదు.

ఇంతే కాదు. దేవు డాత్మయయి యున్నాడని బైబిలు తెలియజేయుచున్నది. ఆత్మయనునది, జీవజ్ఞాన ప్రాణములయి యున్నది. దానికి, కనబడు స్పర్శనీయమయిన రూపములేదు. మనము దానిని మన చేతులతో నంటలేము, కన్నులతో జూడలేము, చెవులతో వినలేము, ముక్కులతో వాసన చూడలేము. కావున, బైబిలు సాక్ష్యమును బట్టి దేవుడు ఆత్మయై యున్నాడు అనగా అగోచరమయిన యొక సత్యమయి యున్నాడు గదా అని నమ్ముటకు ఆటంకము లేదు కదా. దేవుడట్టి వాడు గావున తన గొప్పప్రేమ మనకు జూపించుటకును, కృపాసమాధానముల కొఱకు తన తట్టు మనలను మళ్ళించుటకును యేసుక్రీస్తునందు నవతరించి నరరూపియై మన యెడలనున్న తన దయగల తలంపులను దెలియజేసెను. ఆయన మనుష్య స్వభావమును ధరించుకొనుట మిక్కిలి గొప్ప యనుగ్రహమే గాని మన మాయన ప్రేమను నమ్మునట్లుగా మన కొఱకై శ్రమపడుట మఱింత గొప్ప యనుగ్రహమై యున్నది. ఈలోకములో నొకడొకని కొఱకు శ్రమపడినట్టయిన, అది వానిని ప్రేమించునట్లు సాక్ష్యమై యున్నది. తల్లి తన శిశువుకొఱకై యెంతో శ్రమపడును. ఎందుకు? ఆశిశువుమీద నున్న ప్రేమ చేతనే. దేవుడు మనలను ప్రేమించుచున్నాడు; అందుకు సాక్ష్యముగాను, మనము ఆయనను తిరిగి ప్రేమించి సేవించుటకుగాను, ఆయన మన స్వభావమును యేసుక్రీస్తుగుండ ధరించుకొని మన విషయమయి కష్టముల ననుభవించెను.

అదియు గాక. యేసుక్రీస్తు మరణము పొందక గాని మనకు రక్షణ లేదు. ఎందుకనిన, మరణము పాపమును బట్టి కలిగిన శిక్షయై యున్నది. నేరస్థుడు తన స్వంత నేరమును క్షమించుకొన నేరడు. అయినను అది మనుష్యుని వలననే చెల్లింపబడవలెను, లేకున్న నది మనుష్యుల పాపములకు ప్రాయశ్చిత్తమై యుండకపోవును. కాబట్టి కావలసినట్టియు తగినట్టియునైన ప్రాయశ్చిత్తము దైవమనుష్యుని వలననే

చెల్లింపబడవలెను. క్రీస్తు మనుష్యునికన్న శ్రేష్ఠుడై యున్నందున ఆయన మరణము అపారమయిన విలువగలదై యున్నది. అది యనేక కోట్ల మానవుల పాపముల నుదహించి వేయగలదు. కాబట్టి ఆయన మన పాపములను తన మీదనే యుంచుకొని మన విషయమై ప్రాయశ్చిత్త మాయెను. ఆయన చనిపోవుట కిదే కారణము. మిత్రులారా! మనము రక్షింపబడుట క్రీస్తుని యుపదేశము వలననే కాదు గాని యాయన తన రక్తము చిందించి ధారపోయుటవలననే యయియున్నది.

ఇదియు కాక, లోకమందు మనుష్యులు దేవునికి «భక్తవత్సలుడు» అను పేరు వాడుదురు. నిజముగా దాని యర్థమును ధరించుటకు యేసుక్రీస్తు ఒక్కడే తగిన వాడు. ఎట్లనిన, ఆశ్రితదోషములను భోగముగా గైకొనువాడు వత్సలుడని చెప్పుదురు. తన వత్సము నొడలి మురికిని గూడ భోగ్యంబుగా నెంచు ధేనువు వత్సలయనబడు గాన వత్సల శబ్దమున కట్టి యర్థముచేసిరి. కావున భక్తుల దోషమును భోగముగా గైకొనినవాడు క్రీస్తే [1 తిమో. 2: 5, 6.] వత్సలశబ్దమునకు ఆశ్రితుల దోషములను సమూలముగా హరియించు వాడని కాని, ఆశ్రయించు నెడ నింతకమున్ను తాను జేసిన దోషములను దలచి బెదరిన వాని బెదరు దీర్చుటకు దగిన విలక్షణ స్వభావముగల వాడని కాని అర్థమున్నట్టు మరి కొందఱు చెప్పుదురు. ఈ యర్థములు గూడ యేసుక్రీస్తునందే సార్థకములై వర్తించుచున్నవి. కావున భక్తవత్సలుడని కాని భక్తపాపహారుడని కాని పిలువబడుటకు ఆయనే తగిన వాడు.

మనుష్యుల పాపముల కొఱకు యేసుక్రీస్తు చనిపోయినాడని చెప్పుదురు; దీని వలన ప్రయోజన మేమి? ఒకడు నేరము చేసిన యెడల ఇంకొకని దండించుట ఏమి న్యాయము? ఒకనికి రుగ్మత వచ్చిన నింకొకనికి ఔషధమిచ్చినందున ఏమి లాభము? ఎవడు చేసికొనిన పాపము వాడే యనుభవింపవలెను అని కొందఱందురు.

«ఎవడు చేసిన పాపకర్మము వానినే యధర్మమార్గమున కీడ్చుచున్నదనియు నొకనిపాపపుణ్యములు వేఱొకని యధీనములుకానేరవనియు విదితమగుచున్నదికదా! క్రైస్తవ మతస్థులు తమ పాపముల నెల్లను భరించుటకు జీసస్సున్నాడని నమ్ముదురు. ఒకడు తిన్న భోజనమును, ఒకడు పోయిన నిద్రయు వేఱొకనికి తృప్తికలిగించెడు పక్షమున ఆ సిద్ధాంతము సత్యమే యని చెప్పవచ్చును. ఈసందర్భమున వేమన యోగీంద్రుని పద్య మొకటి తలంపునకు వచ్చుచున్నది.

గీ॥ తనదు భ్రాతలెల్ల దానంబుఁ జేయఁగాఁ।
దనకుఁ గల దటంచు మనఁగ రాదు।
తనదు కాలు గోయఁ దన తమ్ముఁ డేడ్చునా?
విశ్వదాభిరామ వినుర వేమ॥

అని యాక్షేపణగా నొక హిందూగ్రంథకర్త వ్రాయుచున్నాఁడు.

చూపునకు ఈ తర్కము న్యాయముగా నున్నట్టు కాన్పించును గాని, మిగుల అపాయకరముగాను నీతిబద్ధముగాను నున్నది. తాను చేసికొనిన పాపమునకు దేవుఁడు విధించు భయంకరమయిన దండనయంతయు తానే యనుభవింపవలెనని యెవరైనను గోరినయెడల అందు కభ్యంతరమేమియు లేదు. అలాగుననే యనుభవింపవచ్చును; మేమడ్డము గాబోము; అనుభవించు సమయములో కృపాసంపూర్ణుడగు దేవుఁడు సయితము అడ్డము రాబోఁడు. అయినను, తన పాపకర్మమునుండి విమోచన పొంది దేవుని యనుగ్రహము పొందగోరు వారి కొరకయి క్రీస్తు పొందిన మరణ ప్రాయశ్చిత్తము లోకధర్మమునకైనను, శాస్త్రధర్మమునకైనను విరుద్ధమైన ధర్మము కానే కాదనియు సమస్తలోకానుభవమువలనను సమస్త మతధర్మములకును సమ్మతమయిన యంశమేయనియు విచారించి చూతము.

లోకములో పాపముచేసినందుకు పాపముచేసిన వాఁడొక్కఁడు మాత్రమే క్లేశ మనుభవించుటలేదు. తండ్రి తప్పిదముచేసినందువలన గలిగిన వ్యాధి బిడ్డలకు సయితము వ్యాపించి బాధించుచున్నది. ఒకని దుర్గుణముల మూలమున భార్యాపుత్రులు గూడ బాధపడవలసిన వారగుచున్నారు. భాగ్యవంతులు చేసిన దోషములు నిరుపేదలను బీడించుచున్నవి. చచ్చినవారు చేసిన అప్పులు బ్రతికియున్నవారిని వేధించుచున్నవి. అలాగుననే యొకరి మేలు కార్యముల మూలమున భార్యాపుత్రాదులు మేలునే యనుభవింతురని మీకు స్పష్టము గాక యుండదు. బిడ్డలు నూతులలోను గోతులలోను పడినపుడు తలిదండ్రులు తమ ప్రాణములనైనను ఆశింపక వెంటనే వానిలో దుమికి తమ బిడ్డల ప్రాణమును గాపాడుకొనుచున్నారు. లోకములో అనేకు లప్పులపాలై యిల్లు వాకిళ్లు పోగొట్టుకొని దుఃఖించుచుండగా దయాపరులైన ద్రవ్యవంతులు వారి దురవస్థలను జూచి జాలిపడి వారి ఋణమును దీర్చి వారి యుత్తర జీవమునకు సయితము కొంత ద్రవ్య మిచ్చి యాదరించుచున్నారు. బలిష్ఠుల సహాయము వలన బలహీనులకు సహాయము కలుగుట లేదా?

పండితుల కలన పామరులకు జ్ఞానము ఆత్మానుభవమును గలుగుట లేదా? నీతిప
రుల ప్రయాసము వలన అనీతిపరులకు మేలు కలుగుట మనము చూచుచునే యు
న్నాము. ఒకని కాలు తెగినప్పుడు అతని తమ్ముడేడ్చువాడని వేమన యోగీం
ద్రుడు చెప్పిన మాట సరికాదు. తన యన్నకు బాధ కలిగినప్పుడు తమ్ముడు
దుఃఖపడకుండునా? అన్న శారీరబాధ ననుభవించును. దయగల తమ్ముడు మనో
బాధను బొందుచున్నాడు. మనోబాధ యనుభవైకవేద్యమే కాని వర్ణింపశ
క్యము కానిది గదా. అతనికి బదులుగ నాకాలు తెగినను బాగుండును గదా
అని అన్న చింతపడును.

ఇంకొక దృష్టాంతము చూడవచ్చును. పసిబిడ్డకు జాడ్యము వచ్చినప్పుడు
స్తన్యమిచ్చు తల్లి యౌషధము పుచ్చుకొనుట అందఱెఱిగిన సంగతియే. తల్లి
యౌషధము పుచ్చుకొనినను, తల్లిపాలు త్రాగుటవలన గలుగు ప్రయోజనము
బిడ్డకు గలుగుచున్నది. అలాగుననే క్రీస్తుప్రభువు నెఱవేర్చిన ప్రాయశ్చిత్తఫల
మును విశ్వాసము ద్వారా ఆయన పిల్లలయిన వారికి నిరంతరము కలుగుచున్నది.

ఇంకొక సంగతి విచారింపవచ్చును. లోకములో నుండు ప్రతిమానవునకు
జననము మొదలుకొని కలుగు ప్రతిలాభము మఱియొకని ద్వారానే కలుగుచున్న
దను సంగతి నిజము. ఏలయనిన, ఏమనుష్యుడును ఆకాశము నుండి భూమి
మీదకు ఊడిపడుటలేదు. జననము తలిదండ్రులవలన కలుగుచున్నది. తల్లిగర్భ
మందుండగ పిండము తల్లిమూలముగా సంరక్షణ వృద్ధులు పొందుచున్నది. జన
నమైన పిమ్మట శిశుత్వమందు తల్లి శరీరము వలననే జీవించుచున్నది. బాల్యా
వస్థయందు తల్లిదండ్రుల వలననే సంరక్షణ కలుగుచు విద్యాభివృద్ధి గురుమూల
ముగానే యగుచున్నది. విద్య వచ్చి పెద్దవాడయిన మీదట ఎవరో యొకరు
ఆచిన్నవాని పక్షము వహించి యుద్యోగము నిప్పించియో మఱియేవిధము
గానో జీవనోపాయము కలుగజేయుచున్నారు. పిమ్మట ప్రతి కార్యమందును
నితరుల సహాయసంపదలు అడుగడుగునకు నవసరమయి యుండును. ఇదంతయు
చూడగా పరమాత్ముడు ఏమేలును సాధనము లేకుండ మానవులకు గలుగ జేయు
చున్నట్టు కనబడదు. కాబట్టి పాపవిమోచనమును, ఆత్మరక్షణయును, సకలా
త్మీయవరములును క్రీస్తు స్వామిని సాధనముగా నేర్పఱిచి యాయవతారము
ద్వారా పాపాత్ములకు దయచేయుచున్నాడనుట భగవంతుడు సృష్టిపరిపాల
నలో నవలంబించుచున్న పద్ధతి కనుకూలముగానే కాన్పించుచున్నది.

వేఱొక విషయమును విచారింతుము. విశూచి జాడ్యమొక యూరియం దొక సమయమున ప్రబలించెను. అక్కడ నొక దయాళుడగు వైద్యుడుండెను. ఆయన "పరోపకారార్థమిదం శరీరం" అను సూక్తి నవలంబించిన వాడయి, తాను పిల్లలు కలవాడై యుండియు, ఇతరుల ప్రాణసంరక్షణ నిమిత్తమయి జాడ్య గ్రస్థులయిన వారి యిండ్లకు వెళ్ళి వారికి దగిన యౌషధముల నిచ్చి యుపచార ములు చేయుచు వచ్చుచుండెను. ఇట్లు ఆయన వైద్యము వలనను, ఉపచా రము వలనను చాలమందికి మరణమును దప్పించి బ్రతికి కుటుంబ సంరక్షణ జేయగలిగిరి. ఒకనాడు ఎవరి యింటనో వైద్యము చేయుచుండగా, విష వాయువు లోపలికి బోయి యీ వైద్యునికి విశూచి జాడ్యము తగిలి యేచికి త్సయు పనికిరాక మృతుడాయెను. ఇతడు మరణమునకైన తెగించి రోగుల యొద్దకు పోవుట వలననే గదా యనేకులు జీవించిరి. ఈమహాత్ముడు వారి ప్రాణములకు దన ప్రాణము నడ్డము వేసెనని చెప్పవచ్చును గదా. అలాగుననే "మన మింకను పాపులమై యున్నప్పుడు మన కొఱకు క్రీస్తుయేసు మరణము నొందెను" "నశించిన దాని వెదకి రక్షించుటకు మనుష్యకుమారుడు లోకము లోనికి వచ్చెను".

ప్రాజ్ఞులారా! ప్రపంచ ధర్మమునుబట్టి యాలోచింపగ, క్రీస్తుప్రభువు యొక్క ప్రాయశ్చిత్తము సమస్తలోకానుభవమునకు విరుద్ధము కాక దాని కనుగుణ్యముగానే యున్నదని బుద్ధిమంతులందఱు తెలిసికొనగలరు.

ఇకను ఈసిద్ధాంతము శాస్త్రిధర్మమునకే మాత్రమైన విరుద్ధమయిన ధర్మ మేమో విచారించి చూతము. ఏమత ధర్మశాస్త్రములకైనను విరుద్ధమై యుండిన నుండవచ్చునేమో కాని హిందూశాస్త్రముల కింత మాత్రమును విరుద్ధమైన సిద్ధాంతము కానేకాదు. క్రీస్తుని యజ్ఞపుణ్యము మనకు లభించునన్నపుడు హిం దువులు శంకించుటకే మాత్రమైన చోటుండనే యుండదు. ఈదేశపు ఋషులీ సిద్ధాంతమును బాగుగా గ్రహించి యుండిరనుటకు వారేర్పఱచిన బలులు యజ్ఞ ములు సాక్షీభూతములై యున్నవి. ఈబల్యర్పణలలోని ముఖ్యోద్దేశము మను ష్యునికి బదులుగా అర్పణను అర్పించుటయై యున్నది. కనుకనే బలియర్పించు నప్పుడు పశుశిరస్సుమీద మనుష్యుడు తన చేతులుంచి నాప్రాణమునకు బదులు దీనిని సమర్పించుచున్నానన్నట్టుగా తన పాపము నొప్పుకొని దేవుడా బలి

తనకు ప్రత్యామ్నాయముగా నంగీకరించునని నమ్ముచున్నాడు. ఇందుకు నిదర్శనములు:—

శ్రు॥ పఞ్చహోత్రా పశుము పాదయతి సువర్గో వై పంచ
హోతా। యజమానః పశుః యజమానమేవ
సువర్గం లోకంగమయతి॥

„పంచహోత్రుని చేత పశువు తేబడుచున్నది. సువర్గుడే పంచహోత్రుడు. యజమానుడయిన పశువు యజమానునే స్వర్గలోకమును పొందించును" (తైత్తిరీయ బ్రాహ్మణము. బంగాళి పత్రము 202.)

శ్రు॥ అగ్నిష్టోమీయ పశోర్హవిస్తదగ్ని హోతేత్య
నేనపంచ హోత్రుమంత్రేణ వేద్యా ముపసాద
యేత్। తస్యస్యమంత్రస్య స్వర్గసాధనత్వాత్ పశో
శ్చయజమాన నిష్క్రియణార్థత్వాత్ యజమాన
మేవస్వర్గం ప్రాపయతి॥

అగ్నిష్టోమీయమైన హవిస్సుపంచహోత్రునియొక్క యీమంత్రముచేత వేదికకు తీసికొని రాబడును. ఆతని మంత్రముయొక్క స్వర్గసాధనమును బట్టియు, యజమానునికి మారుగా క్రియ జరుపబడినదగుటచేత యజమానునే స్వర్గమును పొందించును" (తైత్తిరీయ బ్రాహ్మణము, బం. ప. 448)

శ్రు॥ సయదగ్ని ష్టోమీయం పశుమాలభతే సర్వాభ్యామేవ
దేవతాభ్యోయజమాన ఆత్మానం నిష్క్రీణీత యజమా
నోహ్యేతే నాత్మానం నిష్క్రీణీతే॥

దేవతలందరికొరకును అగ్నిష్టోమీయమైన పశువు నతడు పొందించెను గనుక యజమానుని యాత్మవిమోచనమును పొందెను" (ఐతరేయ బ్రాహ్మణము బం. పు. 27.)

డాక్టరు హాగ్ దొరగారి విషయాభిప్రాయము కౌషీతకీ బ్రాహ్మణములోనుండి రెత్తి చూపుచున్నారు,

శ్రు॥ అగ్నిషోమయోర్వా ఏష ఆస్యమాపద్యతే। యోదీక్షతే
తద్యదు పవసథే। అగ్నిషోమీయం పశుమాలభతే। ఆత్మని
ష్క్రియణో హైవాస్యైష తేన ఆత్మానం నిష్క్రియ అ
నృణో భూత్వాథయజతే తస్మాత్ ఉతస్య నాశ్నియాత్ ॥

“దీని ముఖము అగ్నిష్టోమమయము. ఏ దీక్షగలవాడు అదియు, ఎచ్చట ఉనికియై యుండెనో అదియు అగ్నిష్టోమీయమైన పశువును పొందించును. తన విమోచనముకొఱకు దీనిని సమర్పించి తాను ఋణవిముక్తుడై పిమ్మట యజించుచున్నాడు గనుక దాని సంబంధమైన దానిని (మాంసమును) తాననుభవింప కూడదు”

యజ్ఞపశువును అగ్నిముఖమున నర్పించుటచేత పాపవిమోచనము కలుగును. ఆ యజమానునికి బదులుగా యజ్ఞపశు వర్పింపబడుచున్నది. అందువలన విమోచనము కలుగుచున్నదని తేటబడుచున్నది.

ఇదేకాక, ఒకని పుణ్యపాపములు వేఱొకని యధీనములు కావచ్చునని మన దేశపు ఋషులు నైకకంఠ్యముగా ఘోషింపుచున్నారు. మనుస్మృతి, 6 వ అధ్యాయమునందు,—

శ్లో॥ ప్రియేషు స్వేషు సుకృతమప్రియేషు చదుష్కృతమ్॥
విసృజ్యధ్యానయోగేన బ్రహ్మాభ్యేతిసనాతనమ్ ॥79॥

“బ్రహ్మవేత్తనకు హితకారులగు స్వీయులయందు సుకృతమును, తన కహితకారులగు వారియందు అనగా తన్నునిందించిన వారియందు దుష్కృతమునువిడిచి ధ్యానయోగముచే నిత్యమగు బ్రహ్మము నొందును”ని వ్రాయబడియున్నది. “ఇచ్చట ఓయీ! ఒకని సంబంధములగు సుకృత దుష్కృతములు మఱియొకనికెట్లు సంక్రమించునని శంక రాగా చెప్పబడును. ధర్మాధర్మ వ్యవస్థవిషయమై శాస్త్రమే ప్రమాణము. ఆ పాప పుణ్యముల సంక్రాంతియు శాస్త్రము ప్రమాణముగా గలదే ఇది కావున సంక్రమించుటకు దగినవి శాస్త్రమే సంక్రమించున”ని మనుస్మృతి వ్యాఖ్యాన కర్తయగు కల్లూక భట్టు వ్రాసెను.

ఒకని పుణ్యము వేఱొకనికి ధారపోయగా నాతనికి జెందుననుట హిందూ ఋషుల స్థిరాభిప్రాయమే అందులకు, పద్మపురాణము, మాఘమాహాత్మ్యము, 25 వ అధ్యాయమున,—

శ్లో॥ ఆతురోమానవోమాఘేస్నాతార్థంస్యాత్తనోద్విజమ్।
కుర్యాత్ప్రతినిధింతస్యయోగక్షేమంప్రకల్పయేత్॥
ఏవంయస్స్నాపయేన్మాఘేబ్రాహ్మణేనాత్మనేద్విజః।
స్వయంకృతాదపిమహత్యధికంఫలమాప్నుయాత్॥

"ఎవడైనను రోగబాధచేత అశక్తుడై యుండి మాఘమాసస్నానము చేయ దలచిన పక్షమున తనకు మాఱుగా మఱియొకనిచేత స్నానము చేయింపవచ్చును. ఇట్లు ఎవడు తనకుగాను ఇతరునిచేత స్నానము చేయించి యాఫలమును ధారాపూర్వకముగా తీసికొనునో వాడు తానే మాఘస్నానముచేసి పొందుటకన్న నధికఫలమును పొందును"ని చెప్పియున్నది. ఒకప్పుడు మృగశృంగ మహాముని తన పుణ్యమును ధారబోసి యేనుగును రక్షించెనట. మాఘపురాణము, 6 వ అధ్యాయమున,—

శ్లో॥ మాఘాష్టదినజంపుణ్యంతుభ్యందత్తమితిద్విజః॥
ఆదాయపాణినాతోయంశీఘ్రంతస్మార్థిదత్తవాన్। జానన్నివకరీంద్రోసౌతదాపాపవివర్జితః॥

"మాఘమాసము నందలి యెనిమిది దినముల స్నానఫలమును నీకు దత్తము చేసితిని, అని చేతనీళ్లెత్తి దాని తలపై జల్లెను. అంతట అది ఆ ఫలము గ్రహించినందులకు గురుతుగా పాపము లేమి పొందిన దాయెను"ని యున్నది. ఆగ్నేయపురాణము, తులాకావేరీ మాహాత్మ్యము, 4 వ అధ్యాయములో,—

శ్లో॥ విషుమాసేతుకావేర్యాంస్నానపుణ్యమహస్త్రియే॥ తద్దత్తమద్యపాపిభ్యస్సర్వేలోకాశ్చసాక్షిణః। ఇత్యుచ్చైర్ఘోషయామాసవాచాదత్వాపునఃపునః॥ ఏతద్వాక్యంమునీంద్రేణసుధామయముదీరితం। శ్రుత్వాఽదితాయమభటైఃపాపినస్సుఖినోఽభవన్॥

"విషుమాసమందు (నేనార్జించిన) తులాకావేరీ సుకృతములో మూడుదినముల సుకృతము పునఃపునఃపూర్తముగా నిచ్చితినని గట్టిగ మువ్మారు పలికెను. అట్లు

పలికిన నహుషమహాముసీంద్రుని యమృతమయమైన పలుకులు విని యమభటులచే బీడింపబడుచున్న పాపులందఱు సుఖము నొందితిర"ని చెప్పియున్నది.

ఇది కాక, ఒక డొక గోవును నొకానొకనికి దానముచేసి దాని ఫలమును మఱియొకనికి దానము చేయుగా నతడును రెండు గోవులను దానముచేసి దాని ఫలమును ఆమొదటి వానికి మఱల దానము చేసినట్లు భారతములో శాంతిపర్వమునందు 4 వ ఆశ్వాసములో జెప్పియున్నది. ఆయాశ్వాసములోనే, కౌశికుడు తన జపఫలమంతయు నిక్ష్వాకునకును, ఇక్ష్వాకుడు తన యాగఫలమంతయు కౌశికునకును ధారవోసికొని యిరువురు తత్పుణ్యఫలముల వలన బ్రహ్మపద ప్రాప్తులయిరని వ్రాయబడియున్నది.

సోదరులారా! ఇంతవఱకు బయిన ఉదాహృతములైన చరిత్రములలోని పుణ్యదానములు సత్యమైనవా? కావా? అని ప్రకృతమున విచారింపవలసిన విషయము కాదు; కాని పయి శ్రుతి స్మృతి పురాణేతిహాస దృష్టాంతములను బట్టి యొకని సుకృత దుష్కృతములు పరునకు ధారపోయగా వానికి జెందుననియు, ఈ సిద్ధాంతము మనుష్యులలో నవీనముగా నుండినది గాక బహుపురాతనము నుండియే యుండియున్నదనియు దేటతెల్లమై యున్నది. క్రీస్తు మనకు ప్రతిగా ప్రాణము బలిగా నర్పించి ప్రాయశ్చిత్తమయి, మనము నెఱవేర్పలేని దేవుని ధర్మశాస్త్రవిధులన్నియును తాను నెఱవేర్చి చాలినంత పుణ్యము సంపాదించి యాకొంటెని ధారాళముగా ధారపోయగా మనకట్లు చెందునని చెప్పెడి హిందూ సోదరులకు బయిని జూపించిన చరిత్రాంశములే విశదపఱుచుటకు జాలి నన్ని నిదర్శనములయి యున్నవి గదా.

ఇంతే కాక, ఈసిద్ధాంతము నీతిన్యాయములకు విరుద్ధమయినది గూడ కాదు. ఈసిద్ధాంతము నీతికోవిదులచేత గూడ బహుగా మెచ్చబడినదే. ఇందుకు నిదర్శనము,—

శ్లో॥ పరోపకారాయఫలంతివృక్షాః। పరోపకారాయవ
హంతినద్యః। పరోపకారాయచరంతిగావః।
పరోపకారార్థమిదంశరీరమ్॥

"పరోపకారము కొఱకు వృక్షములు ఫలముల నిచ్చుచున్నవి. పరోపకారము కొఱకు నదులు ప్రవహించుచున్నవి. పరోపకారము కొఱకు గోవులు

పాలిచ్చుచున్నవి. ఈ శరీరము పరోపకారము కొఱకే". (శ్రీనీతిభాండాగారము.)

శ్లో॥ పిబంతినద్యస్స్వయమేవనాంభః ఖాదంతినస్వాదుఫలానివృక్షాః పయోధరాస్సస్యమదంతినైవ పరోపకారాయసతాంవిభూతయః॥

"నదులు తామే నీళ్ళను త్రాగవు, వృక్షములు ఫలించి తాము భక్షింపవు; మేఘములు వర్షించి పండించిన ఫలమును తాము భక్షింపవు: ఆలాగుననే లోకమందు సత్పురుషులు తమ యైశ్వర్యముచేత పరోపకారము చేయుదురు" (నీతిశాస్త్రము)

శ్లో॥ ప్రత్యాఖ్యానంనకర్తవ్యంసర్వదాసర్వచేతనైః।
స్వస్యాత్మనాశపర్యన్తందధీచ్యాద్యైరనుష్ఠితమ్॥

"అడిగిన దానిని లేదనుట ఎప్పుడును సకలజీవులచే చేయదగినది కాదు. ఇది దధీచి మొదలయిన వారిచేత శరీరనాశమగువఱకును ననుష్ఠింపబడినది". (స్కాంద పురాణము.)

శ్లో॥ పరోపకారవ్యాపారపరోయఃపురుషస్సదా।
పరంపదమవాప్నోతిపరాదపిచయత్పరమ్॥

"ఎవడు పరోపకారము చేయునో వాడెప్పుడును పురుషులలో నుత్తముడుగును. అట్టి యుత్తముడు శాశ్వతమైన పరమపదమును పొందును". (పద్మపురాణము.)

ఇంతేకాక ధర్మవేత్తలు వ్రాయునది వినుడి :—

మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యులవారు తన ధర్మసంగ్రహములో,—"ధర్మము చేసినవాడు దాని ఫలము పరుని జెందింప బ్రార్థించిన నీశ్వరుడందు కియ్యకొనును. ఒరుని యధర్మఫలమును దాననుభవించెదని" మతియొకడు ప్రార్థించిన నాయొరుని యధర్మ దండనము దప్పించును గాని వాని యధర్మ మెంతదియగునో యంతకుం దగిన దండము దాజెందవలయును అని వ్రాయబడియున్నది. డాక్టరు మర్టాను వారగారు వ్రాయునది వినుడు:

,,ఎవరైన నొక రాజు నిరపరాధియైన ఒక మనుష్యుని పట్టుకొని వానిని బలవంతముగా దండించి యపరాధము చేసినవానిని తప్పించుకొని పోనిచ్చినట్టయిన నెంతో యన్యాయస్థుడనిపించుకొనును. కాని, బహుజన మేదో నేరము చేసి యందువలన వశింపవలసి యున్న యెడల నిరపరాధియైన యొక మహాత్ముడు వచ్చి వారికి బదులు తన ప్రాణము సమర్పింతునని స్వేచ్ఛగా వచ్చి యడ్డపడిన పక్షమున న్యాయమునకు భంగము లేదని న్యాయచట్టముల నేర్పతిచిన వారంగీకరించిన నందులో అన్యాయ మేమియు లేదు; నిరపరాధులయినవారు తమను బలవంతముగా అపరాధులకొరకు శిక్ష ననుభవింపవలసి వచ్చునేమో యను భయమును డవలసిన పనిలేదు. ఇదియు గాక, పైనజెప్పినట్లు ఇచ్ఛాపూర్వకముగా నొక యుపకారి పరుల నేరమును తనదిగా నెంచుకొని దానికై శిక్ష నొందుటవలన ఆ నేరస్థులకు సుబుద్ధి కలిగి సజ్జనులు కాగల మార్గము కలిగి ఇట్టి మహోపకారి పరులకొరకై మరణము పొందినందుకు తిరిగి బ్రతికింపబడి మునుపటి కంటె ఘనాతిశయము పొందినట్టయిన న్యాయము నెరవేరుటయే గాక ఉపకారమును ప్రకాశించును. క్రీస్తు నెరవేర్చిన ప్రాయశ్చిత్త మిట్టిదే; అనీతి మంతులమైన మనము తప్పించుకొనులాగున నీతిపరుడైన ఆమహాత్ముడు శ్రమ ననుభవించెను. ఇట్లు తన్ను దాను అర్పించుకొనినది యెవరి బలవంతము వల్లను గాక తన స్వంత యిష్ట ప్రకారమే చేసెను. క్రీస్తు శ్రమపొందినది అల్పకాలము వరకే; కాని దానిపైన కలిగిన జయము నిత్యకాలముండును''. (క్రైస్తవమత ప్రకాశిక పు. 64.)

కాబట్టి సోదరులారా! పరమదయాపరుడును, భక్తవత్సలుడునైన యేసు క్రీస్తు నిరాధారులమైన మనయందు జాలిచూపి పరోపకారార్థమై పొందిన దండన నీతికోవిదులచేత మెచ్చుకొనదగిన విషయమే కదా. దేవుడు క్రీస్తు ద్వారా చేసిన రక్షణ కార్యము మోక్షోపాయమును పరోపకార పరమధర్మమునై యున్నదనుటకు సందియ మించుకైనను లేదు.

మిత్రులారా! క్రీస్తు శ్రమమరణాదులవలని మేలులను మన మనుభవించుకొనుటకయి, మనము వానిని విశ్వాసము వలన పరిగ్రహించుకొనవలెను. రక్షణ పొందనొల్లని వారు ఏలాగైనను దానిని పొందునట్టుల దేవుడే మాత్రము వారిని బలవంతపెట్టడు గాని, క్రీస్తునందు భక్తి యుంచుకొందురో యట్టి వారికి క్రీస్తు పొందిన ప్రాయశ్చిత్తము వలని పుణ్యమంతయు నియ్యబడును. అట్టి వారికి క్రీస్తు నీతి ఆరోపింపబడును. క్రీస్తు నిమిత్తము దేవుడు వారిని నీతిమంతులనుగా

నెంచుదుము. విశ్వాస మూలముగా నీతిమంతులని తీర్పబడి, దేవునితో సమాధా
నము కలిగి యుండి క్రీస్తు ద్వారా దేవుని యుగ్రతనుండి రక్షింపబడుదుము.

## 9 వ ప్రకరణము.

## క్రీస్తుని పునరుత్థానోర్ధ్వారోహణములను గురించియు పరిశుద్ధాత్మను గురించియు

క్రీస్తు మరణము నొందెనని తెలిపి యుంటిమి. ఆయన మరణము పొం
దిన పిదప ఏమయి పోయెనని శంక కలుగక మానదు. ఇందును గురించి
కొంత తెలిపెదము. ఆయన సిలువ మరణము నొందినపుడు భూమి వణికెను;
బండలు బద్దలాయెను; చీకటి సూర్యుని కమ్మెను. మృతులైన పరిశుద్ధులు సమా
ధులలోనుండి లేచి యందఱకు గనబడిరి. ఇట్టి యద్భుతములు క్రీస్తుని మరణ
కాలమందే తప్ప మరియొకరి మరణ కాలమందును జరుగలేదు. ఈ వింతల
న్నియు జూచినవారు మిగుల ఆశ్చర్యపడిరి ఇది యిట్లుండనిమ్ము.

యేసుక్రీస్తు చనిపోయి మరల మృతులలోనుండి లేచి మోక్షరాజ్యమునకు
వెళ్ళి యచ్చట కలకాలము బ్రతికి యుండుననని దీర్ఘదర్శుల భవిష్యోక్తులు
పెక్కులు సత్యవేదములో పూర్వభాగమందు వ్రాయబడియున్నవి. (కీర్తన
16: 10, 11; 68: 18; యెషయ 53: 11, 12) చదివి చూడుము. మెస్సీయా
(క్రీస్తు) శాశ్వతమైన వాడని దేవుడు మీకాయను ప్రవక్త ద్వారా మనకు తెలి
యజేసియున్నాడు. ఆయన పురాతనుడనియు శాశ్వతుడనియు మీకా 5 అ:
2 వ వచనములో చెప్పబడియున్నది. మరియు యెషయా 9: 6, 7 వచనము
లను చూడుము.

ఇంతియె కాక, క్రీస్తు మృతిపొంది మూడవ దినమందు జీవముతో లేతు
నని యడుగు అడుగునకు ముందుగా తెలియజేసెను. (మత్తయి 16: 21; 20: 17-19;
మార్కు 8: 31; 9: 31 10: 33-34; లూకా. 9: 22; 18: 31-33; యోహా 10: 17-
18; 2: 19.) ఈ భవిష్యోక్తులన్నియు యేసుక్రీస్తునందు అక్షరాల నెరవేరినవి.
ఆయన మన ప్రాయశ్చిత్తార్థమై మరణము పొందిన పిమ్మట తాను తన ప్రాణమును
పెట్టుటకును, దానిని తిరిగి తీసికొనుటకు నధికారముగల దేవుడై యుండెను
(యోహా. 10: 18). అయినను ఆయన సజీవుడై లేచుటకు మూలకారణము తం

ద్రియైన దేవుడే. సర్వశక్తిగల దేవుడొక్కడే మృతులను లేపగలడు. క్రీస్తును మృతులనుండి లేపినది తండ్రియైన దేవుడని వేదములో బహుముఖముల చెప్పియుండినను (గలతి 1: 1), తండ్రియొక్క దేవత్వము కుమారునికిని పరిశుద్ధాత్మకును నుండుటవలన, తండ్రి కుమార పరిశుద్ధాత్మయునైన త్రియేక దేవుడు క్రీస్తుని మృతులలో నుండి సజీవునిగా లేపెనని తెలియవలయును. ఆయన మూడవనాడు మరణముపై జయశీలుడై సమాధినుండి వెడలెను. తదనంతర మాయన యనేకులకును ముఖ్యముగా తన శిష్యులకును ప్రత్యక్షుడాయెను. క్రీస్తు మృత్యుంజయుడై లేచి 13 సారులు తన శిష్యబృందమునకు కనబడి వారితో కూడి భుజించెను. ఇందుకు బైబిలు సాక్ష్యములు: "ఆయన శ్రమపడిన తరువాత నలువది దినముల పర్యంతము వారికగుపడుచు దేవుని రాజ్యవిషయములను గూర్చి బోధించుచు అనేక ప్రమాణములను చూపి వారికి తన్నుదాను సజీవుడైనట్టు కనబరచుకొనెను" (అ. కా. 1: 3) "లేఖనముల ప్రకారము క్రీస్తు మన పాపముల నిమిత్తము మృతిపొందెను, సమాధి చేయబడెను. లేఖనముల ప్రకారము మూడవదినమున లేపబడెను. ఆయన కేఫకును తరువాత పండ్రెండుగురికిని అగుపడెను. అటుపిమ్మట ఐనూటికెక్కువైన సహోదరుల కొక్కసమయమందే కనబడెను. వీరిలో చాలమంది యిప్పటి వఱకు నిలిచియున్నారు; కొందఱు నిద్రించిరి. తరువాత ఆయన యాకోబునకును, అటుతరువాత అపొస్తలు లందఱకును కనబడెను. అందఱి కడపట అకాలమందు బుట్టినట్టున్న నాకును కనబడెను" (1 కొరిం. 15: 3-8.) అని పరిశుద్ధపౌలు సాక్ష్యమిచ్చుచున్నాడు "ఈ యేసును దేవుడు లేపెను; దీనికి మేమందఱము సాక్షులమై యున్నాము" (అపో. కా. 2: 32) అని అపొస్తలుడైన పేతురు వక్కాణించెను.

ఈ దర్శనముల వలన శిష్యులలో గొప్ప మార్పు కలిగెను. పిమ్మట వారు మునుపటివలె నిరాశపడి యధైర్యపడియుండక, సంతోషముతోను ధైర్యముతోను నిండుకొనిన వారై పరిశుద్ధాత్మ వాగ్దానము కొఱకు కనిపెట్టుచు, ఆయనను పొందిన తోడనే యంతటను తిరుగుచు చనిపోయి తిరిగి లేచిన క్రీస్తు విషయమైన సువార్తను ప్రకటించుచుండిరి. కొంత కాలమునకు పిమ్మట క్రైస్తవులను హింసించిన పౌలు కూడ మారుమనస్సును పొంది, ఆ సువార్తనే ప్రకటించుచు క్రీస్తు పేరిట అన్నివిధములగు కష్టములను సహించెను. ఇంతటి గొప్పమార్పు క్రీస్తు నిజముగా లేచెనను నిశ్చయత కలుగనగే గాని మఱి దేనివలనను కలుగలేదు.

క్రీస్తు పునరుత్థానమును గురించి సాక్షులై యుండవలెనని అపొస్తలులు ఆయన నిజముగ లేచెనో లేదో అను సంగతిని మిగుల జాగ్రతగా కనిపెట్టిరి. వారు చేసిన బోధలకు క్రీస్తు పునరుత్థాన మాధారమై యున్నది. పునరుత్థానము లేనిది క్రీస్తు దేవుడని వారు మనుష్యులచేత ఒప్పింప లేకపోదురు. ఆయన పునరుత్థానము ఆయన దైవత్వమును నిర్ధారణ చేయుచున్నది. క్రీస్తు దేవుని కుమారుడనని చెప్పుకొనెను. ఆయన అట్టివాడు కాక, కపటముగా ఆమాట చెప్పుకొనిన యెడల దేవు డాయనను లేపునని నమ్మగలమా? ఏ మాత్రము నమ్మలేము. ఆరంభమునుండియు ఆయన చేసిన యద్భుతములును, ఆయన పరిశుద్ధమైన నడతయును, దివ్యబోధలును, ఆయన దేవుని కుమారుడను విషయమును సత్యమని రూపించినవి. అయినను, ఆయన పునరుత్థానము దానిని మరింత యెక్కువగా రూఢిచేసి స్థిరపరచెను. యేసు చెప్పినదంతయును సత్యమని దాని వలన స్పష్టమగును. ఆయన పునరుత్థానుడైనందున ప్రభావముతో దేవుని కుమారుడుగా నిరూపింపబడిన వాడాయెను.

ఇంతేకాక, క్రీస్తు పునరుత్థాన మింకొక గొప్ప సంగతిని స్థిరపఱుచును. అదేదనిన, క్రీస్తు తన మరణము వలన పొందిన ప్రాయశ్చిత్తము మన పాపములను పరిహరించుటకు చాలుననియు, దేవుడు దాని నంగీకరించెననియు దాని వలన తెలియును. ఆయన పొందిన ప్రాయశ్చిత్తము మన పాపములను నివృత్తిచేయుటకు చాలకపోయినయెడల ఆయన చావునకు లోనైన వాడగునని తెలిసికొనవలెను. ఆయన లేచెను. కావున విమోచన క్రయధనము పూర్తిగా చెల్లింపబడెననియు, ఆయన ప్రాయశ్చిత్తము పూర్తియయ్యెననియు తెలిసికొనగలము (రోమా. 8: 34; 1 థెస్స. 1: 10.)

ఇంతియకాక, క్రీస్తు లేచినట్లుగా మృతులందఱును లేతురు. [1 కొరిం. 15: 12, 18; 1 థెస్స. 4: 14.] మొదట క్రీస్తుని లేపిన దేవుడు మనలను గూడ లేపును. సమాధులలోనుండు వారందఱు క్రీస్తు శబ్దము విని, విశ్వాసులు జీవ పునరుత్థానమునకును, అవిశ్వాసులు తీర్పు పునరుత్థానమునకును బైటకు వచ్చు కాలము వచ్చును. ఇది యిట్లుండనిండు.

క్రీస్తు, పునరుత్థానమైన తరువాత నలువది దినముల పర్యంతము వారి కప్పుడప్పుడు దర్శనమిచ్చుచుండెను. కాని, ఆయన యిదివఱకుండినట్లు పునరుత్థానమునకు పిమ్మట ఎల్లప్పుడు వారితో కలసి యుండలేదు. కొన్ని పర్యాయములు హఠాత్తుగా వారికి కనబడుచు తిరిగి యదృశ్యుడగుచు వచ్చెను. అందువలన వారు, ఆయన నిజముగా బ్రతికి తమ్మును కాపాడుచుండెననియు, అది మొదలుకొని

తాను మునుపటివలె ఆయనలో నుండుమనియు తెలిసికొనగలిగిరి. క్రీస్తుయొక్క శిష్యులును క్రైస్తవ మతావలంబకులును అప్పటినుండి విశ్వాస దృష్టివలన మాత్రమే నడవవలసియుండిరి. ప్రాతనిబంధన యెట్లు నెరవేరెనదో ఆయన వారి కప్పుడప్పుడు చెప్పుచు వచ్చెను. రాగల సంగతులను గూర్చి మరి కొన్ని పర్యాయములు వారికి తెలియజేసి తండ్రియొక్క వాగ్దానము నిమిత్తము వారిని సిద్ధము చేయుచు వచ్చెను. ఆయన వారికి పొడుగున నేర్పుచు వచ్చినట్లు, ఇక్కడ కూడ వారు గ్రహింప జాలినంత తెలివిని దయచేసెను. ఈలాగుననే యేసుప్రభువు, అనేక పర్యాయము లనేకులకును ముఖ్యముగా తన ద్వాదశశిష్యబృందమునకును ప్రత్యక్షుడై వారి మధ్యను నిలుబడి దినములుండి యనేక సాదృశ్యములచేత వారిని భక్తి శ్రద్ధలయందు బలపరిచి, తన ప్రేమను గూర్చియు, తన పుణ్యారక్తమును ధారపోయుటను గూర్చియు సర్వసృష్టికి ప్రకటన చేయవలయుననియు [మత్తయి 20: 19, 20; మార్కు 16: 15] తన్ను నమ్మిన వారికి మోక్షమును నమ్మని వారికి నరకమును గలుగుననియు స్పష్టముగా బోధించెను.

అటుపిమ్మట క్రీస్తు శిష్యులు చూచుచుండగా పైకెత్తబడగా మేఘము వారి కన్నుల కడ్డము వచ్చెను. ఆయన శరీరముతోనె మోక్ష లోకమునకు బోయెను. “క్రీస్తు ఈలాగు శ్రమపడి తన మహిమలో ప్రవేశించుట అగత్యము కాదా?” [లూకా. 24: 26.] నిరాక్షేపముగా దైవభక్తిని గూర్చిన మర్మము గొప్పదైయున్నది; ఆయన శరీరుడుగా ప్రత్యక్షు డాయెను, ఆత్మ విషయములో నీతిమంతుడని తీర్పుబడెను, దేవదూతలకు కనబడెను, అన్యజనులలో ప్రకటింపబడెను, లోకములో నమ్మబడెను, మహిమలోకి చేర్చుకొనబడెను”. [1 తిమో. 3: 16.] ఆయన ఊర్ధ్వారోహణమయినప్పుడు తెల్లని వస్త్రములుగల యిద్దరు మనుష్యులు [దేవదూతలు] వారియొద్ద నిలిచి, మీరెందుకు నిలిచి యాకాశము తట్టు తేరి చూచుచున్నారు. ఏరీతిగా ఆయన ఆకాశమునకు వెళ్ళుట చూచితిరో, ఆరీతిగానే తిరిగి వచ్చునని పలికిరి.

ఇదియు గాక, క్రీస్తుప్రభువు తన సత్యమును సంపూర్తిగా గనపరచుటకు అంత్యదినమందు వచ్చెదనని యాయన ప్రకటించినది కాక, ప్రకటన 1: 7 లో లోకులకు సంపూర్ణసత్య విమర్శచేయుటకై మేఘములలో వచ్చుచున్నాడనియు, ప్రతి నేత్రము ఆయనను జూచి రొమ్ము కొట్టుకొనుననియు లిఖింపబడియున్నది.

ఇప్పుడు, క్రీస్తు దేవుని కుడిపార్శ్వమున కూర్చుండెను. క్రీస్తు దేవుని కుమారుడై నిత్యానాదినుండి దేవునియొద్ద నుండెను. ఆయన దేవుని శక్తి ప్రభావ

ములలో పాలివాడై తండ్రితోను పరిశుద్ధాత్మతోను గూడ దేవుడై యున్నాడు. ఇట్లుండినను మానవుడైన క్రీస్తు తన ఆరోహణమునకు పూర్వము దేవుని కుడిపార్శ్వమున కూర్చుండక, ఆరోహణ సమయమందే దేవమానవుడైన ఆయన ఔన్నత్యస్థితి నొంది పరలోక భూలోకములమీద సర్వాధికారమును వహించుకొనెను. తండ్రి క్రీస్తును మృతులలోనుండి లేపి సమస్తమైన ఆధిపత్యముకంటెను అధికారముకంటెను ఈయుగమునందు మాత్రము కాక, రాబోవు యుగమునందును పేరు పొందిన ప్రతి నామముకంటెను ఎంతో ఎచ్చుగా పరలోకమునందు తన కుడిపార్శ్వమున కూర్చుండబెట్టుకొని యున్నాడు. మరియు సమస్తమును ఆయన పాదముల క్రింద నుంచెను [ఎఫెసీ 1: 20-22.] ఆయన దూతలమీదను అధికారులమీదను శక్తులమీదను అధికారము పొందినవాడాయెను [1 పేతు. 3: 22.] క్రీస్తు దేవుని కుడిపార్శ్వమునందుండి మన కొఱకు విజ్ఞాపనము చేయుచున్నాడు. క్రీస్తు దేవుని కుడిపార్శ్వమందు కూర్చుండి, అన్నిటికి రాజుగాను ప్రభువుగాను నుండును. తండ్రి ఆయన చేతికి సమస్తము నప్పగించెను. [యోహా 13: 3.]

క్రీస్తు ఈలోకములో నున్నప్పుడు పరిశుద్ధాత్మను పంపుదుననియు, ఆయన వచ్చి మిమ్ములను బలపఱచుననియు శిష్యులతో చెప్పెను. ఆవిధముగానే క్రీస్తు ఆరోహణమైన పదిదినములకు వచ్చి శిష్యులను బలపఱచెను.

నేను తండ్రిని వేడుకొందును, మీయొద్ద నెల్లప్పుడు నుండుటకై ఆయన వేఱొక ఆదరణ కర్తను అనగా సత్యస్వరూపియగు ఆత్మను మీకనుగ్రహించును [యోహాను 14: 16]. ఆదరణ కర్త అనగా తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించి, నేను మీతో చెప్పిన సంగతులన్నియు మీకు జ్ఞాపకము చేయును [యోహా 14: 26]. తండ్రియొద్దనుండి మీయొద్దకు నేను పంపబోవు ఆదరణకర్త, అనగా తండ్రియొద్దనుండి బయలుదేరు సత్యస్వరూపియైన యాత్మవచ్చినప్పు డాయన నన్నుగూర్చి సాక్ష్య మిచ్చును [యోహా. 15: 26].

క్రీస్తు చేసిన వాగ్దాత్త ప్రకారము పరిశుద్ధాత్మ వచ్చి శిష్యులమీద వ్రాలెను. పిమ్మట వారు పరిశుద్ధాత్మ ప్రభావమువలన బలపఱుపబడి వింతైన కార్యములు చేసిరి. క్రీస్తును గుఱించి బలమైన సాక్ష్య మియ్యగలిగిరి. [అపో. కా. 2 అ.]

పరిశుద్ధాత్మ పరిశుద్ధ త్రిత్వలోని మూడవ మూర్తియై యున్నాడు. ఆయన తండ్రికుమారులయొద్దనుండి బయలుదేరువాడై, తండ్రికుమారులతోగూడ ఆరాధింపబడి మహిమపఱుపబడును. తండ్రివలెను, కుమారునివలెను పరిశుద్ధాత్మకూడ నిజమైన దేవుడై మహిమప్రభావములయందు వారికి సమానుడై యున్నాడు.

పరిశుద్ధాత్మచేయు కార్యములను వినుడి: (1) లోకముచేత పాపమును ఒప్పుకొనజేయును [యోహా 16: 8.]; [2] క్రీస్తును గుఱించి సాక్ష్యము నిచ్చును

(యోహా. 15: 16.); [3] భక్తుల నాదరించును (అ. కార్య. 9: 31.); [4] మన దౌర్బల్యమును జూచి సహాయముచేయును [రోమా. 8: 26.]; [5] పరిశుద్ధపఱుచును [రోమా 15: 15]. తండ్రికుమారులవలె ఆయనయు ఇట్టి కార్యములను జేయును.

దైవత్రిత్వమునందుగల ముగ్గురి పనులు:—

మానవుల కగత్యమయిన రక్షణోపాయమును తండ్రి యుద్దేశించెను. కుమారుడు రక్షణ కార్యమును నిర్వహించెను. పరిశుద్ధాత్మ ఆరక్షణను ప్రజలకు విడ తెల్పి స్థిరపఱచి వ్యాంపజేయును.

సోదరులారా! ఈవిధముగా త్రియేకదేవుడు భక్తులను రక్షించుటకు ఆరంభించిన తరువాత ఆపని సంపూర్తియగు వఱకు ఎంత మాత్రమును మానడు.

"ఈ రాజ్య సువార్త సకల జనములకు సాక్ష్యార్థమై లోకమందంతటను ప్రకటింపబడును; అటుతరువాత అంతము వచ్చును" [మత్త. 24: 14; మార్కు 13: 10.]

## 10 వ ప్రకరణము.

## యేసుక్రీస్తు మోక్షప్రదాయకుడనుటను గుఱించి.

వెనుకటి ప్రకరణములలో యేసుక్రీస్తు భక్తపాపహరుడని ఋజువుపఱచి యుంటిమి. ఆయనే పాపులనిమిత్తము మహాబలియై పాపులను రక్షింప సమర్థుడని కూడ తెలిపియుంటిమి. ఇప్పుడు ఆయన కల్యాణగుణములలో కొన్నిటిని గుఱించి కొంత యోజించి చూతము.

యేసుక్రీస్తు:—

[1] దేవుడు [కీర్తన. 45: 6; యెషయా. 9: 6; యోహాను 1: 1; రోమా 9: 5; తీతు 2: 13; 1 యోహా. 5: 20; యోహా. 20: 28; ఫిలిప్పీ 2: 6; హెబ్రీ. 1: 8; కొలొస్సై 2: 9.]

ఈత్రియేక దేవుని పేరు క్రీస్తునకు నియ్యబడియున్నది.

(2) స్వయంభువు [యోహా. 1: 4 ప్రకటన. 1: 8; యోహా 5: 26].

* బైబిలు వేదములోని దేవునకు "యెహోవా" అను హెబ్రూభాషాపదము క్రీస్తునకు వాడబడియున్నది. ఈపదము "హాయా" (ఉండుట) అను హెబ్రూధాతువునుండి పుట్టుచున్నది. యెహోవా అనగా "స్వయంభువు" లేక "తనంతట తాను ఉండువాడు". యెహోవా యను నామముక్రీస్తునకు [యెషయా. 44: 6;

---

*స్వయంభవతీతిస్వయంభూః=తనకు తానే పుట్టినవాడు. లింగపురాణము, పూర్వభాగము, 71 అధ్యాయములో,—శ్లో॥ అనాదిత్వాచ్చపూర్వత్వాత్స్వయమ్భూరితిసంస్మృతః॥ "ఆది లేనివాడగుటవలనను పూర్వుడగుటవలనను స్వయంభువని చెప్పబడెనని" యున్నది.

యిర్మీయ 23: 6] నిరూప్యబడియున్నది.

[3] నిత్యుడు [యోహాను 1: 1-3; 8: 5; హెబ్రీ 13: 8; 1 యోహా. 5: 20.]

[4] పరిశుద్ధుడు [లూకా. 1: 35; యోహా. 6: 69; హెబ్రీ 7: 26; అపో. కా 3: 14.]

[5] పాపహారుడు (మత్త. 20: 28; మార్కు 10: 45; ఎఫెసీ 1: 7; అపో కా. 13: 39; ఎఫెసీ 5: 2; 1 తిమో. 2: 5, 6; తీతు. 2: 14; యెషయా. 44: 6.)

[6] మోక్షప్రదాత (ప్రకటన 2: 10; మత్తై 10: 22; 19: 28, 29; యోహా 10: 27, 28; యాకోబు. 1: 12.)

సోదరులారా! ఇత్యాది కల్యాణగుణములు యేసుక్రీస్తునందు ప్రతిపాదింపబడి యున్నవి. కాబట్టి యేసుక్రీస్తే పాపులమైన మనకు తగిన ఆశ్రయము. ఆయనే తగిన ముక్తిబాట; విమోచనకర్త; మన మాయన యందే భక్తి నిలుపవలయును. ఇది తప్ప వేఱు మార్గము లేదు.

ఇది యిట్లుండగా, మన దేశస్థులలో కొందఱు తఱుచుగా నిట్లు చెప్పుదురు:—భక్తి యెవరియందుంచినను రక్షింపబడవచ్చును. "ఏకోదేవః కేశవో వాశివోవా" అను ప్రమాణమును బట్టి హరియనినను, హరుడనినను, క్రీస్తు అనినను ఒక్కడే దేవుడు. పేరు మాత్రమే భేదము. కావున భక్తులందఱు చేరవలసినది యామోక్షస్థానమే కాదా?

ఈ ప్రశ్న సామాన్యముగా పండితులచేతను, పామరులచేతను వేయబడుచున్నది. దీనికి మేము చెప్పు ప్రత్యుత్తరము సావధానబుద్ధితో యోజింపుడు. మనము నమ్మెడి వస్తువు మంచిది కావలెను; ఆవస్తువు మంచిది కానియెడల, మన మెంత గట్టిగా నమ్మినను ప్రయోజన ముండదు. సత్తురూపాయను మన మెంతగా నమ్మినను మనకు లాభకారియగునా? గులకరాతిని కోహినూరు వజ్రమని యెంత విశ్వసించినను ప్రయోజనము కాదు. ముందుగా మనము వస్తువును జాగ్రతగా పరీక్షించి యది మంచిదైనపక్షమున దానిని నమ్మవలెను. అప్పుడు మన నమ్మిక మనకు లాభకారియగును.

ఇంకొక సంగతి విచారింతము. శిస్తు దస్తులు జమచేయుటకు గ్రామ మునసబు ఒకడేర్పడియుండగా, ఆశిస్తు ఎవరికిచ్చిన నేమి, శిస్తు ఇచ్చుటయే కదా మన పనియని దారి వెంటబోవువానికి ఆశిస్తు ఇచ్చిన యెడల ఆమునసబు ఊరుకొనునా? మన దేశమునకు చక్రవర్తిగ మూర్ధాభిషిక్తుడైన ఏడవ ఎడ్వర్డుగారికి లోబడి

యాయన చట్టములను గైకొని ఆయనను గౌరవపఱుపవలసియున్నది. అట్లు కాక, మన మితరులను చక్రవర్తిగా జేసికొని నియమింపబడిన చక్రవర్తిని విసర్జించిన యెడల ఆయన మనలను రక్షింపక బహుగా దండించును గదా. అలాగుననే, నిజ దేవునికి చెల్లింపవలసిన పూజనమస్కారము లాయనకు చెల్లింపక పరులకు చెల్లించి నట్టయిన ఆయన మనలను సుఖముగా విడిచిపెట్టడు.

మఱియొకటి విచారించి చూతము. లోకములో కన్యలకు వివాహము చేయ బూనుకొనినపుడు తగిన వరుని వెతికి అవరుడు మర్యాదగల కుటుంబములోనివాడా? మంచిప్రవర్తనగలవాడా? ఆరోగ్యముకలవాడా? విద్యాబుద్ధులుకలవాడా? మరణ పర్యంతము భార్యను పోషింపగలవాడా? అను సంగతు లాలోచించి వివాహము చేయుచున్నారు. కావున రక్షింప సమర్థుడో కాడో ఆలోచింపకుండ ఎవరి యందయినను భక్తి నిలుపరాదు. చూచుకొనకుండ నిలుపు భక్తి భక్తి యనబడదు. దేవుని యెడల మానవునకుగల ప్రేమభక్తిగా జెల్లుచున్నది. శంకరాచార్యులవారు భక్తియనగా నెట్లు నిర్వచించుచున్నారో చూతుము.

శ్లో॥ అంకోలంనిజబీజసంతతిరయస్కాంతోపలంసూచికా।
సాధ్వీనైజవిభుంలతాక్షితిరుహంసింధుస్సరిద్వల్లభం।
ప్రాప్నోతిహాయథాతథాపశుపతేఃపాదారవిందద్వయం।
చేతోవృత్తిరుపేత్యతిష్ఠతిసదాసాభక్తిరిత్యుచ్యతే॥

అనగా, ఊడుగుచెట్టును దానిగింజలును, సూర్యకాంతమును సూదియు, పతి వ్రత తన భర్తను, తీగె వృక్షమును, నది సముద్రమును బొందు విధముగానే సర్వదా ఈశ్వరుని పొంది మనస్సుండుటకే భక్తి యని పేరు, అని శివానందలహరియందు జెప్పబడియున్నది.

"పూజ్యేయో౽నురాగః విద్యతేసోభక్తిః" [వృత్తికారః]

"పూజ్యునియందు ఏయనురాగము [విశేషప్రేమ] కనబఱుపబడునో అది భక్తి" యని [వృత్తికారుడు] చెప్పుచున్నాడు.

కాబట్టి ప్రియమిత్రులారా! మనలను వేయిగన్నుల వీక్షించుచు సహస్రవిధ ముల బోషించి రక్షించుచు నత్యంతదయార్ద్రదృష్టితో గాచుచున్న దయామయుం డగు దేవుని మనము ప్రేమించుట భక్తియనబడును. మూడవ ప్రకరణములో, వ్రాయబడి యున్నట్టుగా ఏపూజ్యునియందు ప్రీతిసేవనము, విశేష ప్రేమ, స్నేహ

ముతో గూడిన ధ్యానము, మర్యాద పురస్సరమైన స్నేహానుబంధము, స్నేహ పుర
స్సరమైన దేవుడు గొప్పవాడను బుద్ధి యీ మొదలగు అర్థముగల భక్తితో మన
యాత్మలు అను కన్యలను సమర్పించుకొందుము? హరిహరులలో పూజ్యుడెవడు?
ఇద్దఱొకటియై యుండి నామభేదము మాత్రము గలిగి యుండిరా? హరియనిన,
హరుడనిన, క్రీస్తు అనిన నొకటి కాదు సుమండీ!!! ఇందుకు తార్కాణము అథర్వ
శిఖోపనిషత్తు.

శ్రు॥ శివఏకోధ్యేయశ్శివంకరస్సర్వమన్యత్పరిత్యజ్యసమ
స్తాథర్వశిఖేతామధీత్యద్విజోగర్భవాసాద్విము
క్తోవిముచ్యతఏతామధీత్యద్విజాగర్భవాసాద్వి
ముక్తోవిముచ్యతఇత్యోగ్ సత్యమిత్యుపనిషత్॥

"శివుడొక్కడే ధ్యానింప దగినవాడు. శుభకరుడు. మిగిలిన సర్వమును
వదలి సమస్తాథర్వశ్రేష్ఠమైన దీనిని (ఈయుపనిషత్తును) చదివి ద్విజుడు గర్భవాసము
నుండి విడుదలగలవాడయి మోక్షమును జెందును. దీనిని చదివి ద్విజుడు గర్భవా
సమునుండి విడుదలగలవాడై మోక్షమును జెందును. ఈయుపనిషత్తు సత్యమైనది"
భస్మజాబాలోపనిషత్—2 వ అధ్యాయములో,—

శ్రు॥ యస్మాన్నమత్తోన్యత్పరోహమేవపరోవిశ్వాధికోవా
మేవవిదిత్వాఽమృతత్వమేతితరతి॥

"ఏకారణమువలన నాకన్న వేఱొకడు లేడో ఆకారణముచేతనే నేనేపరు
డను విశ్వాధికుడను నన్నే తెలిసికొని మనుష్యుడు మోక్షమును పొందుచున్నాడు,
దాటుచున్నాడు" అని శివుడు జాబాలఋషికి బోధించెను. స్కాందపురాణము,
యజ్ఞవైభవఖండము, బ్రహ్మగీతలు, 4 వ అధ్యాయమునందు,—బ్రహ్మోవాచ॥

శ్లో॥ అతస్సర్వంపరిత్యజ్యశివాదన్యత్తుదైవతమ్।
తమేవశరణంగచ్ఛేత్సద్యోముక్తింయదీచ్ఛతి॥
విష్ణుభక్త్యాచమద్భక్త్యానాస్తినాస్తిపరాగతిః।
శంభుభక్త్యైవసర్వేషాంసత్యమేవమయోదితమ్॥
శంభుభక్తస్యదేహాస్మిన్ప్రసాదోగమ్యతేయథా।

నతథావిష్ణుభక్తస్యనమద్భక్తస్యదేహినః॥
తస్మాన్ముముక్షుర్మాం విష్ణుమపిత్యక్త్వామహేశ్వరమ్।
ఆశ్రయోత్సర్వభావేనప్రసాదంకురుతేహినః॥

"అందువలన వెంటనే ముక్తిని గోరిన యెడల సమస్తమును వదలి శివుని కన్న వేఱుదైవము లేదని నమ్మి యతనినే శరణము పొందవలెను. విష్ణుభక్తిచేతను, నాభక్తిచేతను ఉత్కృష్టమైన ఆనందస్థానము లేదులేదు. అందుఅసను శివునియందు భక్తియే సత్యమని నాచేజెప్పబడినది. శివభక్తుని దేహమందు అనుగ్రహము పొందబడినట్లు విష్ణుభక్తుడయిన దేహికిని నాభక్తుని దేహమునకు లేదు. కాబట్టి మోక్షము గోరుచుండెడు నన్నును విష్ణువును వదలివేసి మహేశ్వరుడైన శివుని సంపూర్ణమనస్సుతో ఆశ్రయింపవలెను. అతడనుగ్రహించున"ని బ్రహ్మ బోధించెను.

పయి వాక్యములవలన, హరుడు మోక్షకర్తయనియు, హరిభక్తివలన మోక్షము లేదనియు గన్పట్టుచున్నది. పయివాక్యములకు భిన్నమైన బోధ వినుడు:—
పరమోపనిషత్,

శ్రు॥ మోక్షశ్చవిష్ణుప్రసాదేనవినానలభ్యతే।
యస్యప్రసాదాత్పరమాం శ్రీరూపాదస్మాత్సంసారాన్ముచ్యతేనాపరేణ। నారాయణోసాపరమోవిచిన్త్యోముముక్షుభిఃకర్మపాశాదముష్మాత్॥

"మోక్షము విష్ణుప్రసాదము [కృప] లేనిది పొందబడదు. ఇతరమైన దానివలన గాక ఎవనియొక్క విశేషమైన ఆర్తిరూపమయిన ప్రసాదమువలన ఈసంసారమునుండి మనుష్యుడు విడువబడుచున్నాడో అట్టి యావిష్ణువు ఈసంసార పాశమువలన మోక్షమును గోరువారిచేత నెక్కువగా ధ్యానింపదగినవాడ"ని వ్రాయుచున్నది. మహానారాయణోపనిషత్తు, 8 వ అధ్యాయములో,—

శ్రు॥ మోక్షందాపయతిచతుర్ముఖాదీనాంసర్వేషామపి
వినావిష్ణుభక్త్యాకల్పకోటిభిర్మోక్షోనవిద్యతే॥

“మోక్షము నిచ్చుచున్నాడు. చతుర్ముఖబ్రహ్మ మొదలయిన వారికి గూడ విష్ణుభక్తి లేనియెడల కోటికల్పములకైనను మోక్షము కలుగ జాలదు” అని చెప్పి యున్నది. విష్ణుపురాణము, 1 అంశము, 9 అధ్యాయములో,—

> బ్రహ్మోవాచ॥ పరఃపరస్మాత్పురుషాత్పరమాత్మస్వరూపధృత్। యోగిభిశ్చింత్యతేయోఽసౌముక్తిహేతోర్ముముక్షుభిః॥ విశుద్ధబోధవన్నిత్యమజమక్షయమవ్యయమ్। అవ్యక్తమపికారణంయత్తద్విష్ణోఃపరంపదమ్॥ నస్థూలంనచసూక్ష్మంయన్నవిశేషణగోచరమ్। తత్పదంపరమంవిష్ణోఃప్రణమామసదామలమ్॥ యస్యాయుతాయుతాంశాంశేవిశ్వశక్తిరియంస్థితా। పరబ్రహ్మస్వరూపస్యప్రణమామస్తమవ్యయమ్॥ యద్యోగినస్సదోద్యుక్తాఃపుణ్యపాపక్షయేక్షయమ్॥ పశ్యంతిప్రణవేచింత్యంతద్విష్ణోఃపరమంపదమ్॥ యన్న దేవానమునయోనచాహంనచశంకరః। జానంతిపరమేశస్యతద్విష్ణోఃపరమంపదమ్॥

“పరాత్పరుడైన పురుషుని కన్న శ్రేష్ఠుడైన వాడును, పరమాత్మస్వరూపమును ధరించిన వాడును, ముక్తిహేతువుచేత మోక్షమును గోరెడు యోగులచేత చింతింపబడు వాడును విష్ణువే అయియున్నాడు. ఏది నిర్మల బోధరూ ఏది శాశ్వతమైనదో, ఏది పుట్టుక లేనిదో, ఏది మార్పు లేనిదో, అది విష్ణువుయొక్క శ్రేష్ఠమైన స్థానమై యున్నది. ఏది స్థూలము కానిదో, ఏది సూక్ష్మము కానిదో, ఏది గుణములచేత తెలియబడదో, అట్టి నిర్మలమైన విష్ణువు స్థానమును గూర్చి నమస్కారము. దేనియొక్క వేవేల యంశమునందు ఈవిశ్వశక్తి యున్నదో అట్టి పరబ్రహ్మ స్వరూపముయొక్క ఆనాశము లేని దానిని గురించి నమస్కారము. దీనిని యోగులెల్లప్పుడును ప్రయత్నము చేయుచున్నవారై పుణ్యపాపములు నశింపగా ప్రణవమందు నాశరహితమైనట్టియు, చింతింపశక్యము కానట్టియునైన దానిని చూచుచున్నారో అది విష్ణువుయొక్క పరమపదము. దేవతలు, మునులు, నేనును, శివుడును దేనిని తెలియలేదో అది పరమేశ్వరుడైన విష్ణువుయొక్క శ్రేష్ఠమైన స్థానము” అని బ్రహ్మ పలికెను. ఇత్యాది వచనములనబట్టి, శివుడు మోక్షకర్త

కాడనియు, హరియే మోక్షప్రదాయకుడనియు తెలియబడుచున్నది. మరికొన్ని గ్రంథములయందు వీరిద్దఱు కారని తేలుచున్నది. ఇందుకు దృష్టాంతము, దేవీభాగవతము, పంచమస్కంధము, 19 వ అధ్యాయము:—

శ్లో॥ శప్తోహరిస్తుభృగుణాకుపితేనకామంమీనోబభూవకమఠఃఖలుసూకరస్తు। పశ్చాన్నృసింహఇతియశ్ఛలకృద్ధరాయాంతాన్సేవతాంజననిమృత్యుభయంనకింస్యాత్। శమ్భోఃపపాతభువిలిఙ్గమిదంప్రసిద్ధంశాపేనతేనచభృగోర్విపినేగతస్య। తేయేనరాభువిభజన్తికపాలినన్తు తేషాంసుఖంకథమిహాపిపరత్రమాతః॥

"విష్ణువు కోపమును పొందిన భృగువుచేత కామముకు మిసగలిగి శపింపబడినవాడై చేపగాను, తాబేలుగాను, సూకరముగాను అయెను గదా. అటుపిమ్మట నృసింహుడుగ బడెను. ఇతడు (విష్ణువు) చలించినవాడే. భూమియందు వారిని సేవించినవారలకు ఓతల్లీ! మరణభయమేలకలుగదు? (కలుగును.) అడవియందుండిన (దారుకావనము) భృగువుయొక్క శాపముచేత శివునియొక్క లింగము భూమిమీద (తెగి) పడెను. ఇది యందఱకును తెలిసినదే. ఏమనుష్యులు ఈశివుని భజింతురో యట్టి వారలకు భూమియందును ఇంకను నితరస్థలములయందును, ఓతల్లీ! సుఖమెట్లుకలుగును? కలుగదు" అని స్పష్టముగా బోధింపుచున్నది. దేవీభాగవతము.

శ్లో॥ పరాశక్తిప్రభావ్యాయంనోల్లంఘ్యఃకేనచిత్క్వచిత్।
యస్యానుగ్రహమిచ్ఛేత్సామోచయత్యేవతంక్షణాత్॥
మహాన్తోపినముచ్యన్తేహరిబ్రహ్మహరాదయః। పామరా అపిముచ్యన్తేతథాసత్యవ్రతాదయః॥ తస్యాస్తుహృదయంకోపినవేత్తిభువనత్రయే। తథాపిభక్తవశ్యేయంభవత్యేవసునిశ్చితమ్॥ తస్మాత్తద్భక్తిరాస్థేయాదోషనిర్మూలనాయచ। రాగదమ్భాదియుక్తాచేత్సాభక్తిర్నాశినీభవేత్॥

"పరాశక్తియొక్క యాప్రభావము కొంచెమయినను, ఎప్పుడైనను, ఎవరి వలననైనను దాటగూడనిది. ఆమెయొక్క అనుగ్రహమును కోరిన యెడల ఆమె ఆభక్తునికి మోక్షమియ్యగలదు. మహాత్ములయిన హరి, బ్రహ్మ, రుద్రుడు మొదలగువారలును మోక్షమును జెందలేరు. పామరులయినను (ఆమె అనుగ్రము జెందిన యెడల) మోక్షమును జెందగలరు. అట్టివా రెవరనిన సత్యవ్రతుడు మొదలయినవారలు. ఆమె హృదయమును మూడులోకములయందు ఎవడును గుర్తెరుగడు. అట్టుండియు ఈమె భక్తులకు వశ్యురాలుగా నిశ్చయింపబడినది. అందువలన పాపనిర్మూలము కొఱకు ఆభక్తి పొందదగినది. ఆభక్తి రాగము, డంబము, మొదలయినవానితో చేరిన దాయెనేని, ఆభక్తి నాశనమును జేయునదియగును" అని వక్కాణింపుచున్నది. ఇది యిట్లుండనిమ్ము.

హిందూగ్రంథములు చదువుచుండగా, ఆభక్తులకన్న ఈభక్తులు శ్రేష్ఠులు, ఈభక్తులకన్న ఆభక్తులు శ్రేష్ఠులని పోరాటములు పెక్కులు కాన్పించుచున్నవి. ఇందుకు ఋజువుగా, లింగపురాణము, పూర్వభాగము, ౹వ అధ్యాయములో,—

శ్లో॥ అన్యభక్తసహస్రేభ్యోవిష్ణుభక్తోవిశిష్యతే।
విష్ణుభక్తసహస్రేభ్యోరుద్రభక్తోవిశిష్యతే॥
రుద్రభక్తాత్పరతరోనాస్తిలోకేనసంశయః॥

"ఇతర భక్తులు వేయిమందికన్న విష్ణుభక్తు డొకడే యెక్కువ. విష్ణుభక్తులు వేయిమందికన్న రుద్రభక్తుడే యెక్కువ. రుద్రభక్తునికన్న వేఱొకడు ఉత్తముడు మూడులోకములలో లేడు ఇందుకు సందేహము లేదు" అని చెప్పియున్నది. కూర్మపురాణములో,—

శ్లో॥ అర్చయేద్దేవవిరూపాక్షంసద్యోముక్తిర్య
దిచ్ఛసే। సూర్యాగ్నిబ్రహ్మభక్తానాముత్తమోవై
ష్ణవఃపరః। వైష్ణవానాంసహస్రేభ్యఃశివభక్తో
విశిష్యతే॥

"వెంటనే ముక్తికావలెనని కోరినయెడల శివుని పూజింపవలెను. సూర్యుడు అగ్ని, బ్రహ్మ వీరికి భక్తులలో పరుడైన విష్ణుభక్తుడే ఉత్తముడు. వైష్ణవ వేయింటికన్న శివభక్తుడు, డెక్కువగున"ని చెప్పబడియున్నది. ఇందుకు విరుద్ధవాక్యము లాలకింపుడు:—వరాహపురాణములో,—

శ్లో॥ శంకరస్యతు యోభక్తస్సప్తజన్మాంతరం నరః।
తస్యైవతు ప్రసాదేన విష్ణుభక్తిః ప్రజాయతే॥
త్రిభిః ప్రజాపతేర్భక్తస్సప్తభిశ్శంకరస్యతు।
వింశత్యాగ్నీంద్రసూర్యాదేర్విష్ణుభక్తిః ప్రజాయతే॥

"శివభక్తుడు ఏడుజన్మములకు ఆయనయొక్క యనుగ్రహముచేత విష్ణుభక్తుడై పుట్టును. బ్రహ్మయొక్క భక్తుడు మూడుజన్మములకు విష్ణుభక్తుడై పుట్టును. అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు, మొదలైనవారియొక్క భక్తులకు నిరువదిజన్మములకు విష్ణుభక్తి కలుగును" అని నుడువబడి యున్నది. శ్రీవరాహపురాణమందే,—

॥ వర్ణాశ్రమాచారపరస్సప్తజన్మాని యోద్విజః।
ఏకాంతసూర్యభక్తస్స్యాత్సవిప్రస్సప్తజన్మసు॥
తతస్తత్పుణ్యమహాత్మ్యాద్రుద్రభక్తో భవిష్యతి।
తత్రైవ సప్తజన్మానిశివభక్తిపరాయణః। మహాత్మా
తేనపుణ్యేన వైష్ణవత్వం లభేతసః॥

"ఏడుజన్మములయందు వర్ణాశ్రమాచారములయందు ఆసక్తి గలిగి యుండిన మనుష్యుడు బ్రాహ్మణుడగును. ఆబ్రాహ్మణుడు ఏడుజన్మములయందు ఏకాంతభక్తివలన సూర్యభక్తుడుగా నగును. పిమ్మట, అట్టి ఆపుణ్యమహాత్మ్యమువలన ఏడుజన్మములకు సూర్యభక్తుడు రుద్రభక్తుడగును. అట్లే ఏడుజన్మములయందు శివభక్తిపరాయణుడగువాడు ఆగొప్ప పుణ్యముచేత వైష్ణవత్వమును పొందును" అని వ్రాయబడియున్నది.

భక్తుల తారతమ్యములమాట యట్లుంచుడి. హరిహరులు కూడ భక్తులే యని పురాణములు చాటుచున్నవి. హరి శివుని భక్తుడనినందుకు ప్రమాణవాక్యములు:

మహాభారతము, ద్రోణపర్వము, వ్యాసాశ్వత్థామసంవాదమునందు—

వ్యాసః॥ సఏషరుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః॥

"విష్ణువు శివునియొక్క భక్తుడును, శివునినుండి పుట్టినవాడునై యున్నాడు" అని వ్రాయబడియున్నది. మహాభారతము, అనుశాసనీకపర్వము, 14 వ అధ్యాయమున, భీష్మయుధిష్ఠిరవాసుదేవసంవాదమునందు,—

భీష్మః॥ రుద్రభక్త్యాతుకృష్ణేనజగద్వ్యాప్తంమహాత్మనా॥

"రుద్రభక్తివలన మహాత్ముడైన కృష్ణునికి జగద్వ్యాప్తి కలిగెను" అనియు; పద్మపురాణము, మాఘమాసమాహాత్మ్యము, 25 వ అధ్యాయమున,—శ్లో॥ సర్వేషాంశివభక్తానాంయథానారాయణఃపరః॥ "సకల శివభక్తులలో నారాయణుడు శ్రేష్ఠుడ"నియు ప్రతిపాదింపబడియున్నది. ఇంతయేల? కూర్మపురాణము, పూర్వభాగము, 9 వ అధ్యాయములో,—"తుష్టోస్మిసర్వథాఽహంతేభక్త్యాతవజగన్మయ। వరంవృణీష్వనావాంవైభిన్నౌహిపరమార్థతః॥ శ్రుత్వాథదేవవచనంవిష్ణుర్విశ్వజగన్మయం। ప్రాహగంభీరయావాచాసమాలోక్యచతుర్ముఖం। ఏషఏవవరఃశ్లాఘ్యోయదహంపరమేశ్వరం। పశ్యామిపరమాత్మానంభక్తిర్భవతుమేత్వయి" అని విష్ణువు శివునిని నీయందు భక్తి నిరంతరముగా నుండవలయునని వేడుటయును చెప్పబడియున్నది. ఇట్లే యింక ననేక వేదశాస్త్ర పురాణములలో విష్ణువు శివపూజాపరాయణుడని నిరూపింపబడుచున్నది.

శైవవాక్యములకు విరుద్ధ విషయములను వినుడి:—హరుడు విష్ణుభక్తుడని చెప్పబడిన వాక్యములు లేకపోలేదు. భాగవతము, ఏకాదశస్కంధమునందు,—

శ్లో॥ వైష్ణవానాంయథాశంభుః॥

"వైష్ణవులలో శివుడు శ్రేష్ఠుడ"ని యున్నది. ఈలాగుననే పద్మపురాణము, మాఘమాసమాహాత్మ్యము, 25 వ అధ్యాయమున వ్రాయబడియున్నది. దేవీభాగవతము, నవమస్కంధము, 48 అ: 80 శ్లో॥ లో "పుత్రిణాంచైవపుత్రేషువైష్ణవానాంయథాహరః" అని వ్రాసియున్నది. హరుడు వైష్ణవులలో నుత్తముడని దాని భావము. బ్రహ్మవైవర్తకపురాణము, బ్రహ్మఖండము, 11 వ అధ్యాయములో,—

శ్లో॥ నాస్తిగంగాసమంతీర్థంనచకృష్ణాత్పరఃసురః।
నశంకరాద్వైష్ణవాశ్చనసహిష్ణుర్ధరాపరా॥

"గంగాసమమైన తీర్థములేదు. కృష్ణునికన్న బరుండగు దేవుడును లేడు. శంకరుని కన్న బరుండగు వైష్ణవుడు లేడు" అని యున్నది. బ్రహ్మవైవర్తపురాణము, బ్రహ్మఖండము, 19 వ అధ్యాయములో,—

బ్రహ్మ॥ మాంమహేశంచధర్మంచభక్తంచభక్తవత్సల॥

"నేనును, మహేశ్వరుడును, ధర్ముండును నీకు భక్తులము. నీవు భక్తులయందు వాత్సల్యము కలవాడవు" అని బ్రహ్మ కృష్ణునితో చెప్పెను. శివుడు

నిత్యము రామతారకమంత్రోపాసకుడని వేదశాస్త్ర పురాణములయందు వ్రాసి యున్నది.

ప్రియసోదరులారా! పయి వాక్యములన్నియు నిష్పక్షపాతబుద్ధితో విచారించి చూడగా, „శ్రుతియశ్చభిన్నాః స్మృతియశ్చభిన్నాః మునఃశ్రినామతయశ్చభిన్నాః" అను భారతవచనమును బట్టి హరిహరులలో యాథార్థ్యమయిన మోక్షప్రదాయకు డెవడో తెలియుటలేదు „స్వయంతీర్ణాపరంతారయతి" అను న్యాయముచేత తామే తమ రక్షణ విషయమై యాపద పడినవారును, నితరులకు భక్తులైనవారును పరులకు భక్తపాపహరులుగా నెట్లుండగలరు? అది యసాధ్యము. „సందిగ్ధవాక్యశేషాత్" అను న్యాయమును బట్టి ముక్తిదాయకుడు హరియా, హరుడా, శక్తియా, మతిరొక దేవతా యని సందేహము వచ్చెను. మోక్షప్రదాతయు, భక్తపాపహరుడును క్రీస్తే యని బైబిలు వక్కాణించుచున్నది. ఈక్రింది బైబిలు వాక్యములను వినుడి: —

„దేవుడు లోకము నెంతో ప్రేమించెను. కాగా ఆయన తన అద్వితీయకుమారుడుగా పుట్టిన వానియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్యజీవము పొందుటకై ఆయన ననుగ్రహించెను" (యోహా. 3: 16).

„మనము దేవుని ప్రేమించితిమని కాదు, ఆయనే మనలను ప్రేమించి మన పాపములకు శాంతికరుడుగా నుండుటకు తన కుమారుని పంపెను; దీనిలో ప్రేమ యున్నది" (1 యోహా. 4: 10). „ఎవడైనను పాపము చేసినయెడల, నీతిమంతుడైన యేసుక్రీస్తను ఉత్తరవాది తండ్రియొద్ద మనకున్నాడు. ఆయనే మన పాపములకు శాంతికరుడై యున్నాడు; మన పాపములకు మాత్రమే కాదు సర్వలోకమునకును శాంతికరుడై యున్నాడు" (1 యోహా. 2: 1, 2).

„మరి యెవని వలనను రక్షణ కలుగదు; ఈ నామముననే మనము రక్షణ పొందవలెనుగాని ఆకాశము క్రింద మనుష్యులలో నియ్యబడిన మరియే నామమున రక్షణ పొందలేము" (అపో. కా. 4: 12).

„పాపులను రక్షించుటకు క్రీస్తుయేసు లోకమునకు వచ్చెనను వాక్యము నమ్మతగినదియు, పూర్ణాంగీకారమునకు యోగ్యమైనదియునై యున్నది" (1 తిమో. 1: 15).

కాబట్టి, భ్రాతృవరులారా! „వేయబడినది తప్ప మరియొక పునాది యెవడును వేయనేరడు; ఈ పునాది యేసుక్రీస్తే" (1 కొరింథి 3: 11) అని పరిశుద్ధుడైన పౌలు చెప్పినట్టుగాక పాపాత్ముడు తరించుటకు వేఱుమార్గము లేనేలేదు.

హిందువులు మతియొక ప్రశ్న తఱుచుగ వేయుదురు. భక్తి దేవుడే పుట్టింపవలయును. దేవుడు కలుగజేయకపోయిన పక్షమున మానవుల కెట్లు కలుగును?

ఉత్తరము వినుడు:—దేవుడు తన సృష్టియందు మానవులకు బుద్ధి, తెలివి, వివేకము, యుక్తాయుక్త వివేచనాశక్తి యీమొదలుగాగల సాధనములను మితముగా అనగా గావలసినంతగా ననుగ్రహించి యున్నాడు. కనుకనే, ఈలోక వ్యవహారములయందు మానవులు తమ తెలివితేటలు ధారాళముగా వినియోగపఱుచుకొని తమ కార్యములను చక్కపెట్టుకొనుచున్నారు. ఇది మన కందఱకు ననుభవనీయమే కదా. అలాగుననే మనము పరసంబంధమైన సంగతులయందును, మన బుద్ధిజ్ఞానములు ప్రయోగించి తెలిసికొనవలసిన వారమై యున్నాము. అవిధముగానే సకల మతగ్రంథములు ఘోషపెట్టుచున్నవి. మహానారాయణోపనిషత్తు, 8 వ అధ్యాయమున,—

భక్తియోగోనిరుపద్రవః। భక్తియోగాన్ముక్తిః।
తస్మాత్వమపిసర్వోపాయాన్ పరిత్యజ్య
భక్తిమాశ్రయ। భక్తినిష్ఠోభవభక్తినిష్ఠోభవ।
భక్త్యాసర్వసిద్ధయసిద్ధ్యంతి॥

„భక్తియోగము ఉపద్రవము లేనిది. భక్తియోగమువలన ముక్తి కలుగును. ఆకారణమునుండి నీవే సర్వోపాయములను విడిచి భక్తిని ఆశ్రయింపుము. భక్తియందు నిశ్చలచిత్తుడవుకమ్ము. భక్తియందు నిశ్చలచిత్తుడవుకమ్ము. భక్తిచేత సమస్తసిద్ధులు సిద్ధించుచున్నవి" అని నారాయణుడు బ్రహ్మకు నుపదేశించెను. స్కాందపురాణము, శివమాహాత్మ్యఖండము, 7 వ అధ్యాయములో,—శ్లో॥ అతస్సర్వమనుష్యాణాంనహిముక్తిరయత్నతః॥

„కావున సకలజనులకు అప్రయత్నమున ముక్తికలుగజాలదు" అని చెప్పియున్నది. ప్రయత్నము చేయువానికే దేవుని సాహాయ్య కలుగును. ప్రయత్నము చేయనివానికి దేవుడే భక్తిని పుట్టింపవలయునని చెప్పకూడదు. అలాగుననే, మహాభారతము, అను శాసనీకపర్వము, 6 వ అధ్యాయమునందు,—

శ్లో॥ నాబీజంజాయతేకించిన్న బీజేనవినాఫలమ్।
బీజాద్బీజంప్రభవతిబీజాదేవఫలం స్మృతమ్॥

యథాబీజంవినాక్షేత్రముప్తంభవతినిష్ఫలమ్।
తథాపురుషకారేణవినాదైవంనసిద్ధ్యతి॥
క్షేత్రంపురుషకారస్తుదైవంబీజముదాహృతమ్।
క్షేత్రబీజసమాయోగాత్తతస్సస్యంసమృధ్యతే॥
కృతఃపురుషకారస్తుదైవమేవానువర్తతే।
నదైవమకృతేకించిత్కస్యచిద్దాతుమర్హతి॥

„కొంచెమైనను బీజములేనిది కలుగదు. విత్తులేనిది ఫలములేదు విత్తు విత్తునుండియే పుట్టుచున్నది. విత్తునుండియే ఫలమును పుట్టుచున్నదని తెలియబడినది. విత్తులేనిదే భూమి ఫలింపదని యేలాగు చెప్పబడుచున్నదో యాలాగుననే ప్రయత్నము లేనిదే దైవమును (దేవుని వలన కలుగు ఫలమును) సిద్ధింపదు. ప్రయత్నము భూమియనియు, దైవము విత్తనమనియు చెప్పబడినది. క్షేత్రబీజముల కూడికచేత మొక్క వృద్ధియగుచున్నది. ప్రయత్నము చేయబడెనేని దానిని దైవమును అనుసరించును. కొంచెమయినను ప్రయత్నము చేయని మనుష్యుడు దైవ సహాయమును పొందుటకర్హుడు కాడని" నొక్కివక్కాణింపుచున్నది. చివరిగా, రామాయణము, యుద్ధకాండము, 6 వ సర్గయందు,—శ్లో॥ దైవే చకురుతేయత్నంతమాహుఃపురుషోత్తమమ్॥ అనగా „దేవునిమీద భారమువేసి ప్రయత్నము చేయువానిని పురుషులలో ఉత్తమునిగా చెప్పుచున్నారు" అని యున్నది. ఇందు కనుకలముగా సత్యవేదమును బోధింపుచున్నది:—

„విశ్వాసము లేకుండ దేవుని కిష్టుడై యుండుట అసాధ్యము; దేవునియొద్దకు వచ్చువాడు ఆయన యున్నాడనియు, తన్ను వెతుకువారికి ఫలము దయచేయువాడనియు, నమ్మవలెనుగదా." (హెబ్రీ. 11: 6).

„నీతిని, భక్తిని, విశ్వాసమును, ప్రేమను, ఓర్పును, సాత్వికమును సంపాదించుకొనుటకు ప్రయాసపడుము. విశ్వాస సంబంధమైన మంచి పోరాటము పోరాడుము. నిత్యజీవమును చేపట్టుము" (1 తిమో 6: 11-12).

కాబట్టి మనము స్వేచ్ఛాచిత్తులమై దైవభక్తిని బుద్ధిపూర్వకముగా విసర్జించి భక్తి దేవుడే పుట్టింపవలయునని చెప్పకూడదు. దేవుని యందు దోషారోపణ చేయరాదు. (యాకోబు 1: 13-15). ప్రయత్నించుట మన ధర్మము. మనకు గలిగిన సంకల్పమును దేవుడు తన పరిశుద్ధాత్మద్వారమున వృద్ధిచేయును.

కావున ప్రియసోదరులారా! మీరు తారకమూర్తియైన క్రీస్తే గతియని నమ్మి ఆయన యందే భక్తి నిలుపవలయును. "ఓక్రీస్తూ! దయానిధీ! నేను గొప్ప పాపిని, నేను పాపములను ద్వేషించి నీచిత్తము చొప్పున నడుచుకొందును; నా పాపములను హరించి, నన్ను కృపతో జూచి, నీపరిశుద్ధాత్మను దయచేసి, నన్ను నడిపింపుము" అని వేడుకొనుము అప్పుడు మీరు భక్తులగుదురు. క్రీస్తు మీకు భక్తపాపహరుఁడగును. అద్వితీయ సత్యదేవునిని, ఆయన పంపిన యేసు క్రీస్తును ఎఱుగుటయే నిత్యజీవము (యోహా. 17: 3).

1 కం॥ భక్తజనపాపహరుసిన్।
ముక్తజనారాధ్యు నమిత మునిగణవంద్యున్।
భక్తిఁ గొలందిఁ నిచ్చలు।
భక్తిని శ్రీ యేసుప్రభుఁ బ్రణుతింపఁదగున్॥

2 తే॥గీ॥ సర్వసామ్రాజ్యకంప సత్యవతారమూర్తి।
అఖిల దిక్ప్రసిద్ధ దీనావనమూర్తి।
ఆతఁడే లోకైక రక్షణాధారమూర్తి।
[illegible] పాదసేవ చాల్ప్రఁ [illegible]॥

3 తే॥గీ॥ భక్తపాపహారుండు సద్బాంధవుండు
అట్టి శ్రీక్రీస్తుఁడే కాక యన్యదైవ
ముక్తిదాయకుండు లేఁడు నిక్కముగను।
నమ్మి గొల్చిన పాపముల్ చిమ్మివేయు॥

4 తే॥గీ॥ శుద్ధులను జేసి నిజలోక సిద్ధినొసఁగుఁ।
గాన సోదరులార యీక్రమముఁ దెలిసి।
సంచరింతురుఁ గావుత సంతతంబుఁ।
జనువఁ గోరెద దేవుని చరితమెల్ల॥

సంపూర్ణము.